# వనిత

జూలై '79

వెల: 2 రూపాయలు



పశ్చిమదేశాల ప్రథమ వనితా ప్రధాని

నవతా ఆర్ట్స

# ఇంటింటి రామాయణం

కలర్

నిర్మాత: ఎన్.కృష్ణంరాజు. దర్శకత్వం: పి.సాంబశివరావు




అన్నపూర్ణ

# ఇప్పుడు బోర్న్‌విటా ఒలింపిక్ పానీయంగా గుర్తింపబడుతోంది






మీకు ఎంతో ఇష్టమైన బోర్న్‌విటా ఇప్పుడు భారత దేశపు ఒలింపిక్ ఆహార పానీయంగా 1980 మాస్కో ఒలింపిక్ ఆర్గనైజింగ్ కమిటీద్వారా అనుమతి పత్రం పొందింది.

బోర్న్‌విటా 1980 భారతదేశపు ఒలింపిక్ జట్టుకు "అధీకృత సరఫరాదార్లు" అయిన ఘనతకూడా పొందింది.

బోర్న్‌విటా ఎందుకు ?

ఎందుకంటే బోర్న్‌విటా కోకో, మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది. ఒక కప్పు వేడిపాలలో, రెండు చెంచాలతో, అతి రుచికరమైన పానీయం తయారవుతుంది.

మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా రోజుకు రెండుసార్లు ఇవ్వండి. వారికి ఆరోగ్యమైన మరియు ఉత్సాహభరితమైన జీవనానికి తగిన పోషకత్వము చేకూర్చేందుకు సహాయపడుతుంది. మీకు కూడా బోర్న్‌విటా అవుసరం వారికి తగ్గట్టుగా ఉండేందుకు !




**క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా**

ఉత్సాహభరితమైన జీవనంకోసం

OBM/2927/TL



'అభిప్రాయాలు' శీర్షికలో ప్రచురింపబడే ప్రతి లేఖకూ చిన్న పారితోషికం ఐదు రూపాయలు

## 'మాంగళ్యతంతునానేన....'

వివాహంలో మంత్రాలూ, తంతూ గురించి చాలా చక్కగా తెలియజేస్తున్నారు బామ్మగారు. హైందవ సంప్రదాయం ప్రకారం వివాహం తంతులో జరిగే ప్రతిదీ విశేషార్థంతో కూడి వుంటుంది. అయితే కొందరు ఈ వివాహ తంతును సక్రమంగా జరిపించరు. కారణం ఏమిటంటే—వారి సంప్రదాయాలలో మొదట్నుంచీ లేకపోవడం; ఉన్నా వాటిని గురించి సరిగా తెలియకపోవడం, తెలిసినా, నేటి నాగరికత వాటిని తుడిచేయడం. కొన్ని వర్ణాల వారికి వివాహాది కార్యాలలో కొన్ని పద్ధతులు వేరు వేరుగా వుంటాయి. అవి వారి, వారి పూర్వాచారాలనుబట్టి అట్లానే కొనసాగుతూ వుంటాయి — ఏది ఏమైనా వారి వారి ఆచారాలకీ, సాంప్రదాయాలకీ భిన్నంగా నేటి నాగరికతని అడ్డు పెట్టుకొని నడుచుకోకూడదు. పెళ్లిలో పురోహితుడు చెప్పిన ప్రకారం వధూవరులు పలకరు. చాలా పెళ్లిల్లలో చూశాను – మంగళ సూత్రధారణ జరిగేటప్పుడు "మాంగళ్య తంతునానేన...." అన్న మంత్రం పురోహితుడు మాత్రమే చెప్పుకుపోతాడే కానీ, పెళ్లికుమారుడు మాత్రం నోరారా పలకలేడు! ఏది ఏమైనా - వరుడు "మాంగళ్య తంతునానేన...." అన్న మంత్రం నోరారా అనాలి – పురోహితుడు మాత్రమే అంటే అది ప్రమాదమే గదా!

**ఆళ్లచెర్వు అన్నపూర్ణ** — **గుంతకల్లు**

## ఇది నాగరికతా?

స్త్రీల శీల రక్షణ కోసం రేపెల్ ఇండస్ట్రీస్‌వారు తయారు చేసిన ఎన్-బుడెల్ మెర్కాప్టన్ అనే ఓ విధమయిన నూనె దుర్గంధాన్ని విరజిమ్ముతుందని, దాన్ని భరించలేక మానభంగానికి తలపడిన దురాగ్రహుడు పారిపోతాడని - మే నెల సంచికలో ఓ చిన్న ఫీచర్ చూసాం కదా? ఈ ఆయుధం చాలా ఉపయోగకరమయిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. నూతన ప్రయోగాల ద్వారా మరిన్ని ఉపయోగకరమయిన వస్తువులను మనకందిస్తున్న సమాజాన్ని 'నాగరిక సమాజం!' అని ఓ ముద్దు పేరుతో పిలుస్తున్నాం. ఆదిమానవుడు ప్రాణరక్షణ కోసం ఆయుధాల్ని ఉపయోగించాడు. అందుకనే వాళ్లు అనాగరికులు అన్నాం. నేటి స్త్రీ - శీల రక్షణ కోసం ఆయుధాన్ని ఉపయోగిస్తుంది. అందుకనే నాగరిక సమాజం అంటున్నాం. ఆదిమానవుల అనాగరితకు, నేటి సమాజంలోని నాగరికతకు తేడా ఏమిటీ? వ్యాధి రాకుండా కాపాడుకోవటం, వ్యాధికి చికిత్స తీసుకోవటం కన్న మంచి మార్గం. సమాజంలో మానభంగం వంటి అమానుష చర్యల నుంచి స్త్రీ కాపాడబడ్డానికి మార్గం సూచించడంకన్న ఆ అమానుష చర్యలను వేళ్ళనుండి పెగిల్చి పారేసే నీతి చూపడం ఎంతయినా అవసరం. నేటి పత్రికలు యువతరాన్ని ప్రభావితం చెయ్యగల శక్తిని కల్గివున్నాయి కనుక రచయితలు తమ రచనల్లో వైవిధ్యం చూపుతూ సమాజంలో చీకటి కోణాల్లోకి ప్రవేశించి నీతి అనే వెలుగు మార్గం చూపాలి! ఆ నాడే 'నాగరికత' అనే పదానికి సరయిన అర్థం దొరుకుతుంది.

**సహూరాబేగం** — **సికింద్రాబాదు**

## నగ్న సత్యం!

ప్రతినిత్యం మనం చూస్తున్న దిన, వార పత్రికల సినిమా ప్రకటనల్లో కనీసం ఒక్కటయినా—'A' "పెద్దలకు మాత్రమే" అని కనిపిస్తోందీనాడు. అంతేకాక, ఆ ప్రకటనల్లో వేస్తున్న 'స్త్రీ'ల అంగాంగ ప్రదర్శనలకూ, శృంగార భంగిమలకూ ప్రతి స్త్రీ సిగ్గుపడాల్సివస్తోంది. ఆ ప్రకటనలు అసభ్యకరం మాత్రమే కాక, అత్యంత జుగుప్సాకరంగా వుంటున్నాయి. పిల్లలతో సహా ఇంటిల్లిపాదీ చూడదగ్గ, దిన, వార పత్రికల్లో ఈ రకం పచ్చి శృంగారం ద్విగుణీకృత మవుతూంటే, ఇంక 'పెద్దలకు మాత్రమే' అని నిర్బంధించడం వలన కలిగే ప్రయోజనం ఏమిటి? అదీకాక, ఈ ప్రకటనలు అతిశయోక్తికరంగా, సినిమాల్లో వున్నదానికంటే పదిరెట్లు అధికంగా 'సెక్సు'ను 'మిక్సు' చేస్తూ వెలువడ్డం నిజంగా విచారకరం. సెన్సారు వారి కత్తెరకు బలి అయిపోయిన సన్నివేశాలు కూడా ఈ ప్రకటనల్లో చోటు చేసుకోవడం, పైగా అది ఒక ప్రత్యేక ఆకర్షణగా వినియోగించుకోవడం గర్హింపదగ్గ విషయం. 'పెద్దలకు మాత్రమే' అయినా, ఇప్పుడు మనముంటున్న ఈ సాంఘిక వ్యవస్థలో 'సెక్సు' ఎంతవరకూ అవసరం? అన్నది ఆలోచించదగ్గ విషయం. ఒకవైపు సంతాన నిరోధానికై చర్యలు తీసుకొంటూ మరోవైపు ఇటువంటి 'సెక్సు' ఉత్ప్రేరకాలను ఉత్తేజింప చేయడం హాస్యాస్పదం. చూడగా 'A' సర్టిఫికేటు అనేది నిజానికి, 'పెద్దలకు మాత్రమే పరిమితం' అనే నిబంధనను తెలియచేయడం మానేలా వున్నా


# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి: 5 సంచిక: 1

జూలై: 1979

విడి ప్రతి: రెండు రూపాయిలు

సం॥ర చందా: ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక: రూ. 2.00 (ఇండియా)

మలేసియా: 90 సెంట్స్

చిరునామా:

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026

# విద్యార్థినులకు:

**కాలేజి, హైస్కూళ్ళలో చదువుతున్న విద్యార్థినులకు ఒక పోటీ శీర్షిక :**

## "స్త్రీ స్వాతంత్ర్యం—వైవాహిక బంధం"

పెళ్లికి ముందు స్త్రీలకు ఎన్నో స్వతంత్ర భావాలూ, స్వేచ్ఛా వుంటాయనీ, వివాహం కాగానే ఇంటికీ భర్తకూ కుటుంబానికీ కట్టుబడి పోవడంతో వారి స్వేచ్ఛకు అంతరాయం కలుగుతుందనీ ఒక వాదం వున్నది. ఈ వాదం నిజమా? నిజంగా వివాహ బంధం స్త్రీ స్వాతంత్ర్యానికి ఆటంకం కలిగిస్తున్నదా? లేక, అలాంటిదేమీ ఉండదంటారా?—

ఈ విషయాన్ని తీసుకుని, రెండు తావు సైజు పేజీలకు మించకుండా వ్యాసాలను రాసి, జూలై 7వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.

ఈ పోటీ కేవలం విద్యార్థినులకే పరిమితం. విద్యార్థినులు వారి ఇంటి చిరునామాలు కాకుండా, చదువుతున్న తరగతి ఇస్టూ-కాలేజీ లేదా హైస్కూలు చిరునామాలు ఇవ్వాలి:

ఈ వ్యాసాలలో ఎన్నికైన మూడింటికి మూడు బహుమతులు వుంటాయి.

**ప్రథమ బహుమతి: రూ. 100**
**ద్వితీయ బహుమతి: రూ. 75**
**తృతీయ బహుమతి: రూ. 50**

ఉత్సాహం గల విద్యార్థినులందరూ ఈ పోటీలో పాల్గొని, జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

ప్రస్తుత పరిస్థితిలో అది, అన్ని తరహాల ప్రేక్షకులకు ఒక ప్రత్యేక ఆకర్షణ ఏమో అన్పిస్తోంది. ఇలాంటి చవకబారు 'సెక్సు' సినిమాలూ, పనికిమాలిన సెక్సు సాహిత్యం మన సాంఘిక వ్యవస్థలో స్వైర విహారం చేస్తున్నంత కాలం, 'స్త్రీ'ని పురుషుడు తనతో సమానంగా గౌరవించే మంచి రోజు మున్మాటికీ రాదు. ఇది మాత్రం నగ్న సత్యం!....

ఎం. హరిప్రియ — శ్రీకాకుళం

### వనితల వివాహ వయస్సు!

ప్రాచీన కాలం నుండి మన భారతదేశంలో ముక్కుపచ్చలారని బాలబాలికలకు వివాహం చేసే పద్ధతి గోచరిస్తుంది. రజస్వలానంతర వివాహం పాపమన్న ఛాందస భావాలు సమాజంలో ఏర్పడటంతో బాల్య వివాహాలు ఉధృతంగా పెరిగి అనేకానర్ధాలకు దారితీశాయి. యౌవనప్రాయంలో సరిగా అడుగిడకుండానే వనిత జవసత్వాలుడిగిపోయి దైహికంగా, మానసికంగా జీవచ్ఛవం అవుతూ వచ్చింది. ఆ కాలంలో కలిగిన సంతానం కూడా దేశ దారిద్ర్యానికి ప్రతీకలుగా వుండడమే కాకుండ, దేశ జనాభాను పెంచే పరిస్థితి ఏర్పడింది. ఆడపిల్ల పుట్టినప్పటి నుంచీ ఆమె వివాహం పైననే దృష్టి నిలిపే సాంప్రదాయం వున్న దేశం మనది కావటంతో, తలిదండ్రుల అనవసర ఆరాట పోరాటాలకు అతివ బలి అవుతూ వచ్చిందే కాని వివాహం ఐనా స్త్రీ అభ్యుదయం యేమిటి? అన్న ప్రశ్న ఇటీవలి కాలం వరకు యేర్పడలేదు. అతి బాల్యవివాహాల నరికట్టే శారదా ఆక్టు వచ్చిన తరవాత కానీండీ, సమాజంలో నాగరికతాభివృద్ధివల్ల కానీండి, స్త్రీ విద్య, వృత్తి సంపాదనవల్ల కానీండి, వనితల వివాహ వయస్సులలో యెంతో పెంపుదల వచ్చి వారికి దైహిక, మానసిక స్వస్థత యేర్పడింది. భారతీయ శిక్షాస్మృతిలో గూడ రజస్వలాత్పూర్వ వివాహం మానభంగం నేరంగా భావించటం చేత కూడా బాల్య వివాహాలకు మనవారు వెనుకంజ వేశారు.

నేటి సమాజంలో ఉమ్మడి కుటుంబ వ్యవస్థ దాదాపు భగ్నమైంది. స్త్రీలు ఆర్థికంగా పురుషుల పై ఆధారపడవలసిన అగత్యాలు కూడ అంతకంతకూ దూరమవుతున్నాయి. విద్యా వివేక సంస్కారాల కారణంగా తెలిసీ తెలియని వయస్సులో చేసే లైంగిక నేరాలకు కూడ స్త్రీలు విచక్షణతో దూరంగా వుంటున్నారు. అంచేత వనితల వివాహ వయస్సు ఖచ్చితంగా పెరిగిందనే చెప్పొచ్చు. అయినప్పటికీ ఆంతరంగిక కారణాలవల్ల కొన్ని సంవత్సరాల పాటు పెళ్ళికి దూరంగా వున్న స్త్రీలపట్ల సమాజంలో యింకా దురభిప్రాయం తొలగిపోలేదు. స్త్రీకి సాధారణ వివాహ వయస్సు 18 సం॥ అనుకుంటే, ఒక అయిదారు సంవత్సరాలు ఆలస్యంగా ఆమెకు వివాహం జరిగినా ఏ విధమైన శారీరక, సామాజిక హాని వుండదు. ఆ విషయం అందరూ గుర్తుంచుకోవటం అవసరం. పురుషులతో సమాన ప్రతిపత్తి కోసం పడతులు పోరాడుతున్న యీ రోజుల్లో తమ స్వయం పోషకత్వం, స్వాతంత్ర్యం నిలదొక్కుకోటానికైనా వివాహ వయస్సును పెంచక తప్పదు. బాల్య వివాహాల నిషేధ చట్టం ప్రస్తుతము స్త్రీలకు 18 సం॥లు గాను, పురుషులకు 21 సం॥ గాను వివాహ వయస్సులను నిర్ణయించింది. కాని ఈ వయస్సు యింకా పెరగాల్సిన అవసరం నేడెంతైనా వున్నది. వర్తమాన సామాజిక పరిస్థితుల్నిబట్టి స్త్రీలకు 21 సం॥ యేర్పరచటం ఎంతో అవసరం. ఆ సమయంలో బాలిక తన విద్యా, వృత్తి సంపాదనను పూర్తి గావించుకొని, దూరదృష్టితో, వివేకంతో జీవిత భాగస్వామి నెన్నుకోగలదు. బాలికల వివాహం కోసం తలిదండ్రులు పడే అనవసరపు తొందరపాటు వరకట్న పిశాచి వికృత నాట్యానికి కారణమవుతున్నది. దీనివలన ఆ దుర్గమత చాలవరకు తొలగటమే కాక స్త్రీ తన కాళ్ళమీద తాను నిలబడి తన వివాహాన్ని తానే చేసుకొనగల శక్తి యుక్తులు కూడా యేర్పడతాయి.

యస్. జ్ఞానేశ్వరి — ఖమ్మం

# చూపుకి
# అందం
# కంటికి
# చలవ
# అదే
# ఐటెక్స్
# కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్ళుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033





# బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్

## ముఖచిత్రం

"స్త్రీలకు ఉన్నతస్థానాన్ని కల్పించే విషయంలో, బ్రిటన్-ఆసియాను అందుకున్నది. శుభాకాంక్షలు"_ అంటూ ఒక వనిత మరో వనితను అభినందించింది.

అభినందించిన వ్యక్తి – ప్రధానమంత్రి పదవిని కోల్పోయిన వనిత శ్రీమతి ఇందిరాగాంధి. అభినందనలు అందుకున్న వ్యక్తి – బ్రిటన్‌కు ప్రధానమంత్రిగా ఎన్నుకోబడిన తొలి వనిత శ్రీమతి మార్గరెట్ హిల్డా థాచర్!

బ్రిటన్ పార్లమెంటు ఎన్నికలలో – శ్రీమతి మార్గరెట్ థాచర్ నాయకత్వంలో – కన్సర్వేటివ్ పార్టీ ఘనవిజయం సాధించడంతో_ఆమె ఆ పార్టీ తరపున ఐదవ ప్రధానిగా పరిపాలన చేపట్టింది. ఇదివరకు సర్ విన్‌స్టన్ చర్చిల్, హెరాల్డ్ మాక్మిలన్, సర్ అలెక్ డగ్లస్‌హోమ్, ఎడ్వర్డ్ హెత్-కన్సర్వేటివ్ పార్టీ నాయకులుగా ప్రధానమంత్రి పదవిని నిర్వహించారు. ఈ ఎన్నికలలో- అధికారపక్షంలో ఉన్న లేబర్‌పార్టీ పరాజయం పొందింది!

ఇజ్రేల్, శ్రీలంక, ఇండియా దేశాలకు ప్రధానమంత్రులుగా పదవులు నిర్వహించి, అంతర్జాతీయ రాజకీయరంగంలో ప్రముఖ వ్యక్తులుగా రాణించిన మహిళల్లో-గోల్డా మేయర్ మరణించడం, శ్రీమతి సిరిమావో బండారనాయకే, శ్రీమతి ఇందిరా గాంధీలు పదవులు కోల్పోవడంతో - మహిళా దశాబ్దానికి ఏదో లోటు జరిగిందని అనుకుంటున్న వనితలకు థాచర్ విజయం కొంత ఉత్సాహాన్ని కలిగించింది!

మార్గరెట్ థాచర్ 1925 అక్టోబర్ 13న పుట్టింది. ఆమె తండ్రి రాబర్ట్స్ కిరాణా వ్యాపారి అయినా, రాజకీయ రంగంలో విశేషానుభవం సంపాయించిన వ్యక్తి. కౌన్సిలర్ పదవి, మేయర్ పదవులూ నిర్వహించారు. విద్యార్థిగా చిన్నప్పుడే తన మేధాశక్తిని ప్రదర్శించి, అందరి అభిమానాన్నీ చూరగొన్న మార్గరెట్ బి. ఎస్‌సి., (నేచురల్ సైన్స్), ఎమ్. ఎ. డిగ్రీలు పొందిన తర్వాత ఒక పారిశ్రామిక సంస్థలో - నాలుగేళ్ళపాటు రీసెర్చి కెమిస్టుగా పని చేశారు. ఒక ప్రక్క ఉద్యోగం చేస్తూనే, న్యాయశాస్త్రాన్ని అభ్యసించి, బారిస్టర్ అయ్యారు.

చదువుతూ వుండగానే తండ్రి ప్రోద్బలంతో - రాజకీయ రంగంలోకి ప్రవేశించారు మార్గరెట్. 1951లో ఆమెకు డెనిస్ థాచర్‌తో వివాహం జరిగింది. డెనిస్ రెండవ ప్రపంచ యుద్ధంలో మేజర్‌గా పని చేశారు. ఆ తర్వాత ఆయన పారిశ్రామిక రంగంలో ప్రవేశించారు. ఈ దంపతులకు కవల పిల్లలు- ఒక్క అమ్మాయి, ఒక అబ్బాయి. కొడుకు మార్క్ లండన్‌లో అకౌంటెంట్‌గా పని చేస్తున్నాడు. కూతురు కెరోల్ - ఆస్ట్రేలియాలో పత్రికా రచయిత్రిగా పనిచేస్తోంది.

మార్గరెట్ థాచర్ - '59లో కన్సర్వేటివ్ పార్టీ తరపున ఫించ్లే నియోజకవర్గంనుంచి హౌస్ ఆఫ్ కామన్స్‌కు ఎన్నిక కావడం - ఆమె రాజకీయ జీవితంలో ప్రధానమైన మలుపు! తొలిసారిగా ఆమె '61లో 'పెన్షన్స్ అండ్ నేషనల్ ఇన్సూరెన్స్'

మంత్రివర్గంలో పార్లమెంటరీ సెక్రటరీ పదవిని నిర్వహించారు. '64 నుంచి '70 వరకు కన్సర్వేటివ్ పార్టీ ప్రతిపక్షంలో ఉండగా, అధికార పక్షన్ని తీవ్రంగా విమర్శిస్తూ - ప్రజలను విశేషంగా ఆకర్షించారు మార్గరెట్ థాచర్. ఆ తర్వాత - '70లో కన్సర్వేటివ్ పార్టీ అధికారంలోకి రాగానే - విద్యాశాఖలో 'సెక్రటరీ ఆఫ్ స్టేట్' పదవిని నిర్వహించారు. '74లో జరిగిన సాధారణ ఎన్నికలలో - ఆమె పార్టీ పరాజయం పొంది 'లేబర్ పార్టీ' అధికారంలోకి వచ్చింది. '75లో మార్గరెట్ థాచర్ - ప్రతిపక్షానికే కాక, కన్సర్వేటివ్ పార్టీకి నాయకురాలిగా కూడా ఎన్నికయ్యారు।

లేబర్ పార్టీ పరిపాలనలో ప్రభుత్వ విధానాలు - ప్రజలలో అశాంతిని రేకెత్తిస్తున్నాయని ఆమె కెలహాన్ మంత్రి వర్గంపై తీసుకొచ్చిన అవిశ్వాస తీర్మానం - నెగ్గడంతో, ఒక్కసారిగా మార్గరెట్ థాచర్ వార్తల్లోని వనిత అయింది. ఆ తర్వాత జరిగిన ఎన్నికల్లో ఆమె పార్టీ విజయం సాధించి, అధికారంలోకి వచ్చింది. ఆ విధంగా యూరప్‌లోనే తొలిసారి ఓ వనిత ప్రధాన మంత్రి అయిన గౌరవాన్ని - ఆమె పొంద గలిగింది।

సమాజంలోని ప్రతి వ్యక్తీ తన భవిష్యత్తును ఉన్నతంగా రూపొందించుకోడానికి సంపూర్ణమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉండాలని, వ్యక్తుల పురోగమనానికి ఆటంకం కలిగించేవిధంగా ప్రభుత్వ విధానాలు ఉండకూడదనీ ఆమె వాదిస్తారు. ఆ వాదన ధనస్వామ్యవాదాన్నే ప్రతిబింబిస్తున్నదని, కన్సర్వేటివ్ పార్టీ-శ్రీమంతులకు మేలు కలిగే విధానాలనే చేపడుతోందని, సంస్కరణ వాదాన్ని ప్రతిబింబించేలా ఏవో కొన్ని చట్టాలు ప్రవేశపెడుతుందే తప్ప - సామాన్య ప్రజానీకం ఎదుర్కొనే సమస్యలకు పరిష్కారమార్గం చూపలేదనీ - ఆ పార్టీని విమర్శించేవారు అంటారు. సోషలిస్టు విధానాలకు వ్యతిరేకిగా, మితవాదపక్షంగా కన్సర్వేటివ్ పార్టీపట్ల గల అసంతృప్తిని-పోగొట్టడానికి శ్రీమతి థాచర్ ఏం చేయనున్నారనీ ప్రపంచం ఆసక్తికరంగా ఎదురు చూస్తోంది।

ముఖ్యంగా-బ్రిటన్‌కు వలసవచ్చిన శ్వేతేతరులు ప్రత్యేకించి ఆసియా నుంచి వచ్చినవారి సమస్యలు, వారి సంక్షేమం ఇప్పుడు అందరూ చర్చించే అంశం అయింది. ఈ విషయంలో శ్రీమతి థాచర్ కొంత 'మొండి వైఖరి'ని అవలంబిస్తున్నారని, ఇదివరకే ఆమెపట్ల విమర్శలు వచ్చాయి।

ఆర్థికసంక్షోభం, కార్మికుల ఉద్యమాలు, సమ్మెల బెడద, మొదలైన సమస్యలతో - బ్రిటన్ పరిస్థితి ఇప్పుడు అస్తవ్యస్తంగా వుంది. అటువంటి సమయంలో ఎన్నికలు జరగడం, దేశ సమస్యలను తాను చక్కబరచగలనని శ్రీమతి మార్గరెట్ ఎన్నికల ముందు అనేక వాగ్దానాలు చేయడంతో, ఆమె పరిపాలనపట్ల 'ఆశ'లు ఏర్పరచుకుని ప్రజలు ఆమెను ఎన్నుకోవడం-జరిగింది.

శ్రీమతి ఇందిరాగాంధి ప్రధానమంత్రిగా భారత దేశ రాజకీయాలలో నిర్వహించిన ప్రముఖ పాత్ర తనకు మంచి ప్రేరణ కలిగించిందని - ఒకప్పుడు శ్రీమతి థాచర్ పేర్కొన్నారు. ఆ తర్వాత మన దేశంలో ఆత్యయిక పరిస్థితి ప్రకటింపబడడం, దేశంలో ఎన్నో పరిణామాలు రావడం అందరికీ తెలిసినదే.

శ్రీమతి థాచర్ - ఈ పరిణామాలను దృష్టిలో ఉంచుకుని, తనలోని లోపాలను సరిదిద్దుకుని, దేశ రాజకీయరంగంలోను, అంతర్జాతీయ రాజకీయ రంగాలలోను - రాణించగలిగితే, వనితాలోకం - అప్పుడు సగర్వంగా ఆమెను కీర్తిస్తుంది। ❋




ప్రపంచంలో రోజు రోజూ సంభవిస్తున్న పరిణామాలు చూస్తూ వుంటే వనితలు అన్ని రంగాలతో పాటు రాజకీయ రంగంలోనూ సముచిత స్థానం ఆక్రమిస్తున్నారనీ తెలుస్తుంది. బ్రిటన్ ప్రధానిగా మార్గరెట్ థాచర్ ఎన్నిక కావడంతో పశ్చిమ దేశాల రాజకీయ చరిత్రలోనూ 'వనితా ప్రకరణం' ప్రారంభమయింది. అయితే ఒక వనిత ప్రధాని పదవిలో అనేక సంవత్సరాలు వున్న ప్రజాస్వామ్య దేశం భారతదేశంలో నేడు వనితలు చెప్పుకోదగ్గ రీతిలో ముందడుగు వేయడం లేదని వివరాలు లభిస్తున్నాయి.

భారత రాజ్యాంగంలో పురుషులతో పాటు వనితలకీ సమాన హక్కులు వున్నాయి. ఆ హక్కులు కాపాడడానికి మన ప్రభుత్వాలు కృషి చేస్తున్నాయి. అయినా వనితలకి అభివృద్ధి ప్రణాళికలు ఏ విధంగానూ వుపకరించడం లేదని కేంద్ర విద్యాశాఖామంత్రి తీవ్ర ఆందోళన వ్యక్త పరుస్తూ, ఆ విషయాన్ని వివిధ రాష్ట్రాల ముఖ్య మంత్రుల దృష్టికి తెచ్చారు.

1952 నుంచి జరిగిన ఆరు సాధారణ ఎన్నికలలో పాల్గొన్న వనితల వివరాలు సేకరిస్తే, 1952లో వోటర్ల జాబితాలో 45 శాతం వనితలు వుండేవారనీ, 1977 లో 48 శాతం వున్నారనీ తేలింది. అయితే పురుషులతో దరిదాపు సమానంగా వోటింగ్‌లో పాల్గొని రాజకీయ పరిణామాలు తీసుకువస్తున్న భారతీయ వనితలు రాజకీయాలలో అంతగా ఆసక్తి కనపరచడంలేదు. మే నెల ఆఖరి వారంలో న్యూఢిల్లీలో సమావేశమయిన "నేషనల్ కాన్ఫరెన్స్ ఆఫ్ వుమన్ అండ్ డెవలప్‌మెంట్" సభ్యులు మన దేశంలో వనితలు అభ్యుదయం సాధించకపోవడానికి వివిధ రాజకీయ పక్షాలే కారణమని పేర్కొన్నారు. ఎన్నికలలో తమ పార్టీ తరపున అధిక సంఖ్యలో వనితలు పోటీచేసే వీలు ఏ పార్టీ కలిగించడంలేదనే తీవ్ర ఆరోపణ వీరు చేశారు. లోకసభలోనే కాక ఆఖరికి పంచాయితీ సమితులలోనూ వనితలకి తగిన ప్రాతినిధ్యం లభించకపోవడం దేశ దౌర్భాగ్యానికి చిహ్నమనీ వీరు ఆవేదన వెలిబుచ్చారు. రాజకీయాలలో పురుషుల పెత్తనం కొనసాగినంతకాలం వనితలకి తగిన గుర్తింపు లభించదనీ వీరు అభిప్రాయం వ్యక్తపరచారు.

కేంద్ర, రాష్ట్రమంత్రి సభలలో వనితలకి తగినన్ని స్థానాలు వుండాలనీ, ఒక ప్రక్క రాజకీయాలలో వనితల ప్రవేశానికి మార్గం సుగమంచేస్తూ మరో ప్రక్క వనితలకి విద్యావకాశాలు మెరుగుపరచి, వారికి ఆర్థిక స్వాతంత్ర్యం లభించేటట్లు కృషి జరగడానికి వనితా సంఘాలు ముందడుగు వేయాలని న్యూఢిల్లీ సభలో తీర్మానించారు. వనితలు పురుషులతో సమానంకాదనీ ఒక మెట్టు పైనే వున్నారని నిరూపించే రోజు రావచ్చేమో!

**పాకిస్తాన్‌లో పరిణామాలు**

పాకిస్తాన్ మాజీ ప్రధాని జుల్ఫికర్ అలీ భుట్టోని రాజకీయ హత్య చేశారని అక్కడ మిలిటరీ ప్రభుత్వం ఉరి తీసింది. ప్రపంచ దేశాలన్నీ పాకిస్తాన్ మిలిటరీ ప్రభుత్వపు చర్యని హర్షించలేక పోయాయి. పాకిస్తాన్‌లోనూ దేశవ్యాప్తంగా నిరసన ప్రదర్శనలు జరిగాయి.

ఇప్పుడు భుట్టో కుమార్తె కుమారి బెన్‌జీర్ పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్యం పునరుద్ధరించడానికి తాను కంకణం కట్టుకున్నానని చెప్పడంతో ఆ దేశ రాజకీయ చరిత్రలో కొత్త మలుపు ప్రారంభమయింది. గృహ నిర్బంధం నుంచి యిటీవలే విడుదల చేయబడిన బెన్‌జీర్ పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్య శక్తులనన్నిటిని ఏకం చేయడానికి తాను ప్రయత్నిస్తానని ప్రకటించింది.

ఒక సంవత్సరం పాటు గృహ నిర్బంధంలో వుండడం వలన తను, తన తల్లి వాస్తవ ప్రపంచానికి దూరమయిపోయామనీ చెప్తూ జనరల్ జియా మిలిటరీ పాలనని తీవ్రంగా విమర్శించింది బెన్‌జీర్. పాకిస్తాన్‌లో సామాన్య ప్రజల స్థితిగతులు మెరుగు పరచడానికి తాను, తన తల్లి కృషిచేస్తామనీ, తన తండ్రి ఆశయాలు అమలుపరచే కార్యక్రమాన్ని తాను చేపడ్తాననీ బెన్‌జీర్ పేర్కొంది.

పాకిస్తాన్‌లో భుట్టోకి మరణశిక్ష అమలుపరచిన తర్వాత అక్కడి నియంతల పాలనలో పరిస్థితులు పాలకులకి ఎదురు తిరగవనుకుంటున్న సమయంలో బెన్‌జీర్ రంగప్రవేశం చేయడంతో రాజకీయ వాతావరణం మారుతుందని పరిశీలకులు భావిస్తున్నారు. ముస్లిం సంప్రదాయం ప్రకారం నాలుగు నెలల పది రోజులు సంతాపకాలం గడిచాక భుట్టో సతీమణి శ్రీమతి నజరత్ కూడా ప్రజలని సమీకరించడానికి బయటకు రావడంతో పాకిస్తాన్ రాజకీయాలలో మరో మలుపు తిరగవచ్చు.

నవంబర్ 17న జనరల్ జియా పాకిస్తాన్‌లో సాధారణ ఎన్నికలు వాగ్దానం చేసిన ప్రకారం నిర్వహిస్తే ఆ ఎన్నికలలో పీపుల్స్ పార్టీ తరపున శ్రీమతి నజరత్ పోటీచేసి విజయం సాధించి జనరల్ జియా మీద 'కసి' తీర్చుకోవచ్చు. లేదా, ఈ లోపున తల్లి కూతుళ్ళనిద్దరినీ తిరిగి గృహ నిర్బంధంలోకి జనరల్ జియా పంపవచ్చు! మొత్తం మీద పాకిస్తాన్‌లో ఆసక్తికరమయిన పరిణామాలు సంభవిస్తాయి.

**ఇటలీలో....**

ఇటలీలో రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత యింతవరకూ 41 ప్రభుత్వాలు మారాయి. ఇప్పుడు 42వ ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి అక్కడ ఎన్నికలు జరిగాయి. అయితే మంత్రివర్గాన్ని ఏర్పరచడానికి కావలసిన మెజారిటీ ఏ పక్షానికీ రాలేదు. కాని క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ కమ్యూనిస్టు పార్టీ నుంచి తీవ్రమయిన పోటీ ఎదుర్కొని అత్యధిక స్థానాలు గెలిచింది.

ఇటలీ ఎన్నికలలో నాలుగు కోట్ల మంది వోటర్లు పాల్గొనవలసి వుండగా, చాలామంది తమ వోటింగ్ హక్కుని వినియోగించుకోలేదు. ఏ రాజకీయ పక్షం అధికారంలోకి వచ్చినా పదవిలో వుండేది కొద్దిరోజులు మటుకే అనే ఒకరకం రాజకీయ నిరాశ ఇటలీ వోటర్లలో వుండడమే అందుకు కారణం.

ఇటలీ పార్లమెంట్‌లో వున్న 630 సీట్లలో క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీ 262 సీట్లు నెగ్గింది. కమ్యూనిస్టు పార్టీకి 201 సీట్లు లభించాయి. సోషలిస్టు పార్టీ 62 సీట్లు గెలిచింది. విడాకులకి, గర్భస్రావానికి అనుకూలంగా చట్టం చేయాలని కోరే రాడికల్ పార్టీ గత ఎన్నికలలో కేవలం నాలుగు సీట్లు నెగ్గడం ఒక విశేషం. ఇక క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీ మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పరచి పదవిలో ఎంతకాలం వుంటుందా అని 'ప్రపంచం' ఎదురు చూస్తోంది.

# నింగి నుండి నేలకు

## వాసిరెడ్డి సీతాదేవి

"నిన్ను చూసేదాకా తెలియదు నాలో మనసుందని
నిన్ను తాకేదాకా తెలియదు నాలో వలపుందని నిన్ను.... నిన్ను...."

తల బద్దలు కొట్టుకున్నా ఆ పైన మాటలు తట్టడం లేదు కల్పనకు. విసుగ్గా కాగితాలమీద పేపర్‌వైట్ పెట్టింది. పెన్‌కు కేప్ పెట్టింది. తలెత్తి గడియారంకేసి చూసింది. పదీ ఇరవయ్ అయింది.

వాకిట్లో అలికిడి అయి, తలెత్తి చూసింది. సిద్ధార్థ లోపలకు వచ్చాడు.

"ఇంత ఆలస్యం అయిందేం?" అంటూ సిద్ధార్థ విప్పిన కోటును అందుకోవడానికి చెయ్యి చాచింది కల్పన.

"సినిమాకు వెళ్ళాను." భార్యకు కోటు అందివ్వలేదు. హాంగర్‌కు తగిలించాడు.

"ఎవరెవరు వెళ్ళారు?"

"రాజేంద్రా, నేనూ, లీలా...."

"లీల ఎవరూ?"

"రాజేంద్ర పిన్నికూతురు. బొంబాయినుంచి వచ్చింది. చాలా అందంగా ఉంటుంది." అంటూ భార్య ముఖంలోకి చూశాడు.

అతను ఆశించిన మార్పు కల్పన ముఖంలో కన్పించలేదు.

"డ్రింకు తీసుకుంటావా?"

"తీసుకుంటాను."

"ఏం తీసుకుంటావ్?"

"నువ్వు రాసుకో! నేను తెచ్చుకుంటాలే!" సిద్ధార్థ లోపలకు వెళ్ళాడు.

కల్పన కూడా అతని వెనకే వెళ్ళి ఫ్రిజ్ తెరిచింది.

"స్కాచ్ తీసుకుంటావా?" అన్నది.

"నువ్వెళ్ళి కవిత్వం రాసుకో! నాకు ఏం కావాలో నేను చూసుకోగలను." నిర్లిప్తంగా వుంది అతని కంఠం. కల్పన అదోలా నవ్వుకుంటూ గదిలోకి వెళ్ళిపోయింది. సిద్ధార్థ బాటిల్ గ్లాసూ తీసుకొని వెళ్ళి కూర్చున్నాడు. కల్పన లేచి వెళ్ళి ఐస్ ముక్కలు ప్లేట్లో పెట్టి తెచ్చింది.

"థ్యాంక్యూ!"

"తినడానికి ఏం తెమ్మంటావ్?"

"ఏమీ అక్కర్లేదు." ముభావంగా అన్నాడు.

కల్పన ఎదురుగా కూర్చుంది.

"భోజనం చెయ్యవా?"

"నువ్వు చేశావా?"

"పది గంటల దాకా నేను భోజనం చెయ్యకుండా నీ కోసం ఎదురు చూడనని నీకు తెలుసుగా!"

సిద్ధార్థ చివ్వున తలెత్తి కల్పన ముఖంలోకి చూశాడు.

"ఎల్లుండి మిస్టర్ సంపత్తు కూతురి పెళ్ళట. మిసెస్ సంపత్తు వచ్చి కార్డు ఇచ్చి వెళ్ళింది."

"రాజేంద్రతో ఏం చెప్పావ్?" గ్లాసు చేతిలోకి తీసుకుంటూ అడిగాడు సిద్ధార్థ.

"ఏం చెప్పానని చెప్పాడు?"

"నువ్వేం చెప్పావో చెప్పు!"

"ఆ రోజు వాళ్ళింటికి పార్టీకి నాకు చెప్పకుండానే వెళ్ళావుగా?"

"అవును!"

"రాజేంద్ర నేను రాలేదని అడిగాడు!"

"అవును! అడిగాడు!"

"అందుకు నువ్వు నాకు జ్వరంగా ఉందనీ, అందుకే పార్టీకి రాలేదనీ చెప్పావు!"

"చెప్పాను!" గ్లాసు సగం పూర్తిచేసి టేబుల్ మీద పెట్టాడు. సిగరెట్ తీసి పెట్టె మీద కొట్టి పెదవుల మీద ఓ మూలగా, విలాసంగా ఉంచాడు. అగ్గిపుల్ల వెలిగించకుండానే భార్య ముఖంలోకి చూశాడు.

"మొన్న రాజేంద్ర వచ్చి అడిగేంతవరకూ నువ్వు అలా చెప్పినట్లు నాకు తెలియనే తెలియదు."

"ఏమని అడిగాడు."

"మా ఇంటికి పార్టీకి రాలేదేం వదినా? నీకు ఆరోగ్యం సరిగా లేదటగా అని అడిగాడు."

సంపూర్ణ నవల



ఈ సంచిక నుంచి ఆరంభమవుతున్న 'నింగినుండి నేలకు' సశేష నవల రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి 1953లో తొలిసారిగా రచనా వ్యాసంగం చేపట్టారు. ఆమె రచనలలో కొన్ని 'వైతరణి', 'తిరస్కృతి', 'మట్టి మనిషి', 'తొణికిన స్వప్నం', 'రాబందులు - రామచిలుకలు', 'అర్చన', 'ప్రతీకారం', 'మారిపోయిన మనిషి' మొదలైనవి. ఆమె రాసిన 'సమత' నవలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. సీతాదేవి ప్రస్తుతం 'డైరక్టరేట్ ఆఫ్ యూత్ సర్వీసెస్'లో డిప్యూటీ డైరక్టర్‌గా హైదరాబాదులో వుంటున్నారు.

"అందుకు నువ్వు, నీకు జ్వరం లేదనీ, నీ మొగుడు అతనితో అబద్ధం చెప్పాడనీ చెప్పావ్! అవునా?" అదోలా పలికింది సిద్ధార్థ కంఠం.

"అవును చెప్పాను!"

"అందువల్ల రాజేంద్ర దృష్టిలో నీకు గౌరవం పెరిగిందనుకుంటున్నావా?"

"నా గౌరవం పెరగాలని నేను అలా చెప్పలేదు. నీ గౌరవం తరగాలని చెప్పాను."

సిద్ధార్థ చివ్వున తలెత్తి భార్య ముఖంలోకి చూశాడు. కల్పన లోలోపలే ఆనందించింది భర్త బాధపడుతున్నాడని తెలుసుకొని.

"భర్తను బయటి వాళ్ళ ముందు ఎక్స్‌పోజ్ చెయ్యడం కూడా ఒక ప్రత్యేకతే అనుకుంటున్నావా? అందువల్ల నా గౌరవం తరగదు. కాని నువ్వు మాత్రం ఇతరుల దృష్టిలో చులకన



అవుతావు." సిగరెట్ ఊది సుడులు తిడుగుతున్న పొగలోకి కనుబొమలు ముడిచి చూడసాగాడు.

"అందుకే మిసెస్ రంగనాథం అన్నది....'

"ఏమన్నది?" కళ్ళు తిప్పకుండానే అడిగాడు.

"నీకు అహంకారం ఎక్కువ. నిలువెల్లా గర్వం...."

"ఊఁ ఇంకా!"

"నీ భావాలన్నీ పాత చింతకాయ పచ్చడిలా బూజు పట్టినవి. నీకు పెళ్ళాం అంటే....అదే ఆడదంటే గౌరవం లేదు. భార్య అంటే అడుగులకు మడుగులు ఒత్తుతూ పడివుండే దానిస...."

"థ్యాంక్యూ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్!"

"నా కాంప్లిమెంట్సు కావు....నా స్నేహితురాలివి."

"నీ అభిప్రాయం కూడా అదేనని తెలుస్తూనే ఉందిగా! నీ స్నేహితురాలు నీ భర్త పాత్ర చిత్రణ చెయ్యడం, నువ్వు గర్వంగా మళ్ళీ నీ భర్తకు వినిపించడం....అద్భుతం! భర్తను వాజమ్మను చేసి విచ్చలవిడిగా తిరిగే మిసెస్ రంగనాథం నన్ను పాత చింతకాయ´ పచ్చడి భావాలు కలవాడినన డంలో ఆశ్చర్యం లేదు."

"ఉన్నమాటే అన్నది. నాకు సినిమాల్లో నటించాలని చిన్నప్పటినుంచీ కోరికగా ఉండేది. నేను సౌందర్యవతిని. నాలో కళాపిపాస ఉన్నది. మిసెస్ రంగనాథం తమ్ముడు తన సినీమాలో నన్ను హీరోయిన్‌గా వేషం వెయ్యమన్నాడు. నువ్వు అంగీకరించలేదు. కారణం—నీ సంకుచిత మనస్తత్వమే. నేను కళాకారిణిని కావడం, లక్షలో ఒక్కదానిగా, ప్రత్యేకమైన వ్యక్తిగా కీర్తిశిఖరాలను అందుకోవడం నీకు యిష్టం లేదు. చిన్నప్పటి నుంచి పరిచయం ఉన్నా నిన్ను అర్థం చేసుకోలేకపోయాను. నీలో విశాల హృదయం ఉన్నదనుకున్నాను. మోసపోయాను. ఫలితంగా నాలోని కళాకారిణి చచ్చిపోయింది. నా సౌందర్యం అడవి కాచిన వెన్నెలే అయింది."

సిద్ధార్థ గొల్లున నవ్వాడు.

"ఎందుకు అలా నవ్వుతావ్?"

"కళకు అర్థం తెలుసా నీకు?"

"నువ్వే చెప్పు!"

''కళ ఒక తపస్సు! ఒక పూజ. ఒక అపూర్వ సృష్టి. సినిమా ఆర్ట్ నిజమైన కళ కాదు. అది ఒక మానసిక ఐశ్వర్యం. ఒక తమాషా! మనసును ఉర్రూతలు ఊగించే ఒక తాత్కాలిక సౌందర్యం. కాని నిజమైన కళాకారుడికి వయసుతో నిమిత్తం లేదు. పైగా వయసు పెరిగినకొద్దీ ఒక ఋషిగా మారతాడు. అతనికి మరణం లేదు. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, షేక్స్‌పియర్, గాలిబ్ ఏ నాటి వాళ్ళు? ఈనాటికీ బతికే ఉన్నారు. టాగూర్, ప్రేమ్‌చంద్, శరత్, గురజాడ, బుచ్చిబాబు, గోపీచంద్ మొదలైన వాళ్ళు ఇంకా బ్రతికే ఉన్నారు. వారికి మరణం లేదు. కాని ...నీ సినిమా కళాకారులు ఏరీ? మొన్న చూసినవాళ్ళు నిన్నా, నిన్న




చూసినవాళ్ళు ఇవ్వాళా కన్పించరేం? అందం వయసూ ఉన్నంతవరకే వాళ్ళను ఆరాధిస్తారు. వాళ్ళని కళాకారులుగా గుర్తిస్తారు.'' కల్పన ముఖంలోకి చూశాడు.

కల్పన ఆలోచనలో పడింది.

''ఒక రచయిత, ఒక కవి, ఒక చిత్రకారుడు కన్పించనక్కర్లేదు. అతని కళ ద్వారానే అతను ప్రపంచానికి పరిచితుడు అవుతాడు. పైగా తమ అందం మీది నమ్మకంతో మద్రాసు బండి ఎక్కిన ప్రతిస్త్రీ కథానాయిక అవుతుందనే నమ్మకం లేదు.''

''నాకు ముందే హీరోయిన్ ఇస్తానన్నారు. నేను హీరోయిన్ అయితే నీ కంటే గొప్పదాన్ని అవుతాను. అప్పుడు నిన్ను కల్పన భర్త అంటారని నీ భయం. మగవాడి అహం అడ్డు వచ్చింది.''

''ముందు అందరూ అలాగే అంటారు. నీకంటే, ఆ మాట కొస్తే టాప్ హీరోయిన్స్‌గా పేరు పొందిన అనేకమంది కంటే, అందమైనవాళ్ళు, ఎక్స్‌ట్రాస్‌గానే మిగిలిపోయినవాళ్ళున్నారు.''

''అందుకే నా స్నేహితురాలు....''

''నాకు అహంకారం అన్నది. నిన్ను చూస్తే ఆవిడకు ఈర్ష్య....''

''నన్ను చూసి ఆమెకు ఈర్ష్యపడాల్సిన అవసరంలేదు. స్వేచ్ఛగా, భర్తకు బానిసగా కాక....''

''అయినా ఆమె నువ్వు కట్టే చీరెలు కట్టలేదు. నీలా కార్లలో తిరగలేదు.''

''అంత అహం పనికిరాదు.''

''అహం నాకు లేకపోతే ఎవరికి ఉంటుంది? ఎంత మెరుగు పెట్టినా ఇత్తడి బంగారం కాదు– నేను నిన్ను బలవంతంగా వివాహం చేసుకోలేదు. మీ నాన్న నాకు ఇవ్వనన్నాడు. అయినా నువ్వే పట్టుపట్టి చేసుకున్నావు.''

''నా కోరికలు, నా స్వభావం నీకు చిన్నప్పటి నుంచీ తెలుసు. నేనంటే నీకు చాలా యిష్టం. అందుకే.''

''నన్ను పెళ్ళి చేసుకున్నావా?'' మధ్యలోనే అందుకుని అన్నాడు వ్యంగ్యంగా.

''మన వివాహం అయిన కొత్తలో నీ దగ్గిర డబ్బు ఉండేది కాదు. అయినా నేను ఏది కోరినా నువ్వు నిమిషాల మీద తెచ్చి ఇవ్వడానికి ప్రయత్నించేవాడివి. ఒకసారి నాకు నవల రాయాలని వుంది అన్నాను. నువ్వు వెంటనే కాగితాలూ, కొత్త పెన్ కొనితెచ్చావ్. దగ్గిర వున్న ముప్ఫయ్ రూపాయల్లో ఇరవై రూపాయలు ఖర్చు పెట్టావ్! ఇప్పుడు నేను రాసుకుంటూ ఉంటే వ్యంగ్యంగా చూస్తావు. ఎగతాళిగా నవ్వుతావు. అప్పటి విషయం గుర్తుందా?''

''గుర్తులేదు.''

''అబద్ధం! గుర్తుండే అలా అంటున్నావు.''

''నువ్వు రాసిన కాగితాల కట్ట పేపరు నుంచి తిరిగి రావడం, అది చూసి నీ ముఖం వెలా వెలా పోవడం మాత్రమే గుర్తు వుంది.''

''ఓ! యు ఆర్ వెరీ క్రుయల్!''

''థ్యాంక్ క్యూ! మరో టైటిల్!''

''నీకు నేనంటే ప్రేమలేదా?''

''లేదు.''

''నన్ను అసహ్యించుకుంటున్నావా?''

''ఆ అర్హత కూడా నీకు లేదు.''

''నీకు డబ్బు గర్వం! నువ్వు డబ్బును మాత్రమే ప్రేమిస్తావ్!''

''అవును నేను డబ్బును ప్రేమిస్తాను. ఈ డబ్బును నేను నా స్వయం శక్తితో సంపాదించుకున్నాను. నిన్ను కార్లలో తిప్పుతున్నాను. కోరిన చీరలు, నగలు కొని ఇస్తున్నాను. నువ్వు అసలు నన్ను పెళ్ళి చేసుకొన్నది భౌతిక సుఖాల కోసమేగా? నువ్వు ఆధునిక భావాలు గల యువతివి. గొప్ప ఆదర్శాలతో బతికేదానివి. నీ దృష్టిలో ప్రేమ వేరు – పెళ్ళి వేరు. ప్రేమించిన వాడికి మనసూ చేసుకున్నవాడికి .... నిద్రొస్తుందా? వెళ్ళు వెళ్ళి పడుకో.'' అంటూ సిద్ధార్థ బాటిల్ ఎత్తి గ్లాసులోకి విస్కీ పోసుకోసాగాడు.

''ఇక చాల్లే! మరీ ఎక్కువైతే....''

''ఆఁ ఎక్కువైతే?''

''డాక్టరు ఎక్కువ తాగకూడదన్నాడుగా! మళ్ళీ జబ్బు చేస్తుంది.''

సిద్ధార్థ గొల్లున నవ్వాడు.

''పర్వాలేదే! నువ్వు కట్టుకొన్న పెళ్ళాంలా మొగుడి బాగోగుల గురించి ఆలోచిస్తున్నావే?''

''అంటే?''

''ఇప్పుడు కాదు. మరోసారి చెప్తాను. ఇవ్వాళ నేను మాట్లాడే మూడ్‌లో లేను. ప్లీజ్! నువ్వెళ్ళి పడుకో!''

కల్పన చివ్వునలేచి వెళ్ళిపోయింది.

సిద్ధార్థ ఆమె వెళ్ళినవైపే చూస్తూ నిట్టూరు విడిచాడు.

## 2

"ఈ చీర బాగుందా?"

అద్దం ముందు నిలబడి నెక్‌టై కట్టుకుంటున్న సిద్ధార్థ వెనకవచ్చి నిలబడి అడిగింది కల్పన.

"ఏ చీర?" తల తిప్పకుండానే అన్నాడు. కాని ఆమె ప్రతిబింబాన్ని అద్దంలో గమనిస్తూనే ఉన్నాడు.

"నేను కట్టుకున్న చీర!"

"ఓ అదా!" కళ్ళు పెద్దవి చేసుకొని కొత్తగా చూశాడు కల్పనకేసి.

"ఏమిటి అలా చూస్తావ్? కొత్తగా ముఖానికి రంగులు ఏమీ వేసుకోలేదే?"

"ఎక్కడికైనా వెళ్తున్నావా?" అంటూ వెళ్ళి కుర్చీలో కూర్చుని బూట్లు బిగించుకోసాగాడు.

కల్పన ఆశ్చర్యంగా భర్త ముఖంలోకి చూసింది.

"నీ ఉద్దేశం ఏమిటి?" కసిగా అన్నది.

"నా ఉద్దేశమా? ఏ విషయంలో!" నిర్లిప్తంగా తల ఎత్తకుండానే అడిగాడు.

"నువ్వు ఎక్కడికి వెళ్తున్నావ్?"

"నేను మిస్టర్ సంపత్ ఇంటికి. వాళ్ళింట్లో ఇవ్వాళ పార్టీ ఉన్నది." అన్నాడు అతి సాధారణంగా.

"ఆ విషయం నాకూ తెలుసు. నన్నూ పిల్చారు. నేనూ అక్కడికే వస్తున్నానని నీకూ తెలుసు."

"నువ్వు ఇవ్వాళ నాతో పార్టీకి రావడం లేదు."

కల్పన వెర్రిదానిలా చూసింది.

"అంటే?"

"అంతే! నువ్వు నాతో ఈ రోజు పార్టీకి రావడం లేదు. ఇక ముందు కూడా రావు."

"ఎందుకని?"

"చెప్పమంటావా?"

"అనేగా?"

"విని భరించగలవా?"

"నేను నువ్వు అనుకున్నంత పిరికిదాన్ని కాను. మామూలు ఆడదానిలా బావురుమని ఏడుస్తూ పాదాల మీద పడతానని అనుకోకు!"

"ఆ విషయం నాకు నువ్వు చెప్పాలా? నువ్వు మామూలు ఆడదానివికాదు. కవయిత్రివి. కళాకారిణివి!"

"అవును నేను కవయిత్రినే! నువ్వేం ఎగతాళి చెయ్యనక్కర్లేదు. ఇవ్వాళ కాకపోతే రేపయినా ప్రజలు గుర్తిస్తారు నన్ను."

సిద్ధార్థ పకపక నవ్వాడు.

"పాపం! సినీమా హీరోయిన్ కాలేకపోయావు. కనీసం కవయిత్రి కావాలని ప్రయత్నం. నా ఋషి కురుతే కావ్యం! కవిత్వం చెప్పడం, రచన చెయ్యడం, సినీమాలో వేషం వేసినంత సులభం కాదు."

"నవ్విన నాపచేనే పండుతుంది. అలా చూస్తూ ఉండు. నేను కవయిత్రిగా లేక రచయిత్రిగా ప్రజల చేత గుర్తింపబడతాను."

"సన్మానాలు కూడా చేస్తారు."

"అవును! చేస్తారు!"

సిద్ధార్థ అదోలా నవ్వాడు.

"అయినా నువ్వు నాతో పార్టీలకు రావు."

"కారణం అడుగుతున్నాను!"

"నాకు సంఘంలో ఓ అంతస్థు ఉన్నది."

"అయితే?"

"సంఘంలో గౌరవం ఉన్నది. ఒక ఇండస్ట్రియలిస్టుగా పేరు ఉన్నది."

"ఇవన్నీ ఉన్నవాళ్ళు భార్యల్ని వెంటబెట్టుకొని పార్టీలకు వెళ్ళరా?"

"వెళ్తారు. అంతస్థు ఉన్నవాళ్ళు చేసేపని అదే. ఇంట్లో ఎడముఖం పెడముఖంగా ఉండే భర్త కూడా పార్టీలకు భార్యను వెంటబెట్టుకొని పోతాడు. ఇది ఈనాటి నాగరికత, సభ్యత."

"ఆ నాగరికతా, సభ్యతా నీకు లేవన్నమాట?"

"నాగరికతనూ, సభ్యతనూ పాటించేవాళ్ళు పెళ్ళాన్ని వెంటబెట్టుకొని పార్టీలకు వెళ్తారు అన్నాను. అంతేగాని ఉంపుడుగత్తెను పార్టీలకు తీసుకెళ్తారు అనలేదే!" మళ్ళీ అద్దం ముందుకు వచ్చాడు. బ్రెష్‌తో జుట్టు దువ్వుకోసాగాడు.

కల్పన చివ్వున తల తిప్పి చూసింది. ముఖం పాలిపోయింది.

ఆలోచనలో పడింది.

తనను ఎంతమాట అన్నాడు? ఇంతకాలం తనే ఏదేదో అని సిద్ధార్థను బాధపెట్టేది. అతను బాధ పడుతుంటే తనకు తమాషాగా ఆనందం కలిగేది. అతను మాత్రం కటువుగా మాట్లాడేవాడుకాదు. ఈ మధ్య అతనికి ఏమైంది? సంభాషణలో అతనిదే పైచెయ్యిగా ఉంటోంది. తనను లోకుగా గాయపరుస్తున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" ఓరగా చూస్తూ వ్యంగ్యంగా అడిగాడు.

"నేను ఉంపుడుగత్తెను కాను. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యను."

"అని నువ్వు అనుకుంటున్నావు. అందుకు నేను బాధ్యుణ్ణికాను. నా దృష్టిలో నువ్వు ఉంచుకున్నదానివే!"

"ఎప్పటి నుంచి ఈ దృష్టి ఏర్పడింది?"

సిద్ధార్థ జవాబివ్వలేదు.

"మరి ఇంతకాలం పార్టీలకు ఎలా వెంటబెట్టుకొని వెళ్ళావ్?"

"భార్యగా నిన్ను స్వీకరించాను. నా ఇంటికి తీసుకొని వచ్చాను. కాని నీ స్థానం ఏమిటో నువ్వు గుర్తించడం లేదని నాకు అర్థం అయింది. అయినా నేను ఓర్పు వహించాను. నువ్వు మారతావని ఆశించాను. రెండేళ్ళు నువ్వేం చేసినా సహించాను. అయినా నువ్వు మారలేదు. మారలేవని గ్రహించాను. కారణం నిన్ను నేను ప్రేమించాను. ఇంతకాలం నా ప్రేమను చూశావ్. ఇక నుంచి నా ద్వేషాన్ని చూస్తావ్."

"నా విషయం నీకు ముందే తెలుసు. నేను రవీంద్రను ప్రేమిస్తున్నానని తెలిసే చేసుకున్నావ్. నా భావాలను అర్థం చేసుకోగలననీ, నన్ను హించపరచననీ అన్నావ్! గొప్ప మనసు ఉన్నవాడిలా, అభ్యుదయ భావాలుగలవాడిలా నటించావ్...."

"నాది గొప్ప మనసో కాదో నాకు తెలియదు. నిన్ను నేను ప్రేమించాను. నీ విషయం తెలిసీ వివాహం చేసుకున్నాను. మీ నాన్నకు కూడా ఇష్టం లేదు. ఎందుకో తెలుసా? ఆయన నన్ను ఎంతో అభిమానించేవాడు. నువ్వు రవీంద్రను ప్రేమిస్తున్నావని ఆయనకు తెలుసు. అయినా ఫూలిష్ భావాలతో ప్రేమించినవాణ్ణి పెళ్ళి చేసుకోకూడదు అంటూ రవీంద్రను తిరస్కరించావ్, మా నాన్న ఇంట్లో నుంచి పంపించివేసినా, చిల్లికానీ ఇవ్వనన్నా నిన్ను వివాహం చేసుకున్నాను. ఈ రెండేళ్ళుగా మన వివాహం విజయవంతం కావాలనీ, మన దాంపత్య జీవితం సుఖమయం కావాలనీ ప్రయత్నిస్తూనే ఉన్నాను. ఎన్నోవిధాల నీకు చెప్పాను. అయినా అర్థం చేసుకోలేదు. మౌనంగా నీ తెలివి తక్కువ చేష్టల్ని భరించాను. బాధపడ్డాను.

అయినా నిన్ను బాధపెట్టలేదు. నిన్ను ఈ ఇంట్లో బాధ్యత గల ఇల్లాలిగా చూడాలని కలలు కన్నాను. పెళ్ళయిన రెండు నెలలకు నీ ప్రియుడికి నువ్వు రాసిన ఉత్తరానికి వచ్చి సమాధానం చదివాను. అది చదివి కూడా నీకు నా ఇంట్లో భార్య స్థానాన్ని ఇవ్వడానికి ప్రయత్నించాను. అదే మరో మగ వాడైతే ఆ రోజే మెడపట్టి బయటికి గెంటేసేవాడు. అయినా నీ దృష్టిలో నేను అహంకారిని. పాత చింతకాయ పచ్చడి భావాలు గలవాడిని. నీలో రోజు రోజుకూ పూలిష్‌నెస్ ఎక్కువ అవుతోంది. బయటివాళ్ళముందు నన్ను అబద్దాలకోరుగా ఎక్స్‌పోజ్ చేసి ఆనందిస్తావు. నా స్నేహితుల ముందు నేనంటే నీకు లక్ష్యం లేనట్టు నిరూపించుకోవడానికి ప్రయత్నిస్తావు. నీ స్నేహితుల దగ్గిర నీ ప్రేమ కథను వర్ణించి చెబుతూ నిట్టూర్పులు విడుస్తావు. అయినా అన్నీ సహించాను. ఎందుకు? నువ్వు వట్టి అమాయకురాలివి అని తెలుసుకొని క్షమించాను. ఎప్పటికైనా కళ్ళు తెరవకపోతావా అనే ఆశతో అన్నింటినీ భరించాను. ఆకాశంలో విహరించడానికి ప్రయత్నించే నీకు, నువ్వు నిలవాల్సినది భూమి అని చూపించడానికి ప్రయత్నించాను. కాని నీకు ఆకాశంలో ఎగురుతున్నట్టు ఊహించుకోవడం లోనే ఆనందం ఉన్నది. నేను నిన్ను 'నింగినుండి నేలకు' దింపాలని ప్రయత్నించాను. ఇవన్నీ ఎందుకు చేశానో తెలుసా?''

''నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు కనక?''

''కాదు ప్రేమించాను కనక. ఇప్పుడు ప్రేమించడం లేదు. అందుకే ఇకనుంచి నా ద్వేషాన్ని రుచి చూడబోతున్నావ్.''

''నాలో కళా హృదయం ఉన్నది. కళ నా ఊపిరి. వేదన నుంచే కళ ఉద్భవిస్తుంది. అందుకే అతి మామూలు మనిషిలా ప్రేమించినవాడిని పెళ్ళి చేసుకొని ఆ ప్రేమను మట్టిలో పొర్లించలేక పోయాను. నేలబారు జీవితం నాకు అక్కర్లేదు. నువు అతి మామూలు మనిషివి. అందుకే నా ఆశయాల్నీ, ఆశల్ని అర్థం చేసుకోలేకపోతున్నావు.''

సిద్దార్థ ఘొల్లున నవ్వాడు.

కల్పన అతని ముఖంలోకి చిరాకుగా చూసింది.

''కళాకారిణివి అదే రచయిత్రివో-కవయిత్రివో కావాలని నువ్వు పడే తపన చూస్తుంటే నవ్వొస్తుంది. జాలివేస్తుంది. ఒకోసారి కోపం వస్తుంది. అందుకు నువ్వు నింగినుండి నేలకు దిగాలి. నేల మీది జీవితాన్ని అర్థం చేసుకోవాలి. కాని నువ్వు ఆకాశం అంచుల్ని వదలవు. అక్కడే వేలాడుతూ ఉండు. నేను నేల బారు మనిషిని. నేలమీదే జీవిస్తాను. నాకు జీవితం కావాలి. అందుకు నన్ను అర్థం చేసుకొనే భార్య కావాలి. ఇక మనం ఇద్దరం కలిసి బ్రతకడం జరగదు. ఏం చెయ్యాలో ఆలోచించి చెప్పు!''

కల్పనకు వళ్ళు మండిపోయింది.

తనను ఉంపుడుగత్తె అన్నాడు! అయినా తన కెందుకో కలగవలసినంత బాధ కలగడం లేదు.

''ఏమిటి ఆలోచిస్తున్నావ్!''

''మనం విడిపోదాం!'' అనేసింది కల్పన.

సిద్ధార్థ కల్పన ముఖంలోకి దీక్షగా చూశాడు.

''ఆల్‌రైట్! రేపే లాయర్‌తో మాట్లాడతాను.''

''ఓకే!''

''ఆ తర్వాత ఏం చేస్తావ్?''

''ఏం? నువ్వు లేకుండా బతకలేననుకుంటున్నావా? ఎం. ఏ. పాసయాను. ఉద్యోగం చేస్తాను.''

''నీకు అభ్యంతరం లేకపోతే నేనే ఉద్యోగం ఇప్పిస్తాను.''

''నీ కంపెనీలోనా?''

''కాదు. నువ్వు కావాలని కోరినా నా కంపెనీలో ఇవ్వను.''

''నీ అండలేకుండా ఉద్యోగం సంపాదించుకోగలను.''

''నీ ప్రియుడు రవీంద్ర ఇప్పిస్తాడా?''

''రవీంద్ర నీ అంత గొప్పవాడు కాడు. ఉద్యోగం ఇప్పించలేకపోవచ్చును. కాని నేను కోరితే ...''

''ఏమైనా చేస్తాడు! అవునా?''

''అవును!''

''ఎంత త్యాగం అయినా చేస్తాడు!''

''చేస్తాడు.''

''భార్యకు విడాకులు ఇచ్చి నీ దగ్గిరకు పరుగు తీస్తాడు.''

కల్పన మాట్లాడలేదు.

**[లోకజ్ఞానం-సమాధానాలు]**

1. కీ. శే. డాక్టర్ మార్టిన్ లూథర్ కింగ్ (1929-'68). అమెరికా దేశపు నల్లజాతి వారి నాయకుడు. నల్లజాతివారి సమాన హక్కుల కోసం కృషి చేసిన వ్యక్తి. శాంతియుత పోరాటంపై నమ్మకం గలవాడు. శాంతి మార్గంలో తనవారి హక్కుల కోసం పోరాటం జరిపిన మార్టిన్ లూథర్ కింగ్ 1968 ఏప్రిల్ 4, న ఒక దుండగుని తుపాకి గుండుకు బలి అయ్యాడు.
2. నలందా విశ్వవిద్యాలయం.
3. కాబూల్, అల్జీర్స్, బ్యూనస్ ఐరస్, ఒట్టావా, హవానా, కోపెన్‌హెగన్.
4. క్రీడారంగంలో అత్యున్నత ప్రమాణాలు నెలకొల్పిన వ్యక్తులకి 'అర్జున అవార్డు' లభిస్తుంది. ఈ అవార్డును 1961 నుంచి ఇస్తున్నారు.
5. శుక్రగ్రహం లేక వీనస్. ఉష్ణోగ్రత—460° సెంటిగ్రేడ్.
6. ఒరిస్సా.
7. ఇనుము (78 నుంచి 86 శాతం వరకూ) క్రోమియం (12 నుంచి 20 శాతం వరకూ), నికెల్ (2 శాతం.)
8. సిరిమావో బండారనాయకే (శ్రీలంక). ఆమె భర్త సాలమన్ బండారనాయకే 1959 లో హత్య చేయబడ్డారు. 1960 లో శ్రీమతి బండారనాయకే ఆ పదవికి ఎన్నికైనారు. 1965 లో జరిగిన ఎన్నికలలో ఆమె పక్షం ఓడిపోయింది. ఐతే 1970 లో వామ పక్షాల సహకారంతో ఆమె ప్రధానిగా ఎన్నికైనారు. '77 దాకా ఆ పదవిని అలంకరించిన సిరిమావో ఆ తరువాత జరిగిన ఎన్నికలలో తమ పార్టీ ఓడిపోవడంతో ప్రస్తుతం పార్లమెంటు సభ్యురాలుగా వుంటున్నారు. ఇంతవరకూ ప్రధాని పదవిని చేపట్టిన వనితలు నలుగురు. వారు— సిరిమావో బండారనాయకే (శ్రీలంక), ఇందిరా గాంధీ (భారత్), గోల్డామేయర్ (ఇజ్రాయిల్), మార్గరెట్ థాచర్ (ఇంగ్లండు ప్రస్తుత ప్రధాని).
9. భోపాల్ (మధ్య ప్రదేశ్)
10. అక్బర్ దర్బార్‌లోని ఒక ప్రఖ్యాత కవి' పండితుడు, రాజకీయవేత్త. అతను రచించిన గ్రంథాలు-'అక్బర్‌నామా', 'ఐని అక్బరి'.

"మీ నాన్న పెట్టిన పేరును సార్థకం చేస్తున్నావ్!''

కల్పన ఆలోచిస్తూ కూర్చుంది.

"రవీంద్రమీద ఇంకా నీకు ఆశలు ఉన్నాయ్! రవీంద్ర నీలాంటి సెంటిమెంటల్ ఫూల్‌కాదు. జీవితం అంటే కల కాదని అతనికి తెలుసు. జీవితం భ్రమకాదు. కల అంతకంటే కాదు. ప్రేమ కవిత్వం కానేకాదు. రవీంద్ర రాసిన ఉత్తరం మర్చిపోయావా? నా దగ్గిర ఇంకా భద్రంగానే ఉన్నది. మరోసారి చదువుకో.''

సిద్ధార్థ బీరువా తెరిచాడు. బట్టల అడుగున ఉన్న కవరు బయటికి తీశాడు. ఒక్క క్షణం ఏదో ఆలోచించి కల్పన మీదకు ఉత్తరం విసిరాడు. చరచర బయటికి వెళ్ళిపోయాడు.

కల్పన భర్త వెళ్ళిన వైపే ఓ క్షణం చిత్రంగా చూసింది.

ఒళ్ళో ఉన్న ఉత్తరాన్ని చేతిలోకి తీసుకుంది.

ఓ క్షణం ఆలోచిస్తూ ఉండిపోయింది.

చిన్నగా కవరులోనుంచి కాగితాలు బయటికి లాగింది. చదవసాగింది.

"ప్రియమైన ...కాదు....కల్పనకు....కాదు .... కాదు....శ్రీమతి సిద్ధార్థకు.

నీ ఉత్తరాలు అందాయి. నీకు ఉత్తరం రాయడం ఇష్టం లేకపోయినా రాస్తున్నాను. ఎందుకో తెలుసా? నేను సమాధానం రాయకపోతే నువ్వు ఇలాగే ఉత్తరాలు రాస్తూనే ఉంటావు. అందుకే సమాధానం రాస్తున్నాను.

నీ నమ్మకం ఒట్టి భ్రమ మాత్రమే! నువ్వు నన్ను ఓదారుస్తూ ఉత్తరం రాశావు. జీవితమంతా నీ కోసం ఏడుస్తూ నిట్టూర్పులు విడుస్తూ కూర్చుంటాను అనుకున్నావ్ కదూ! నీవు వాయించిన వీణ తాలూకు తీగల్ని జేబులో పెట్టుకొని, మధ్య మధ్య వాటిని తీసి చూస్తూ ఏడుపు పాటలు పాడతానను కుంటున్నావా?

నా ఉత్తరం నిన్ను బాధపెడుతుందని నాకు తెలుసు. అయినా నీ భ్రమల్ని వదిలించడానికే ఈ ఉత్తరం రాస్తున్నాను. నీ మనసు ఎప్పటికీ నాదేనా? కట్టుకున్న వాడికి శరీరం, ప్రేమించిన వాడికి మనసూ ఇస్తావా? జీవితమంతా నాకోసం తపిస్తూ బతుకుతావా? ఆ స్పందన కోసం, ఆ ఆర్తి కోసమే నన్ను తిరస్కరించావా?

ఇదంతా ఆత్మవంచన. నీకు భౌతిక సుఖాలు కావాలి. కార్లు కావాలి. బంగళాలు కావాలి. మంచి మంచి చీరెలు కావాలి. సిద్ధార్థ ధనవంతుడు. అందుచేత అతన్ని వివాహం చేసుకున్నావ్. పైగా నన్ను మభ్యపెట్టాలని చూస్తున్నావ్. నీ కోసం జీవితమంతా ఏడుస్తూ కూర్చోలేను. నాకూ జీవితం కావాలి. నేను నీ కోసం నిట్టూర్పులు విడుస్తూ బ్రహ్మచారిగా ఉంటే నీ 'అహం' సంతృప్తి చెందుతుంది. నీవి చిన్నప్పటి నుంచి చిత్రమైన భావాలే. నిన్ను నువ్వు ఏదో ప్రత్యేకతగల వ్యక్తిగా భావించుకుంటావు.

భ్రాంతి మనిషికి సుఖాన్ని ఇవ్వదు. మనసూ శరీరం వేరు వేరు అనుకోవడం ఒక భ్రాంతి. మాటకు ముందు 'హృదయం' అంటావు— అదేదో శరీరంలోని భాగం కానట్టు. అది (ఆ హృదయం) మాత్రం పవిత్రమైందనీ, ఎప్పటికీ నాదేననీ అంటావు. హృదయం కేవలం రక్తాన్ని శుద్ధిచేసే ఒక మాంసం, యంత్రం మాత్రమే. దాన్ని శరీరం నుంచి వేరుగా భావించడం ఫూలిష్‌నెస్. ప్రేమను తిరస్కరించి, తపిస్తే - ఆ తపన నుంచి కవిత్వం పుట్టుకొస్తుందని నీ భావం. కోరి బాధను

తెచ్చుకుంటే, ఆ బాధ నుంచి వచ్చేది కవిత్వం కాదు! ప్రపంచం బాధ గుండెల్లో పలకాలి. అప్పుడే కవిత్వం వస్తుంది.

ప్రేమ ఎప్పుడూ సంపూర్ణ సమర్పణనే కోరుతుంది. నీ మనసు నాకు అక్కర్లేదు. పిచ్చి పిచ్చి, ఆలోచనలు మానేసి, శరీరం ఇచ్చిన వాడికే మనసు కూడా ఇచ్చెయ్యి!

ఆకాశంలో ఎగరడానికి ప్రయత్నించకు. నీకు రెక్కలు లేవు. క్రింద పడతావు. గాయపడ్తావ్! చివరికి నీ గాయాన్ని చూసి జాలిపడేవాళ్ళు కూడా ఉండరు.

మనసుకు లేనిపోని పవిత్రతను అంటగట్టకు.

నువ్వు దేన్ని ప్రేమ అని భావిస్తున్నావో అది ప్రేమ కాదు, ఉన్మాదం. ఒక రకమైన మానసిక రోగం.

జ్వాల, తపన, ఆర్తి, స్పందన, వ్యథ అంటూ ఏమేమో రాశావు. ఆ మాటలన్నీ ప్రేమ కథలు చదివి నేర్చుకున్న వేనని నాకు తెలుసు. కథ జీవితం కాదు, జీవితం నుంచి కథలు దొరుకుతాయి. కాని కథలనుంచీ, కళల నుంచీ జీవితం లభించదు.

నీ భర్త తెలివైన వాడు. పిరికివాడు కాదు. అందువల్లనే మన ప్రేమ వ్యవహారం తెలిసీ పెళ్ళి చేసుకున్నాడు. నేను అంత సాహసం చెయ్యలేను. సిద్ధార్థ స్వభావం నాకు తెలుసు. చాలా ఉదాత్తమైన భావాలు కలవాడు. ఎంత పొగరుబోతుగా కన్పిస్తాడో అంత సున్నితమైన మనసు గలవాడు. అతను ఎంత గాఢంగా ప్రేమించగలడో, అంత గాఢంగానూ ద్వేషించగలడు. అందుకే జాగ్రత్తగా ఉండు. నాకు ఇలాంటి ఉత్తరాలు రాయడం మానెయ్!

నీ వైవాహిక జీవితం సుఖంగా ఉండాలని కోరుకుంటున్నాను.

జీవితం నిజం!
అది కథ కాదు!
సినీమా కథ అంతకంటే కాదు!
ఈ నిజాన్ని తెలుసుకో!

శుభాకాంక్షలతో
రవీంద్ర''

కల్పన ఉత్తరం చదివి ముగించి నిర్లక్ష్యంగా తనలో తనే నవ్వుకున్నది.

తనకు అందరూ నీతులు చెప్పేవాళ్ళే.

రవీంద్ర తనను ప్రేమించాడు.

అతను రాసిన ఉత్తరంలో తను అతనికి అందలేదనే అక్కసు స్పష్టంగా కన్పిస్తోంది.

రవీంద్ర హిపోక్రైట్!

సిద్ధార్థ కూడా హిపోక్రైటే!

రెండేళ్ళు అయింది.

మళ్ళీ రవీంద్ర నుంచి ఉత్తరం లేదు.

రవీంద్ర వివాహం చేసుకున్నాడు. శుభలేఖతో పాటు సిద్ధార్థకు ఉత్తరం కూడా రాశాడు పెళ్ళికి తప్పకుండా రావలసిందిగా ఆహ్వానిస్తూ. సిద్ధార్థ రవీంద్ర పెళ్ళికి వెళ్దామన్నాడు. తనే రానన్నది. రెండు సంవత్సరాలుగా కాపరం చేస్తున్నా తన భర్తను తను సరిగా అర్థం చేసుకోలేకపోతున్నది.

ఈ ఉత్తరం వచ్చినరోజు తను చాలా బాధపడింది. ఏడ్చింది. తన ప్రేమను ఉన్మాదంగా చిత్రించినందుకు ఏడ్చింది. రవీంద్రను మనసులోనే అనేకవిధాల తిట్టుకున్నది. సాయంత్రం సిద్ధార్థ ఆఫీసు నుంచి వచ్చాడు. "అలా ఉన్నావేం?" అని అడిగాడు. తను రవీంద్ర రాసిన ఉత్తరం అతనికి ఇచ్చింది. కావాలనే ఇచ్చింది. ఉత్తరం చదివి కొంతసేపు గంభీరంగా ఉండిపోయాడు. అర్థగంట తర్వాత ఏమీ జరగనట్టే తనను రామచంద్రం ఇంటికి పార్టీకి తీసుకెళ్ళాడు. ఆరోజు నుంచి ఇంతవరకు అతను ఆ ఉత్తరం గురించి ఒక్కమాట కూడా అనలేదు.

తను ఎన్నో విధాల భర్తను రెచ్చగొట్టాలని ప్రయత్నించేది. తను అతన్ని ప్రేమించడం లేదనే విషయాన్ని అతనికి తెలియజెప్పాలని ప్రయత్నిస్తూ వచ్చింది. అయినా తన భర్త తనను తప్పు చేసిన పసిపిల్లను చూసినట్టు ఓ క్షణం చూసి మళ్ళీ యథాప్రకారం ప్రవర్తించేవాడు. ఒక తెలివితక్కువ పిల్లను తల్లి చూసినట్టు చూసేవాడు. తనకు మరీ వళ్ళు మండిపోయేది. అతని మనసును ఎన్నోరకాల



వేముగంటి పాపాయమ్మ

స్వాతంత్ర్యసమరంలో ఎందరో మహనుభావులు పాల్గొన్నారు. ఐతే వారిలో అందరికీ తెలిసినవారు కొందరే. అలా ఎందరికో తెలియకుండా అజ్ఞాతంగా వుండిపోయినవారు అనేకులు వున్నారు స్వాతంత్ర్యం సిద్ధించగానే వీరు పదవీపోరాటంలోకి ప్రవేశించకుండా, తాము తలపెట్టిన కార్యం సిద్ధించినందుకు సంతోషించి జీవనసమరాన్ని కొనసాగించారు. అటువంటివారిలో చెప్పుకోదగ్గ వనిత – శ్రీమతి వేముగంటి పాపాయమ్మ.

1900 సంవత్సరంలో జన్మించిన పాపాయమ్మకి ఐదవ ఏటనే వివాహమయ్యింది – ఆనాటి బాల్య వివాహాచారం ప్రకారం. ఐతే దురదృష్టవశాత్తు తన ఎనిమిదవ ఏటనే ఆమె భర్తను కోల్పోయింది జీవితాంతం బ్రహ్మచారిణిగానే గడిపిన పాపాయమ్మ మహాత్మాగాంధీ పిలుపునసరించి స్వాతంత్ర పోరాటంలో పాల్గొన్నారు. విదేశీవస్త్ర బహిష్కరణోద్యమంలోనూ, 1919 లో జలియన్‌వాలాబాగ్ దురంతాలకి నిరసనగానూ, 1932 లో ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా జరిగిన ఉద్యమాలలోనూ ఆమె ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. ఆ రోజుల్లో ఆమె శాంతిసేనకి కెప్టెన్‌గానూ, దేశ సేవికా సంఘానికి కార్యదర్శిగానూ, హరిజన బాలబాలికల వసతిగృహం నిర్వాహక సభ్యురాలుగానూ విశిష్టమైన సేవచేశారు.

1931వ సంవత్సరంలో ఆమె కాకినాడ మున్సిపల్ కౌన్సిలర్‌గానూ, జిల్లాబోర్డు సభ్యురాలుగానూ నియమించబడి ముప్పైఐదు సంవత్సరాలపాటు ఆ పదవులను నిర్విఘ్నంగా నిర్వహించారు. 1955 లో భారత సేవాసంఘం తరఫున స్త్రీల కొరకు జరిగిన శిక్షణాశిబిరానికి ఆమె ప్రధాన కార్యకర్తగా వుండి దిగ్విజయంగా నిర్వహించారు. సుమారు అరవైఏళ్ళ క్రితం బాలాంత్రపు శేషమ్మగారు మహిళావిద్యాలయం, విద్యార్థిని సమాజం స్థాపించారు. దానికి 1939 నుంచి ముప్పైతొమ్మిదేళ్ళు పాపాయమ్మ గౌరవ కార్యదర్శిగా వుండి అనాథ యువతులకు ఎనలేని సేవచేశారు. ఎందరో యువతులకు జీవనమార్గం చూపారు. ఆమె చక్కటి క్రీడాకారిణి కూడా. టెన్నిస్, బాడ్మింటన్ మొదలైన క్రీడలలో ఉత్సాహంతో పాల్గొనేవారు. □

——వి. సుభద్రమ్మ

గాయపరచాలని ప్రయత్నించి విఫలురాలైంది.

కాని ఇటీవల కొద్దికాలంగా మారిపోయాడు. అతనిలో ఇంత కాఠిన్యం ఉన్నదని తను ఊహించ లేదు.

తనను ఈరోజు 'ఉంపుడుగత్తె' అన్నాడు.

రవీంద్ర భార్యను ప్రేమగా చూడగలుగుతున్నాడా? తనను మనసులో నుంచి నెట్టేశాడా? రవీంద్ర కూడా తనలాగే మనసులేని కాపరం చేస్తున్నాడు. రవీంద్ర తనను మనసారా ప్రేమించాడు. రవీంద్ర పిరికివాడు. తన ప్రేమను మనసులోనే సమాధి కట్టి ఉంచాడు. ఆ ఉత్తరంలోని ఒక్క మాట కూడా అతని అంతరాంతరాలలో నుంచి వచ్చిందనే నమ్మకం తనకు లేదు.

కల్పన ఈజీఛైర్‌లో వెనక్కు వాలి కళ్ళు మూసుకున్నది.

గతం కళ్ళముందుకు వచ్చి నిలబడింది.

## 3

"యాకుందేందు తుషార హార ధవళా
యాశుభ్ర వస్త్రాన్వితా
యావీణా వరదండ మండిత కరా
యాశ్వేత పద్మాసనా"

జరీ అంచు నీలం పట్టు పరికిణీ, జరీ పువ్వుల తెల్ల పట్టు జాకెట్‌లో ఉన్న పన్నెండేళ్ళ బాలిక రెండు చేతుల్ని జోడించి, కళ్ళు మూసుకొని స్తవం చేసింది.

ఆ కంఠంలో మాధుర్యం ఉన్నది. ఆరోహణ-అవరోహణలలో శ్రుతి ఉన్నది. ఆమెకు ఉదాత్త అనుదాత్తాల పరిజ్ఞానం ఉన్నది. పలుకులో లాలిత్యం ఉన్నది. ప్రేక్షకులు సరస్వతీ సాక్షాత్కారం అయినట్టు పులకిత గాత్రులు అయ్యారు.

ప్రార్థన ఆగింది.

ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో హాలు దద్దరిల్లిపోయింది.

ఆనాటి స్కూల్ వార్షికోత్సవం, కల్పన ప్రార్థనా గీతంతో ప్రారంభం అయింది.

"ఎవరమ్మాయి? చక్కని కంఠం! అంతకంటే చక్కని రూపం!" ప్రేక్షకులు ఒకరిని ఒకరు అడగసాగారు.

"అమ్మా!" అన్నాడు శరభయ్య గద్గద కంఠంతో.

"ఏం నాన్నా!" అంటూ తండ్రి కళ్ళలో నిలిచిన కన్నీటిని చూసింది. గాభరా పడింది.

శరభయ్య ఉత్తరీయంతో కళ్ళు అద్దుకున్నాడు.

"నాన్నా ఏడుస్తున్నావా? ఏమిటి? ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగింది.

"ఏడవడం లేదమ్మా! ఇవి ఆనంద బాష్పాలు తల్లీ. ఎంత బాగా పాడావమ్మా!"

"నువ్వు నేర్పించిందేగా నాన్నా!"

"ఇంత మధురంగా ఇంతకు ముందెప్పుడూ పాడలేదు నువ్వు. ఆ ప్రార్థన నీ అంతరాళం నుంచి వెలువడింది. నీకు సరస్వతీ కటాక్షం లభించింది. నీలో తీవ్ర అనుభూతి ఉన్నది. నువ్వు గొప్ప కళాకారిణివి అవుతావు. నా అభీష్టం నెరవేరాలని సరస్వతీదేవిని ప్రార్థిస్తున్నాను."

"అభీష్టం అంటే ఏమిటి నాన్నా!"

"అభీష్టం అంటే...." ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు శరభయ్య మాస్టారు.

"నేను చెప్పనా మాస్టారుగారూ!"

కల్పన గిర్రున తల తిప్పి చూసింది. సిద్ధార్థ నిల్చుని ఉన్నాడు. ఆ వెనక రవీంద్ర ఉన్నాడు.

"ఊఁ చెప్పు!" అన్నది కల్పన.

ఎవరో పిలవడంవల్ల శరభయ్య మాస్టారు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

"నేను చెబుతాను-కోరిక" అన్నాడు రవీంద్ర.

"కాదు." అన్నాడు సిద్ధార్థ.

"అభీష్టం వేరూ-కోరిక వేరూ" అన్నాడు మళ్ళీ సిద్ధార్థ.

"రెండూ ఒకటే!" అన్నాడు రవీంద్ర.

"కాదు. రెండూ వేరు వేరు."

"పెద్ద వచ్చాడయ్యా తెలుగు పండితుడు. చెప్పు చూద్దాం!" అన్నది కల్పన రవీంద్రను సపోర్టు చేస్తూ సిద్ధార్థతో.

"కోరిక అంటే చిన్నది-అభీష్టం అంటే పెద్దది." అన్నాడు సిద్ధార్థ ముఖం గంభీరంగా పెట్టి.

"అంటే?" కల్పన కళ్ళు తిప్పుతూ అడిగింది.

"ఆడుకోవాలని ఉన్నదనుకో అది కోరిక. ఇవ్వాళ సినిమాకు వెళ్ళాలని అనిపించిందనుకో! అది కూడా కోరికే!"

"మరి అభీష్టం అంటే ఏమిటో!" వ్యంగ్యంగా అన్నాడు రవీంద్ర.

"కల్పనకు నన్ను పెళ్ళి చేసుకోవాలని ఉన్నదనుకో - అది అభీష్టం!"

రవీంద్ర ముఖం వెలావెలాపోయింది.

కల్పన కళ్ళు పెద్దవిచేసి సిద్ధార్థను చూసింది.

"అవ్వ పేరే ముసలమ్మ!" అన్నాడు కసిగా రవీంద్ర.

రవీంద్ర ధోరణికి కల్పన కిలకిల నవ్వింది.

రవీంద్ర ముఖం ముడుచుకున్నాడు.

"మరి ప్రేమించడం!"

"అది కూడా అభీష్టమే!" అన్నాడు రవీంద్ర.

సిద్ధార్థ ఘొల్లున నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావ్!"

"ప్రేమించడం—కోరికవల్ల జరిగేది కాదు. ముహబ్బత్ హోతీహై! మగర్ కీ నహీఁ జాతీ!"

"అంటే?"

"ప్రేమ ఏర్పడుతుంది. అది ఎప్పుడు ఎలా ఏర్పడుతుందో ఎవరికీ తెలియదు. కావాలనుకుంటే ప్రేమ ఏర్పడదు." అన్నాడు సిద్ధార్థ.

కల్పన సిద్ధార్థ ముఖంలోకి ప్రశంసాపూర్వకంగా చూసింది.

రవీంద్ర చిన్నగా అక్కడినుంచి జారుకున్నాడు.

"నువ్వు చాలా బాగా మాట్లాడతావ్!" అన్నది కల్పన.

సిద్ధార్థ బోలెడంత సిగ్గు పడిపోయాడు.

[సశేషం]

**Results of Camel Vanitha Crylin Painting Contest No. 12 held in March 1979**

*1st Prize*: Rs. 100/- Mrs. Santakumari, Kakinada 533 002. *2nd Prize*: Rs. 75/-T. Bala, Bobbili 532 558. *3rd Prize*: Rs. 50/- Mrs. Mangala S. Uppin, Gulbarga. *Certificate of Merit*: N. Roya, Kakinada; N. Lakshmi, Kakinada; Smt. R. S. Shantha, Hyderabad 37; Dr. P. Pandurangan, Madras 600 028; Smt. Vasantha Lakshmi, Nagercoil 629 002.

# ఒరిస్సా గ్రామీణ జీవితం - స్త్రీలు

4

- పెదప్రోలు రాజ్యలక్ష్మీదేవి

## పిల్లల పెంపకం – చదువు సంధ్యలు

ఐదేళ్ళదాకా పిల్లలు ఆడుతూ పాడుతూ పెరుగుతారు. ఐదో ఏడు దాటగానే "కొడాఘొవా" (అక్షరాభ్యాసం) చేసి స్కూల్లో వేస్తారు. పూర్వకాలం ఆడపిల్లల చదువు విషయమై శ్రద్ధ చూపేవారు కాదు. 'ఎంతో ఖర్చుపెట్టి కట్నం, సారె యిచ్చి పెళ్ళి చెయ్యాలి కదా. ఆడపిల్ల చదివి ఏ చేస్తుంది?' అని ఆమెని యింట్లోనే వుంచి పని పాటల్లోనూ, కుట్లూ, అల్లికల్లోనూ, తర్ఫీదు యిచ్చేవారు. కాని యిప్పుడు స్త్రీ విద్యయొక్క ఆవశ్యకతను గుర్తించి, యిప్పటి పెళ్ళికొడుకులు కూడా వధువు చదువుకున్నదై వుండాలని నిబంధన పెట్టడంచేతా ఆడపిల్లల్ని కూడా మొగపిల్లలతో సమానంగా చదువు వచ్చినంతవరకు చదివిస్తున్నారు.

ప్రభుత్వం వారు జీతం లేకుండా చేసి, ఎన్నో స్కాలర్‌షిప్‌లు ఏర్పాటుచేసి ప్రోత్సహిస్తున్నా మన దేశంలో ఎంతమంది బీదపిల్లలు చదువుకుని విద్యాధికులు కాగలుగుతున్నారు?

చదువు అనేసరికి జీతాలు లేకపోయినా మిగతావన్నీ, పుస్తకాలు, నోట్సులు, పలకలు, పలకపుల్లలు, పెన్నులు ఎన్నో కావాలి కదా! అందుచేత కూలీనాలీకి యింత డబ్బు ఖర్చుపెట్టి పిల్లలకి చదువు చెప్పించాలనే శ్రద్ధ వుండదు. ఏరోజు కూలి ఆ రోజు తెచ్చుకుని తిని, కూలి దొరకని నాడు మంచి నీళ్ళతోనే కడుపులు నింపుకుని రోజులు వెళ్ళబుచ్చే జీవితాలు వారివి. ఏదో మొక్కుబడి చెల్లించుకుందుకన్నట్లు స్కూలుకి వెడుతూ వస్తూ మధ్య మధ్య మానేస్తూ చివరికి ఏదో ఒక రోజున యిళ్లలోని ఆర్థిక వత్తిడులకు లొంగిపోయి చదువు పూర్తిగా మానేసి తండ్రి వెనకాల కూలి పనులకు వెళ్ళిపోతారు. లేదా వ్యవసాయం చూసుకుంటారు. 'బారిమూళో', 'జెజాంగ్' గ్రామాల్లో నాకు కనిపించిన పిల్లలు చాలామంది యీ రకం వాళ్ళే.

వంటి మీద సరైన ఆచ్ఛాదన అయినా లేకుండా అర్ధనగ్నంగా మమ్మల్ని వింతగా చూస్తూ నిలబడ్డ ఆ పిల్లల్ని చూసి నాకెంతో జాలివేసింది.

సర్వసాధారణంగా రోజల్లా యింటి పనితోనూ, పశువుల పనితోనూ సతమతమయ్యే గ్రామీణ గృహిణికి పిల్లల చదువు సంధ్యల గురించి పట్టించుకునే సమయం, తీరికా రెండూ వుండవు. ఇంటి ఆర్థిక విషయాలు, పిల్లల చదువులు సాధారణంగా పురుషులు చూసుకునేవే. కాని జెజాంగ్ గృహిణి, ఆమె అత్తగారువంటి వారు పురుషుని అండ లేకపోయినా అటు మొగపనీ, యిటు ఆడపనీ కూడా చూసుకుంటూ తమ పిల్లల్ని వృద్ధిలోకి తీసుకురావడానికి కృషి చేస్తున్నారు.

పల్లెటూళ్ళలో వుండే యువతులు కూడా దగ్గరగా వున్న కాలేజీ వున్న వూరికి బస్సుల మీదో రిక్షాలమీదో వచ్చి చదువుకుని సాయంత్రానికి తమ వూరు చేరుకుంటున్నారు. ఈనాటి ఒరిస్సా యువతులు కూడా పెద్ద చదువులు చదివి పురుషులతో సమానంగా యితర రాష్ట్రాలకు యితర దేశాలకు వెళ్ళి పెద్ద పెద్ద పదవుల్ని ఎంతో చాకచక్యంగా నిర్వహిస్తున్నారు.

ఒరిస్సాలోని అనేక జిల్లాలలో సంగీత నృత్య కళాశాలలు వున్నాయి. సంప్రదాయ కుటుంబాలలోని యువతులు కూడా ఈ కళాశాలల్లో చేరి, ఎంతో శ్రద్ధాసక్తులతో యీ కళలను నేర్చుకుంటున్నారు.

ఒరిస్సా సాహిత్య సీమలో ప్రకాశిస్తున్న కొందరు సోదరీమణులు :

శైలబాలా మహంతి (కవయిత్రి) ప్రతిభా శతపతి (కవయిత్రి) శకుంతలాదేవి (కథా రచయిత్రి-నాటక రచయిత్రి) పద్మాలయాదాస్ (జర్నలిస్ట్).

ఒడిస్సీ నాట్యంలో ప్రసిద్ధి గాంచిన కొందరు వనితలు :

సంయుక్త పాణిగ్రాహి, సోనాల్ మాన్‌సింగ్, వినతిమిశ్రా.

ఒడిస్సీ గాత్ర సంగీతంలో పేరు పొందిన కొందరు మహిళలు :

సునందా పట్నాయక్, తృప్తిదాస్, భువనేశ్వరీ మిశ్రా.

మహాత్మాగాంధీ శిష్యురాలు, సర్వోదయా వర్కర్ అయిన రమాదేవి పేరు మోసిన సంఘ సేవిక. ఎక్కడ బాధ, ఆర్తి వున్నాయో అక్కడ ఆమె వుంటుంది. ఆమె ఇప్పుడు బాగా వృద్ధురాలు. ఐనా తుఫానులకు వరదలకు గురియైన ప్రాంతాలకు తన పరివారంతోవెళ్ళి ఇప్పటికీ ఆమె సేవ చేస్తూనే వుంది. ధన్యజీవి అయిన యీ సంఘసేవిక పేరిట భువనేశ్వర్‌లో 'రమాదేవి విమెన్స్ కాలేజి' స్థాపించబడి ఎందరో యువతులకు విద్యాదానం చేస్తోంది.

క్రిందటి సంవత్సరం దాకా ఒరిస్సా ముఖ్యమంత్రి పదవి నిర్వహించిన శ్రీమతి నందినీ శతపతి రచయిత్రి మాత్రమే కాక చక్కటి కవయిత్రి కూడా.

## వెనుకపడ్డ జాతుల వారు, చదువు సంధ్యలు

వీరు కోరాపుట్, కొంధమాళో, కొళహండీ, సుందరఘడ్, మయూర్‌భంజ్, కెయింజోర్ జిల్లాల్లో వున్నారు. వీరిలో అనేక తెగలు వున్నాయి. కందొ, కహాళొ, ముండొ, శబరొ, సంతాళొ మొదలైన తెగలవారు ఆ తెగలకు సంబంధించిన భాషలను మాట్లాడతారు.

వీరిలో కొందరు కేంద్రపారా పొలిమేరల్లో గుడిసెలు వేసుకుని నివసిస్తున్నారు. కుందేళ్ళు మొదలైన జంతువులను విల్లంబులతో వేటాడి వాటిని కాల్చుకుని తింటారు. వీరు యిప్పుడిప్పుడే వ్యవసాయపు పనులకు, బిల్డింగులు వగైరా కట్టడం పనులకు వెళ్ళడం నేర్చుకున్నారు.

ఆడవాళ్లు కూలికి వెళ్ళరు. ఇళ్ళ దగ్గరే వుండి, యింటి పనులు చేసుకుంటూ పిల్లల్ని చూసుకుంటారు. వీళ్ళవి వుమ్మడి కుటుంబాలు. వేరు వేరు గుడిసెల్లో వున్నా వంట మాత్రం కలిసి ఒక్కచోటే చేసుకుంటారు.

'రొజూ సంక్రాంతి' వీళ్ళు చేసుకునే ముఖ్యమైన పండుగ. ఆ రోజల్లా శుభ్రంగా తిని తాగి రాత్రల్లా ఆటపాటల్లో గడుపుతారు. రొజూ సంక్రాంతి పంటల పండుగ. తమ ఆటల పాటలతో భూదేవికి సంతోషం కలగజేస్తే పంటలు బాగా పండుతాయని వీరి నమ్మకం.

రాష్ట్ర ప్రణాళికలో పెద్ద మొత్తాన్ని యీ వెనుకపడ్డ జాతులవారి విద్య నిమిత్తం కేటాయించారు. షెడ్యూల్డ్ తెగల పిల్లలకి ఇచ్చినట్లుగానే షెడ్యూల్డ్ కులాల పిల్లలకి కూడా ప్రత్యేక సదుపాయాలు –

OBM/1638 TEL

# క్రొత్త స్టేఫ్రీ బెల్టులేని నేప్‌కిన్లు



ఈ ఎడ్హెసివ్ పట్టీ నేప్‌కిన్‌ను మీ బిగువైన చెడ్డీలలో సురక్షితంగా నిలుపుతుంది.



## లూపులు, బెల్టులు, పిన్నులు ఇక ఏమి అవసరంలేదు. మీకు కావసిన పూర్తిరక్షణతో, మీరు కోరుకున్న పూర్తిస్వేచ్ఛ

మీరు ప్రతిఒక్కరోజు సద్వినియోగం చేయాలని కోరేస్త్రీ అయితే, మేము మీకు అతి ప్రత్యేకమైన దానిని సమర్పించ కోరుతున్నాం: **స్టేఫ్రీ** బెల్టులేని నేన్‌కిన్లు.

### మీరు కోరుకున్న పూర్తి స్వేచ్ఛ

మీరు లూపులు, పిన్నులు, తాళ్ళు లేక బెల్టులతో బాధ పడాల్సిన రోజులు పోయాయి. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు సరైనట్లు అమరుటకోనం ఎడ్హెసివ్ పట్టీలు ఉన్నాయి. మీ బిగువైన చెడ్డీల లోపల దీనిని నొక్కండి. మీరు తీసివేసేదాకా చెమ్మను పీల్చి సురక్షితంగా అక్కడే ఉంటుంది. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు మీరు ఏ దుస్తులతోనైనా




ధరించ వచ్చును ఏంకావలసినా చేయవచ్చును. అవి నిజంగా అమర్చినచోట అట్లానే ఉంటాయి.

### మీకు కావలసిన రక్షణ

**స్టేఫ్రీ** మీకు కావలసిన రక్షణ నిశ్చయంగా ఇచ్చేటట్లు ప్రత్యేకంగా డిజైను చేయబడ్డది. అధికంగా చెమ్మనుపీల్చి లోపలి మడతలలో చెమ్మ నిలిచి పోతుంది. మరి. 3-వైపులా ప్లాస్టిక్ షీల్డ్ నేప్‌కిన్ దిగువభాగము మరియు. ప్రక్కల మరకలు పడనీయదు. నేడే ఒక ప్యాక్ కొనండి. బెల్టులేని దాని స్వేచ్ఛను అనుభవించండి. మరి మీ రెప్పటికీ లూప్‌లు లేక బెల్టులు, పిన్నులు, తాళ్ళ జోలికి పోరు !

భారత దేశంలో తయారు చేయువారు జాన్సన్ & జాన్సన్ లిమిటెడ్, బొంబాయి-400 036



## మన దేవాలయాలు:

# గురువాయూరు

వంచనను నాశనం చేసి మంచిని సంరక్షించడానికి అవసరమైనప్పుడల్లా అంతరిస్తూ వుంటాడు భగవంతుడు - అన్నది సనాతన హైందవ విశ్వాసం. దేవదేవుడైన మహావిష్ణువు అవతారాలలో శ్రీకృష్ణ అవతారమే పూర్ణావతారం అని వైష్ణవాచార్యుల అభిప్రాయం. అంటే - భగవదవతారానికి వుండవలసిన సర్వమంగళ దివ్య లక్షణ పరిమళంతో ప్రకాశించే పవిత్ర స్వరూపం శ్రీకృష్ణపరమాత్మ!

వైష్ణవులకు మాత్రమే కాదు - ఐదారు వేల సంవత్సరాలుగా సనాతన సాంస్కృతిక గంగా ప్రవాహాన్ని ప్రభావితం చేస్తూన్న ఉత్తుంగ హిమాలయ శృంగం - గిరిధరుని మహిమాన్విత చరితం.

ఆధ్యాత్మిక జ్ఞానామృతంతో అల్లనల్లన వీచే సంగీత సాహిత్య తరంగాలకు మూలాధారం - మురళీ కృష్ణుని మోహనరాగం.

తరతరాలుగా భక్తజన హృదయ మయూరాలను ఆనంద నాట్యం చేయిస్తున్న మేఘమాలికలు నీలమేఘశ్యాముని లీలా వినోదాలు.

జన్మతః అందరూ సమానులే. మనిషిని మాన్యునిగా లేదా హీనునిగా చేసేవి వాని గుణగణాలు. నడవడిక అన్నది వాసుదేవుని తిరుగుబాటు సిద్ధాంతం.

జీవిత 'కురుక్షేత్రం'లో విజృంభించిన విధ్వంసక శక్తులను రూపు మాపడానికి 'గాండీవం'నారి సారించమని 'నరుని' తట్టి లేపి ప్రపంచంలోనే ప్రప్రథమంగా సాయుధ విప్లవ శంఖారావం చేసింది పురుషోత్తముని పాంచజన్యమే!



శ్రీకృష్ణుని - ఎప్పుడో పుట్టి ఎక్కడో జీవించి మరెక్కడో అవతారం చాలించిన పురాణ పురుషునిగా గాక ప్రతి క్షణాన్ని శాసించి నడిపే మానుష రూపధారిగా మన కళ్ళ ముందు నిలిపి మన మనసులను మాధవమందిరాలుగా మార్చుకోడానికి దోహదం చేసే విష్ణు క్షేత్రం - గురువాయూరు కృష్ణ మందిరం!

ద్వాపర యుగాంతంలో తన అవతార కార్యం పూర్తయిన తర్వాత కృష్ణుడు అవతారం చాలించడానికి నిర్ణయించాడు. అప్పటికే బంధువులందరూ అంతఃకలహాలతో నాశనమైపోయారు. వారిలో సజ్జనుడైన ఉద్ధవుని పిలచి-తన అవతార పరిసమాప్తి తర్వాత రాజమందిరంలోని తన విగ్రహాన్ని సురక్షిత స్థలానికి తరలించమని దేవగురువైన బృహస్పతికి సందేశం పంపాడు. బృహస్పతి ద్వారకకు చేరుకునేసరికి ఆ నగరం సముద్ర గర్భంలో కలిసిపోయింది. సాగర తరంగాల మధ్య కృష్ణవిగ్రహం కొట్టుకు పోయింది. బలశాలియైన వాయుదేవుని సాయంతో ధీశాలియైన బృహస్పతి దానిని గట్టుకు చేర్చాడు. గురు, వాయుదేవులు దక్షిణంగా పయనమై పరశురామ క్షేత్రంగా ప్రసిద్ధి గాంచిన దక్షిణాగ్రం చేరుకున్నారు. పైరు పచ్చలతో కొబ్బరి

తోటల మధ్య ప్రశాంత వాతావరణంలో ఒక అందమైన తామర తటాకాన్ని చూసి అక్కడే ఆ కృష్ణ విగ్రహాన్ని ప్రతిష్ఠ చేశారు. గురువు వాయువులచే ప్రతిష్ఠ చేయబడడం వల్ల ఆ దేవునికి 'గురువాయూరప్ప' అనీ ఆ పుణ్యక్షేత్రానికి 'గురువాయూరు' అనీ సార్థకనామధేయాలు ఏర్పడ్డాయి!

కాలగతివల్ల, పరిస్థితుల దుష్ప్రభావం వల్ల పతనం దాపురించినప్పటికీ–బుద్ధి బలంతో ప్రయత్నించి పతనం నుంచి బయటపడి మనిషి మనుగడ సాధించవచ్చు – అని పరోక్షంగా ప్రబోధించే ఈ గాథ – గురువాయూరు ఆలయ స్థల పురాణం!

దేశం నలుమూలలా అశాంతి, అరాచకాలు, మత కలహాలు, నాస్తిక వాదాలు పైశాచిక నృత్యం చేసిన కాలఘట్టంలో అద్వైతామృత వర్షంతో భారతీయ ఆధ్యాత్మిక జీవనానికి పునరుజ్జీవనం ప్రసాదించిన జ్ఞానమేఘం – శంకర భగవత్పాదులు అవతరించిన కేరళ రాష్ట్రంలో వుంది గురువాయూరు శ్రీకృష్ణాలయం. మద్రాసు మంగుళూరు రైలు మార్గంలో పట్టాంబి రైలు స్టేషన్‌కు ఎనిమిది మైళ్ళ దూరంలో వుంది గురువాయూరు.

ప్రతి దినం తిరునాళ్ళులా కనబడే ఈ గుడి తలుపులు రోజూ వేకువ జామున మూడు గంటల కల్లా తెరువబడుతాయి.

తూర్పున అరుణరేఖలు విచ్చుకునే ప్రాతఃకాల సమయాన–ముందు రోజు అలంకరింపబడిన వస్త్ర పుష్ప భూషణాదులతో 'నిర్మాల్య దర్శనం' జరుగుతుంది. ఆ పైన విశ్వరూప దర్శనం, తైలాభిషేకం జరుగుతాయి. 'పురుషసూక్తం' పఠిస్తూ శంఖాభిషేకం, స్వర్ణకలశంలోని వినిర్మలజలంతో 'పూర్ణమంజనం' తర్వాత నైవేద్యం, ఉషఃకాల పూజ జరుగుతాయి.

రోజూ త్రికాల పూజలు, ఉత్సవాలతోపాటు ఏటా కార్తీక ఏకాదశి రోజున మండల పూజలు, శ్రీకృష్ణ జయంతి పర్వదినాన వేడుకలు, ఉత్సవాలు నయనానందకరంగా జరుగుతాయి.

ఆలయానికి ఈశాన్యంగా కోనేరు, కోనేరు గట్టున 'దుర్గ' గుడి వున్నాయి. స్నానానంతరం 'అంబ'ను దర్శించి 'గురువాయూరప్ప' దర్శనానికి వెళ్ళడం సాంప్రదాయం.

తూర్పు ముఖంగా వెలుగొందే ఈ ఆలయధ్వజ స్తంభం ముందు నిరంతరం ప్రార్థనలు, నారాయణ నామ జపం, అన్న ప్రాసనలు, పెళ్ళిళ్ళు, తులాభారాలు జరుగుతూ వుంటాయి.

గోపుర ద్వారంలో ప్రవేశించగానే ఎడమవైపున 'విజయ ఘంట', దానికి ఎదురుగా వున్న గజ మంటపం మన దృష్టిని ఆకర్షిస్తాయి. ఈ గజ మంటపంలోనే భజనలు, ఉత్సవాలు, సంగీత కార్యక్రమాలు జరుగుతూ వుంటాయి. ఈ మంటపానికి పై భాగంలో విష్ణు లీలలను వివరించే చిత్రపటాలు అందంగా అమర్చబడి వున్నాయి.

విజయ ఘంటకు సమీపంలో ఉన్నతమైన వేంబత్తూర్ నారాయణ భట్టాద్రి పీఠం వుంది.

వేదాలను విభజించి, పంచమ వేదమైన మహాభారతం రచించిన తర్వాత, వేదవ్యాస మహర్షి మనశ్శాంతి కోసం భగవల్లీలను అభివర్ణించే భాగవత గ్రంథం రచించాడు. దాన్ని మందార మకరంద మాధుర్యాలొలికే తెలుగు భాగవతంగా తీర్చిదిద్దాడు మన బమ్మెర పోతన. వ్యాస భాగవతాన్ని ఆధారం చేసుకుని విష్ణు లీలలను అభివర్ణిస్తూ– వేయి సంస్కృత శ్లోకాలతో 'నారాయణీయం' రచించాడు నారాయణ భట్టాద్రి. ఈ రచనకు పూర్వం నారాయణ భట్టాద్రి పక్షవాతంతో బాధపడేవాడనీ; గురువాయూరప్ప సమక్షంలోనే నారాయణీయం రచించి ఆ దేవ దేవునికి అంకితమిచ్చిన తర్వాత అతనికి స్వస్థత చేకూరిందనీ విశ్వాసం. ఈయన పదహారవ శతాబ్దికి చెందిన కవి. అంచేత అంతకుముందే ఈ ఆలయం వెలిసిందనడానికి ఇది చారిత్రకాధారం!

ఈ ఆలయం - గర్భగృహంలో శంఖుచక్ర గదా పద్మపాణియై మందహాసంతో వెలుగొందే 'గురువాయూరప్ప' చరణార విందాలను రోజూ దర్శించే అశేష భక్తజన కోటితోపాటు, బాల భాస్కరుడు సైతం ఏడాదికి రెండుసార్లు తన కిరణ కరాలతో స్పృశించడం గొప్ప విశేషం.

*



వేదుల షణ్ముఖప్రియ

**కళలలోగానీ, క్రీడారంగంలోగానీ రాణించాలంటే అందుకు బాల్యంలోనే కొంత ఉత్సాహం ఏర్పడాలి. తల్లిదండ్రుల ప్రోత్సాహం లభించాలి. ఈ రెండూ సమన్వయమైనప్పుడే ఆ పిల్లలు తమకు నచ్చిన రంగంలో రాణించగలుగుతారు; పేరు తెచ్చుకోగలుగుతారు. అటువంటి ఉత్సాహమూ, ప్రోత్సాహమూ గల బాలిక వేదుల షణ్ముఖప్రియ.**

షణ్ముఖప్రియ తన నాలుగవ ఏటనే శ్రీ ఎన్. మురళీకృష్ణ వద్ద నాట్యం నేర్చుకోవడం ప్రారంభించింది. రెండేళ్ళు గడిచేసరికి అందరి మన్ననలూ పొందేస్థాయికి ఎదిగింది.

1978లో హైద్రాబాదులో రాష్ట్రస్థాయిలో జరిగిన బాలల అకాడెమి జూనియర్స్ విభాగం నాట్య పోటీలలోనూ, చిత్తూరు జేసీస్ నాట్య పోటీలలోనూ ప్రథమ బహుమతులు పొందింది. ఇవి కాక జిల్లా స్థాయిలో జరిగిన పోటీలలో అనేక బహుమతులు సంపాయించింది. గత సంవత్సరం విజయవాడలో జరిగిన పారిశ్రామిక ప్రదర్శనలో తన నాట్య ప్రదర్శనతో పలువురి మన్ననలు పొందింది.

ఇంతవరకూ దాదాపు ఇరవై నాట్య ప్రదర్శనలు యిచ్చిన షణ్ముఖప్రియ శాస్త్రీయ సంగీతం కూడా నేర్చుకుంటున్నది. శాస్త్రీయ సంగీతంలో దిట్ట అయిన ఆమె తండ్రి శ్రీ వి.వి. సుబ్బరామ్ తన తీరిక సమయంలో ఈ చిన్నారికి గాత్రం నేర్పుతున్నారు.

చిత్తూరు లిటిల్‌ఫ్లవర్ కాన్వెంట్‌లో మూడవ తరగతి చదువుతున్న ఈ బాలిక తను నేర్చిన విద్యని కేవలం బహుమతులు పొందడానికీ, జనరంజకంగా వుండడానికే కాకుండా, ప్రజాహిత కార్యక్రమాలకు కూడా వినియోగించడం చెప్పుకోదగ్గ విశేషం. తుపాను బాధితుల సహాయార్థం మదనపల్లె విద్యోదయా కాన్వెంట్ తరఫున నాట్యప్రదర్శన ఇచ్చి నిధి సేకరణకి తోడ్పడింది షణ్ముఖప్రియ.



మన దేవాలయాలు:

# గురువాయూరు

వంచనను నాశనం చేసి మంచిని సంరక్షించడానికి అవసరమైనప్పుడల్లా అంతరిస్తూ వుంటాడు భగవంతుడు - అన్నది సనాతన హైందవ విశ్వాసం. దేవదేవుడైన మహావిష్ణువు అవతారాలలో శ్రీకృష్ణ అవతారమే పూర్ణావతారం అని వైష్ణవాచార్యుల అభిప్రాయం. అంటే - భగవదవతారానికి వుండవలసిన సర్వమంగళ దివ్య లక్షణ పరిమళంతో ప్రకాశించే పవిత్ర స్వరూపం శ్రీకృష్ణపరమాత్మ!

వైష్ణవులకు మాత్రమే కాదు - ఐదారు వేల సంవత్సరాలుగా సనాతన సాంస్కృతిక గంగా ప్రవాహాన్ని ప్రభావితం చేస్తూన్న ఉత్తుంగ హిమాలయ శృంగం - గిరిధరుని మహిమాన్విత చరితం.

ఆధ్యాత్మిక జ్ఞానామృతంతో అల్లనల్లన వీచే సంగీత సాహిత్య తరంగాలకు మూలాధారం - మురళీ కృష్ణుని మోహనరాగం.

తరతరాలుగా భక్తజన హృదయ మయూరాలను ఆనంద నాట్యం చేయిస్తున్న మేఘమాలికలు నీల మేఘశ్యాముని లీలా వినోదాలు.

జన్మతః అందరూ సమానులే. మనిషిని మాన్యునిగా లేదా హీనునిగా చేసేవి వాని గుణగణాలు, నడవడిక అన్నది వాసుదేవుని తిరుగులేని సిద్ధాంతం.

జీవిత 'కురుక్షేత్రం'లో విజృంభించిన విధ్వంసక శక్తులను రూపు మాపడానికి 'గాండీవం'నారి సారించమని 'నరుని' తట్టి లేపి ప్రపంచంలోనే ప్రప్రథమంగా సాయుధ విప్లవ శంఖారావం చేసింది పురుషోత్తముని పాంచజన్యమే!



శ్రీకృష్ణుని - ఎప్పుడో పుట్టి ఎక్కడో జీవించి మరెక్కడో అవతారం చాలించిన పురాణ పురుషునిగా గాక ప్రతి క్షణాన్ని శాసించి నడిపే మానుష రూపధారిగా మన కళ్ళ ముందు నిలిపి మన మనసులను మాధవమందిరాలుగా మార్చుకోడానికి దోహదం చేసే విష్ణు క్షేత్రం - గురువాయూరు కృష్ణ మందిరం!

ద్వాపర యుగాంతంలో తన అవతార కార్యం పూర్తయిన తర్వాత కృష్ణుడు అవతారం చాలించడానికి నిర్ణయించాడు. అప్పటికే బంధువులందరూ అంతఃకలహాలతో నాశనమైపోయారు. వారిలో సజ్జనుడైన ఉద్ధవుని పిలచి-తన అవతార పరిసమాప్తి తర్వాత రాజమందిరంలోని తన విగ్రహాన్ని సురక్షిత స్థలానికి తరలించమని దేవగురువైన బృహస్పతికి సందేశం పంపాడు. బృహస్పతి ద్వారకకు చేరుకునేసరికి ఆ నగరం సముద్ర గర్భంలో కలిసిపోయింది. సాగర తరంగాల మధ్య కృష్ణవిగ్రహం కొట్టుకు పోయింది. బలశాలియైన వాయుదేవుని సాయంతో ధీశాలియైన బృహస్పతి దానిని గట్టుకు చేర్చాడు. గురు, వాయుదేవులు దక్షిణంగా పయనమై పరశురామ క్షేత్రంగా ప్రసిద్ధి గాంచిన దక్షిణాగ్రం చేరుకున్నారు. పైరు పచ్చలతో కొబ్బరి

తోటల మధ్య ప్రశాంత వాతావరణంలో ఒక అందమైన తామర తటాకాన్ని చూసి అక్కడే ఆ కృష్ణ విగ్రహాన్ని ప్రతిష్ఠ చేశారు. గురువు వాయువులచే ప్రతిష్ఠ చేయబడడం వల్ల ఆ దేవునికి 'గురువాయూరప్ప' అనీ ఆ పుణ్యక్షేత్రానికి 'గురువాయూరు' అనీ సార్థకనామధేయాలు ఏర్పడ్డాయి!

కాలగతివల్ల, పరిస్థితుల దుష్ప్రభావం వల్ల పతనం దాపురించినప్పటికీ–బుద్ధి బలంతో ప్రయత్నించి పతనం నుంచి బయటపడి మనిషి మనుగడ సాధించవచ్చు – అని పరోక్షంగా ప్రబోధించే ఈ గాథ – గురువాయూరు ఆలయ స్థల పురాణం!

దేశం నలుమూలలా అశాంతి, అరాచకాలు, మత కలహాలు, నాస్తిక వాదాలు పైశాచిక నృత్యం చేసిన కాలఘట్టంలో అద్వైతామృత వర్షంతో భారతీయ ఆధ్యాత్మిక జీవనానికి పునరుజ్జీవనం ప్రసాదించిన జ్ఞానమేఘం – శంకర భగవత్పాదులు అవతరించిన కేరళ రాష్ట్రంలో వుంది గురువాయూరు శ్రీకృష్ణాలయం. మద్రాసు మంగుళూరు రైలు మార్గంలో పట్టాంబి రైలు స్టేషన్‌కు ఎనిమిది మైళ్ళ దూరంలో వుంది గురువాయూరు.

ప్రతి దినం తిరునాళ్ళులా కనబడే ఈ గుడి తలుపులు రోజూ వేకువ జామున మూడు గంటలకల్లా తెరువబడుతాయి.

తూర్పున అరుణరేఖలు విచ్చుకునే ప్రాతఃకాల సమయాన–ముందు రోజు అలంకరింపబడిన వస్త్ర పుష్ప భూషణాదులతో 'నిర్మాల్య దర్శనం' జరుగుతుంది. ఆ పైన విశ్వరూప దర్శనం, తైలాభిషేకం జరుగుతాయి. 'పురుషసూక్తం' పఠిస్తూ శంఖాభిషేకం, స్వర్ణకలశంలోని వినిర్మలజలంతో 'పూర్ణమంజనం' తర్వాత నైవేద్యం, ఉషఃకాల పూజ జరుగుతాయి.

రోజూ త్రికాల పూజలు, ఉత్సవాలతోపాటు ఏటా కార్తీక ఏకాదశి రోజున మండల పూజలు, శ్రీకృష్ణ జయంతి పర్వదినాన వేడుకలు, ఉత్సవాలు నయనానందకరంగా జరుగుతాయి.

ఆలయానికి ఈశాన్యంగా కోనేరు, కోనేరు గట్టున 'దుర్గ' గుడి వున్నాయి. స్నానానంతరం 'అంబ'ను దర్శించి 'గురువాయూరప్ప' దర్శనానికి వెళ్ళడం సాంప్రదాయం.

తూర్పు ముఖంగా వెలుగొందే ఈ ఆలయధ్వజస్తంభం ముందు నిరంతరం ప్రార్థనలు, నారాయణ నామ జపం, అన్న ప్రాసనలు, పెళ్ళిళ్ళు, తులాభారాలు జరుగుతూ వుంటాయి.

గోపుర ద్వారంలో ప్రవేశించగానే ఎడమవైపున 'విజయ ఘంట', దానికి ఎదురుగా వున్న గజ మంటపం మన దృష్టిని ఆకర్షిస్తాయి. ఈ గజ మంటపంలోనే భజనలు, ఉత్సవాలు, సంగీత కార్యక్రమాలు జరుగుతూ వుంటాయి. ఈ మంటపానికి పై భాగంలో విష్ణు లీలలను వివరించే చిత్రపటాలు అందంగా అమర్చబడి వున్నాయి.

విజయ ఘంటకు సమీపంలో ఉన్నతమైన వేంబత్తూర్ నారాయణ భట్టాద్రి పీఠం వుంది.

వేదాలను విభజించి, పంచమ వేదమైన మహాభారతం రచించిన తర్వాత, వేదవ్యాస మహర్షి మనశ్శాంతి కోసం భగవల్లీలను అభివర్ణించే భాగవత గ్రంథం రచించాడు. దాన్ని మందార మకరంద మాధుర్యాలొలికే తెలుగు భాగవతంగా తీర్చిదిద్దాడు మన బమ్మెర పోతన. వ్యాస భాగవతాన్ని ఆధారం చేసుకుని విష్ణు లీలలను అభివర్ణిస్తూ – వేయి సంస్కృత శ్లోకాలతో 'నారాయణీయం' రచించాడు నారాయణ భట్టాద్రి. ఈ రచనకు పూర్వం నారాయణ భట్టాద్రి పక్షవాతంతో బాధపడేవాడనీ; గురువాయూరప్ప సమక్షంలోనే నారాయణీయం రచించి ఆ దేవ దేవునికి అంకితమిచ్చిన తర్వాత అతనికి స్వస్థత చేకూరిందనీ విశ్వాసం. ఈయన పదహారవ శతాబ్దికి చెందిన కవి. అంచేత అంతకుముందే ఈ ఆలయం వెలిసిందనడానికి ఇది చారిత్రకాధారం!

ఈ ఆలయం - గర్భగృహంలో శంఖుచక్ర గదా పద్మపాణియై మందహాసంతో వెలుగొందే 'గురువాయూరప్ప' చరణార విందాలను రోజూ దర్శించే అశేష భక్తజన కోటితో పాటు, బాల భాస్కరుడు సైతం ఏడాదికి రెండుసార్లు తన కిరణ కరాలతో స్పృశించడం గొప్ప విశేషం. *



వేదుల షణ్ముఖప్రియ

కళలోగానీ, క్రీడారంగంలోగానీ రాణించాలంటే అందుకు బాల్యంలోనే కొంత వుత్సాహం ఏర్పడాలి. తల్లిదండ్రుల ప్రోత్సాహం లభించాలి. ఈ రెండూ సమన్వయమైనప్పుడే ఆ పిల్లలు తమకు నచ్చిన రంగంలో రాణించగలుగుతారు; పేరు తెచ్చుకోగలుగుతారు. అటువంటి వుత్సాహమూ, ప్రోత్సాహమూ గల బాలిక వేదుల షణ్ముఖప్రియ.

షణ్ముఖప్రియ తన నాలుగవ ఏటనే శ్రీ ఎన్. మురళీకృష్ణ వద్ద నాట్యం నేర్చుకోవడం ప్రారంభించింది. రెండేళ్ళు గడిచేసరికి అందరి మన్ననలూ పొందేస్థాయికి ఎదిగింది.

1978 లో హైద్రాబాదులో రాష్ట్రస్థాయిలో జరిగిన బాలల అకాడెమీ జూనియర్స్ విభాగం నాట్య పోటీలలోనూ, చిత్తూరు జేసీస్ నాట్య పోటీలలోనూ ప్రథమ బహుమతులు పొందింది. ఇవి కాక జిల్లా స్థాయిలో జరిగిన పోటీలలో అనేక బహుమతులు సంపాయించింది. గత సంవత్సరం విజయవాడలో జరిగిన పారిశ్రామిక ప్రదర్శనలో తన నాట్య ప్రదర్శనతో పలువురి మన్ననలు పొందింది.

ఇంతవరకూ దాదాపు ఇరవై నాట్య ప్రదర్శనలు యిచ్చిన షణ్ముఖప్రియ శాస్త్రీయ సంగీతం కూడా నేర్చుకుంటున్నది. శాస్త్రీయ సంగీతంలో దిట్ట అయిన ఆమె తండ్రి శ్రీ వి.వి. సుబ్బరామ్ తన తీరిక సమయంలో ఈ చిన్నారికి గాత్రం నేర్పుతున్నారు.

చిత్తూరు లిటిల్‌ఫ్లవర్ కాన్వెంట్‌లో మూడవ తరగతి చదువుతున్న ఈ బాలిక తను నేర్చిన విద్యని కేవలం బహుమతులు పొందడానికీ, జనరంజకంగా వుండడానికే కాకుండా, ప్రజాహిత కార్యక్రమాలకు కూడా వినియోగించడం చెప్పుకోదగ్గ విశేషం. తుపాను బాధితుల సహాయార్థం మదనపల్లె విద్యోదయా కాన్వెంట్ తరఫున నాట్యప్రదర్శన ఇచ్చి నిధి సేకరణకి తోడ్పడింది షణ్ముఖప్రియ.

# సంస్కృత పాఠమాల [7]

तद् తద్ – అది

**तद् शब्दस्य लिङ्गत्रयेऽपि प्रथमाविभक्ति रूपाणि**
తద్ శబ్దస్య లింగత్రయేపి ప్రథమావిభక్తి రూపాణి
తద్ శబ్దము యొక్క ప్రథమావిభక్తిలో మూడు లింగముల రూపములు

| | ఏక | ద్వి | బహు (వచనములు) |
|---|---|---|---|
| పుంలింగే **पुंलिङ्गे** పులింగమున | సః<br>**सः**<br>అతడు | తౌ<br>**तौ**<br>వారు | తే<br>**ते**<br>వారు |
| స్త్రీలింగే **स्त्रीलिङ्गे** స్త్రీలింగమున | సా<br>**सा**<br>ఆమె | తే<br>**ते**<br>వారు | తాః<br>**ताः**<br>వారు |
| నపుంసకలింగే **नपुंसकलिङ्गे** నపుంసకలింగమున | **तद्**<br>తద్ | **ते**<br>అవి | తాని<br>**तानि**<br>అవి |

**प्रश्न :** ప్రశ్నాః ప్రశ్నలు :

| సః కః | సా కా | తత్ కిమ్ |
|---|---|---|
| **सः कः** | **सा का** | **तत् किम्** |
| అతడెవరు ? | ఆమె ఎవరు ? | అది ఏమి ? |

వర్తమాన క్రియా రూపములు :

| | | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|---|
| ప్రథమపురుష | **ति तः अन्ति**<br>తి తః అన్తి | **गच्छति**<br>గచ్ఛతి | **गच्छतः**<br>గచ్ఛతః | **गच्छन्ति**<br>గచ్ఛంతి |
| మధ్యమపురుష | **सि थः थ**<br>సి థః థ | **गच्छसि**<br>గచ్ఛసి | **गच्छथः**<br>గచ్ఛథః | **गच्छथ**<br>గచ్ఛథ |
| ఉత్తమ పురుష | **मि वः मः**<br>మి వః మః | **गच्छामि**<br>గచ్ఛామి | **गच्छावः**<br>గచ్ఛావః | **गच्छामः**<br>గచ్ఛామః |

ఉదాహరణ వాక్యములు :

పుంలింగము :

అయం వృక్షః **अयं वृक्षः** ఇది వృక్షము
వృక్షః **वृक्षः** వృక్షము
ఫలతి **फलति** పండ్లు కాయుచున్నది
సః **सः** అది
గజః **गजः** గజము
గజః గచ్ఛతి **गजः गच्छति** గజము పోవుచున్నది
అజః **अजः** అజము
తిష్ఠతి **तिष्ठति** నిలచి యున్నది
రామః **रामः** రాముడు
పఠతి **पठति** చదువుచున్నాడు

స్త్రీ లింగము :

ఇయం లతా **इयं लता** ఇది లత
లతా **लता** లత
పుష్యతి **पुष्यति** పుష్పించుచున్నది
సా బాలా **सा बाला** ఆమె బాల
బాలా తిష్ఠతి **बाला तिष्ठति** బాల నిలచియున్నది
మాలా **माला** మాల
మ్లాయతి **म्लायति** వాడిపోవుచున్నది
సీతా **सीता** సీత
వదతి **वदति** మాటాడుచున్నది

నపుంసకలింగము :

ఇదం పుష్పమ్ **इदं पुष्पम** ఇది పుష్పము
పుష్పమ్ **पुष्पम** పుష్పము
వికసతి **विकसति** వికసించుచున్నది
తత్ పాత్రమ్ **तत् पात्रम** అది పాత్రము
పాత్రమ్ **पात्रम** పాత్రము
పతతి **पतति** పడుచున్నది
నేత్రమ్ **नेत्रम** నేత్రము
స్ఫురతి **स्फुरति** స్ఫురించుచున్నది
ముఖం **सुख** ముఖము
లసతి **लसति** ప్రకాశించుచున్నది

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

OBM/1765 TEL

**కేర్‌ఫ్రీ** మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునిక యువతికి చేదోడు.

**కేర్‌ఫ్రీ** ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్, ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, **కేర్‌ఫ్రీ** ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క **కేర్‌ఫ్రీ** మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకలు పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

**కేర్‌ఫ్రీ**తో మీరు హాయియైన భావన పొందగలరు, నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

**కేర్‌ఫ్రీ** వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

**కేర్‌ఫ్రీ** ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




**10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిసుంది.**

Johnson & Johnson



# అఖిల భారత కార్మిక వనితా సమ్మేళనం

ముప్ఫై సంవత్సరాలుగా అంటే - మనదేశం స్వాతంత్ర్యం సాధించిన తర్వాత అన్ని రంగాలలో పాటు వనితా లోకంలోనూ ప్రగతి రేఖలు ద్యోతకమౌతూనే వున్నాయి. అంతవరకూ పురుషులే గుత్తాధిపత్యం వహిస్తూ వచ్చిన వివిధ శాఖలలో క్రమక్రమంగా స్త్రీలు కూడా ప్రవేశించడం దీనికొక చక్కని ఉదాహరణ. ఇది ముదావహమైన విషయమే!

అయితే కార్యాలయాలకు మాత్రం అంటే గుమాస్తాలుగా, టైపిస్టులుగా, స్టెనోలుగా వెళ్ళే వనితల సంఖ్య ఇతోధికంగా పెరిగిందే కాని పరిశ్రమలలో పనిచేసే కార్మిక స్త్రీల సంఖ్య నానాటికి తీసి కట్టుగా వుంటోంది. దీనికి కారణం ఏమిటి? ఈ సమస్యకు పరిష్కార మార్గాలు వున్నాయా? మొదలైన అంశాలను క్షుణ్ణంగా పరిశీలించి కొన్ని సూచనలు కూడా సూచించాయి ఇటీవల మద్రాసులో జరిగిన అఖిల భారత కార్మిక స్త్రీ జన మహాసభలు!

దేశంలోని అన్ని రాష్ట్రాల నుంచి వివిధ రంగాలలో పనిచేసే వనితా ప్రతినిధులు తొలిసారిగా ఒకచోట సమావేశమై తమ సమస్యలను గురించి చర్చించుకొని, కొన్ని అభిప్రాయాలు సేకరించి, నిర్మాణాత్మకమైన తీర్మానాలు కొన్ని చేశారు. ఇలాంటి సమావేశం జరగడం మనదేశంలో ఇదే ప్రప్రథమం.

కార్మిక స్త్రీ జన ప్రతినిధులుగా ఈ సమావేశంలో పాల్గొన్న వ్యక్తులందరూ స్పృశించిన మొదటి అంశం - వేతనం!

స్త్రీలు, పురుషులు ఒకే పరిశ్రమలో ఒకే రకమైన పని చేస్తున్నా జీతాలలో మాత్రం భేదాలు కనబడుతున్నాయి. జీతాలే ఇలా వుంటే ఉద్యోగంలో ప్రమోషన్ విషయం ప్రస్తావించనవసరం లేదు.

కొన్ని పరిశ్రమలలో ప్రసవ కాల భత్యం ఇవ్వడం లేదు. అంచేత ప్రసవ సమయంలో సంపాదన పోగొట్టుకోవలసి వస్తుంది. దీని కారణంగా కొన్ని కుటుంబాలలో మాతృత్వం మహాపరాధంగా పరిగణించబడుతోంది.

ఉమ్మడి కుటుంబాలు పోటీపడి మాయమౌతున్న ఈ రోజుల్లో ఉద్యోగినులైన స్త్రీలకు పసి పాపలను ఎక్కడ వదలి వెళ్ళడం అనేది పెద్ద సమస్య! మామూలుగా ముప్ఫై మంది స్త్రీలు పనిచేస్తున్న చోట పాపల్ని చూసుకోడానికి ఒక వసతి గృహం ఏర్పాటు చేయాలంటారు. అయినా వందలాది వనితలు పనిచేసే ప్రభుత్వ కార్యాలయాలలో సైతం అలాంటిదేదీ లేకపోవడం ఈనాటి ప్రత్యక్ష సత్యం!

రోజుకు ఎనిమిది గంటలు మాత్రమే పనిచేయాలని చట్టం వున్నప్పటికీ నిర్ణీత సమయానికి కన్నా ఎక్కువసేపు పనిచేయడం జరుగుతూ వుంది. ఇక రాత్రి షిఫ్ట్ పనిచేసే వారికి - పని ముగించిన తర్వాత విశ్రాంతి తీసుకోడానికి కావలసిన వసతి, సౌకర్యాలు ఎక్కడా కనబడడం లేదు.

ఇలాంటి సమస్యలు ఎన్నో వున్నాయి.

ఈ సమస్యలన్నిటినీ పరిశీలించి — వెంటనే అమలు చేయాలనే ఉద్దేశంతో కొన్ని నిర్మాణాత్మకమైన సూచనలు కూడా చేశాయి ఈ సభలు! కొన్ని కోర్కెలను కూడా ఈ మహాసభ ప్రతిపాదించింది.

పనిచేసే హక్కులు-స్త్రీల ప్రాథమిక హక్కుగా రాజ్యాంగ చట్టం మూల సూత్రాలలో చేర్చాలి.

పనిచేసే సమయం రోజుకు ఎనిమిది గంటల కన్నా ఎక్కువ కాకుండా ప్రతిచోటా అమలు జరిగేట్టు చూసుకోవాలి.

స్త్రీలకు కూడా పురుషులతో సరి సమానంగా ఉద్యోగ అవకాశాలు, వేతనాలు - ప్రమోషన్ అవకాశాలు ఏర్పరచాలి.

ప్రతి సంస్థలోనూ ప్రసవకాల భత్యం నాలుగు నెలలకు ఇవ్వాలి. ప్రసవ సమయానికయ్యే వైద్య ఖర్చులకు ఉపకార వేతనం ఏర్పాటు చేయాలి.

పట్టణ ప్రాంతాలలోనూ, పల్లెల్లోనూ పనిచేసే స్త్రీల పిల్లలను చూసుకోడానికి శిశు సంక్షేమ శిబిరాలు నెలకొల్పాలి. వారిని చూసుకోడానికి మంచి శిక్షణ పొందిన నర్సులను, ఆయాలను అక్కడ నియమించాలి.

పనిచేసే స్త్రీలకంటూ – నగర ప్రాంతాలలో రాయితీలతో – ప్రభుత్వమే వసతి గృహాలు నిర్మించాలి.

ఐతే, ఇవన్నీ ఒక్క పూటలో అయ్యేపనులు కావు. ఎంతోదూరం పయనం చెయ్యాలి. ఆ సుదూర లక్ష్యం వైపు పయనించడానికి ఉద్యోగినులైన వనితలు బయలుదేరారు - అన్న దానికి ఒక శుభ సూచకం ఈ మహాసభ!

—శాంతి

# సంచార శిశు సంక్షేమ

మహా నగరం.

జన సందోహంతో కిటకిటలాడుతోంది. ఎవరికి వారే ఎవరో తరుముతున్నట్లుగా హడావిడిగా పరుగిడుతున్నారు.

ఆనందం, ఆందోళన, ఆరాటం అన్నీ మేళవించిన విచిత్ర నగరం అది. అక్కడ ఒకరి గురించి మరొకరికి పట్టించుకునే తీరికే లేదు. ఎవరి గొడవ వారిది - ఎవరి బతుకు వారిది.

ఆ నగరానికి రోజూ ఎందరో దగ్గర పల్లెలలో నుంచీ, దూరపు వూళ్ళ నుంచి వస్తూ వుంటారు.

ఉన్న వూళ్లో పొట్ట గడవక కార్మికులు, పొద్దుపోక కామందులూ ఒకరు భుక్తి కోసం, మరొకరు రక్తి కోసం అలా వలస వెళ్లడమన్నది కొత్త కాదు.

అలా పొట్ట చేత్తో పట్టుకుని నలుగురు పిల్లలతో ఆ బొంబాయి నగరం చేరుకున్నారు జానకి, నాగయ్య. వాళ్ళది గుల్బర్గా. అక్కడ బతుకు దుర్భరమవడంతో 'మహానగరంలో మనకో చోటు లభించదా' అన్న ఆశతో వచ్చారు. వారి ఆశ అడియాస కాలేదు. ఇద్దరూ రోజుకూలీ మీద ఒక భవన నిర్మాణ కార్యక్రమంలో పనికి కుదిరారు.

జానకి తట్ట తల మీద వుంచుకుని, అంచెలంచల మీద తోటి కూలీలకి అందిస్తుంది. ఎండ - వానలను ఆమె పట్టించుకోవడం లేదు. పని ...పని పని....పని చేస్తేనే పిల్లల కడుపులు నిండుతాయి. అదే ఆమెకు కావలసినది.

ఐతే భార్యాభర్తలిద్దరూ పన్లోకి వెళితే పిల్లల సంగతెవరు చూస్తారు? అందులో ఆఖరిది మరీ పసిదాయె. ఈ సమస్య ఒక్క జానకి మాత్రమే కాదు. అక్కడ కూలీపని చేస్తున్న వనితలెందరో ఎదుర్కొంటున్నదే. తల్లులు పనిచేస్తుంటే పిల్లలు అక్కడే యిసుకలో ఆడుకోవడమో, కాస్త నీడపట్టున నిద్రించడమో చేస్తున్నారు. వారి ఆలనా పాలనా చూసే నాధుడే లేడు.

కూలీలని పనిలోకి తీసుకున్న కంట్రాక్టర్లకి ఎంతసేపూ లాభాల మీద దృష్టి వుంటున్నదే కాని తమకు చెమటోడ్చి పనిచేస్తున్న కూలీల గురించి ఆలోచించరు.

కాని జానకి అదృష్టవంతురాలు. ఆమె అక్కడ చేరేనాటికి కొందరి సమిష్టి కృషి ఫలితంగా పరిస్థితులు మారాయి. జానకి తన పసిదాని గురించి బెంగపడడం లేదు. తెల్లటిగుడ్డ ఊయలలో నిద్రిస్తోందా పాప. తన పెద్దపిల్లలు బలాదూర్ తిరుగుతున్నారన్న బాధ అసలే లేదు. వారు అక్కడి బాల్వాడీలో పాఠాలు నేర్చుకుంటున్నారు. ఆటలు ఆడుకుంటున్నారు. భవన నిర్మాణ ప్రాంతంలోనే వెలసిన సంచార శిశు సంక్షేమ శిబిరం (మొబైల్ క్రెష్) జానకి పాలిటి వరప్రసాదమైంది. పనికి వెళ్ళేముందు ఆ పిల్లని అక్కడ విడిచి పెడుతుంది జానకి. సురక్షితమైన చేతుల్లో తన బిడ్డ వున్నదన్న సంతృప్తితో జానకి తన పని ఎంతో ప్రశాంత చిత్తంతో నెరవేర్చగలుగుతోంది.

సరిగ్గా దశాబ్దం క్రితం పరిమితమైన స్థాయిలో ఈ సంచార శిశు సంక్షేమ కేంద్రాలు బొంబాయి, ఢిల్లీ నగరాలలో ప్రారంభమయ్యాయి.

అప్పట్లో బొంబాయిలోని కార్మిక వనితల స్థితిగతులు పరిశీలించిన శ్రీమతి మీరా మహాదేవన్ ఈ ఉద్యమానికి నాంది పలికారు. నేడు ఆమె లేకపోయినా ఈ కేంద్రాలు మాత్రం నానాటికి



అభివృద్ధి చెందుతూ ఆమె స్మృతి చిహ్నంగా నిలచిపోయాయి.

అసలు ఆమెకు భవన నిర్మాణ ప్రాంతంలోనే వీటిని స్థాపించాలన్న ఆలోచన ఎలా కలిగింది?

"గాంధీ శత జయంత్యుత్సవాల సందర్భంగా గాంధీ శాంతి సమాఖ్య ఆధ్వర్యంలో జరిగిన స్త్రీ, శిశు సంక్షేమ కార్యక్రమాలను మీరా నిర్వహించారు. ఆ కార్యక్రమంలో ఒక భాగంగా సమాఖ్య - భవన నిర్మాణ కార్యక్రమం చేపట్టింది. అక్కడ పనిచేసే కార్మికుల పిల్లలు సరైన ఆలనా పాలనా, భోజన వసతులు లేకుండా వుండటం ఆమె చూశారు. దాంతో 'వర్క్ స్పాట్'ల లోనే ఈ సంక్షేమ కేంద్రాలు ప్రారంభించాలన్న ఆలోచన ఆమెకు కలిగింది. ప్రారంభంలో ఒక పద్ధతి, ప్రణాళిక అంటూ లేకుండా ఎంతో ఉత్తేజంతో మీరా ఎంత హఠాత్తుగా నిర్ణయం తీసు



## శిబిరాలు ఊరూరా వుండాలి!



కున్నారో అంత త్వరితంగానూ ఈ కేంద్రాన్ని ప్రారంభించారు.'' అన్నారు ఈ 'మొబైల్ క్రెష్'ల అధ్యక్షురాలు శ్రీమతి దేవకీసింగ్.

ప్రస్తుతం ఢిల్లీ, బొంబాయి నగరాలలో దాదాపు నాలుగు వేల మంది బాలలకి ఈ కార్యక్రమం సదుపాయాలు అందుతున్నాయి. ఈ రెండు నగరాలలోనూ ఏభై దాకా సంచార శిశు సంక్షేమ కేంద్రాలు వున్నాయి. ఇవికాక వీరు బాల్వాడీలు, వయోజన విద్యా కేంద్రాలు కూడా నిర్వహిస్తున్నారు. కార్మికులకు యివి విద్య గరపుతున్నాయి. వీటన్నిటి నిర్వహణకి ప్రభుత్వ నిధులు, ప్రజల నుంచి సేకరించిన చందాలు, అంతర్జాతీయ సంస్థల సహకారమూ తోడ్పడుతున్నాయి.

ఇది తమ తమ అవసరాలకి సంబంధించిన విషయం కాబట్టి కార్మిక వనితలు తమ పిల్లలని ఈ 'క్రెష్'లకి పంపడానికి వుత్సాహం చూపుతున్నారు. అందువల్ల ఈ కార్యక్రమం విజయవంతమైంది. అసలు ఈ ఉద్యమం ముఖ్య ఉద్దేశ్యమేమంటే - చదువు సంధ్యలు లేక ఏ రంగంలోనూ సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన నిపుణత్వం లేని కార్మికులకు జీవితంపట్ల సరైన అవగాహన ఏర్పరచడం, వారి పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పించడం. కొంతమంది కార్మికులకు ఈ ఉద్బోధ వంటబట్టింది. వారి పిల్లలు యిప్పుడు చక్కగా చదువుకుంటున్నారు.

అయితే యిటువంటి సంక్షేమ శిబిరాలను ఎంతో శ్రమకోర్చి రూపొందించాలి. కార్యకర్తలు ముందుగా శిబిరం ప్రారంభించదలచుకున్న ప్రదేశానికి వెళ్లి అక్కడి కార్మికులతోనూ, కంట్రాక్టర్లతోనూ చర్చలు జరుపుతారు. అసలు కార్మిక చట్టం ప్రకారం కంట్రాక్టర్లు కార్మికుల పిల్లల కోసం యిటువంటి 'క్రెష్'లు భవన నిర్మాణం జరిగే స్థలంలో ఏర్పాటు చేయాలనే నిబంధన వుంది. కాని మనదేశంలో చట్టప్రకారం ఏవి జరుగుతున్నాయి కనుక? అందుకే చాలామంది కాంట్రాక్టర్లు వీటి ఏర్పాటుపట్ల చిన్నచూపు చూపుతున్నారు. వారిని అతికష్టం మీద శిశు సంక్షేమ శిబిరాల ఏర్పాటుకు ఒప్పించాల్సి వస్తోంది. సాధారణంగా ఈ శిబిరాలు భవన నిర్మాణ కార్యక్రమాన్నిబట్టి ఎనిమిది నెలల నుంచి నాలుగు సంవత్సరాలదాకా పని చేస్తాయి. పనైపోయి కార్మికులు వెళ్ళిపోగానే యివి కూడా మరో కొత్త చోటు వెదుక్కుంటాయి.

అలా కార్మికులు ఒక చోటు నుంచి మరో చోటుకి మారుతూ వుండడం వల్ల ఆ పిల్లలు నేర్చుకుంటున్న చదువు సంధ్యలకి అంతరాయం కలుగుతుందికదా – మరి దానికి ఈ శిశుసంక్షేమ కేంద్రం ఏం చేస్తున్నది?

"కార్మికులు ఒక స్థలం నుంచి మరో స్థలానికి మారుతూ వుంటారు. వారితోపాటే పిల్లలూ వెళ్ళవలసి వస్తుంది. నిజమే. కాని మేమూ వాళ్ళు ఎక్కడున్నా వెదకడానికి ప్రయత్నిస్తాము. వారి చదువు కొనసాగడానికి తగిన సహాయం చేస్తాము'' అంటారు దేవకి.

ఈ శిశుసంక్షేమ శిబిరాల కార్యకలాపాలు నిర్వర్తించడానికి తగిన శిక్షణ పొందిన కార్యకర్తలు వున్నారు. ఆ శిక్షణని ఈ సమాఖ్యవారే యిస్తారు. ఇక్కడి శిక్షణా విధానాన్ని పరిశీలించడానికి చూసి నేర్చుకోవడానికి హోమ్‌సైన్స్ కళాశాల విద్యార్థినులు, యితర సంక్షేమ సంస్థల సభ్యులూ వస్తూ వుంటారు.

భవన నిర్మాణం జరిగే స్థలంలో బహిరంగ ప్రదేశం మధ్యన ఈ శిబిరాలను ప్రారంభిస్తారు కార్యకర్తలు. ఆ ప్రదేశమంతా రంగురంగుల కాగితాలతో, పోస్టర్లతో అలంకరిస్తారు. కార్యకర్తలు పిల్లల పరిశుభ్రత, ఆహార విషయాలు చూసుకుంటారు. పసిపాపలకి పాలు తదితర బలవర్ధక పదార్థాలు యిస్తారు. 'బాల్వాడీ'లో చదువుకుంటున్న పిల్లలకి 'కిచిడి', పాలు, సోయబీన్ బర్ఫీ యిస్తారు. జబ్బుతో వున్న పిల్లలకీ సరైన పోషకాహారం లేనివారికి, కోడిగ్రుడ్లు, పాలు అరటిపళ్ళు యిస్తారు. డాక్టర్ వారిని నిత్యం పరీక్షిస్తూ వుంటారు. బాగా జబ్బుతో వున్న పిల్లలని పెద్ద డాక్టర్లవద్దకు వీరు పంపుతారు. అంతేకాదు. కడుపుతో వున్న తల్లులకీ, బాలింతరాళ్ళకీ వైద్య సదుపాయాలతోబాటు పాలు, విటమిన్లు యిస్తారు.

గుడిసె ప్రాంతాలలోనివారికి కూడా తమ కార్యకలాపాలను వీరు విస్తరింపజేశారు. వేసవి సెలవులు వృధాపోకుండా పిల్లలచేత బొమ్మలు చేయించడం, చిత్రలేఖనం, పుస్తకపఠనం, సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చెయ్యడం కూడా ఈ కార్యకలాపాలలో ఒక భాగం. ఇందులో మరో విశేషం – 'సామూహిక విందు'. ప్రతి ఒక్కరూ గుప్పెడు బియ్యం తెస్తారు. పిల్లలు తెచ్చినదంతా కలిపి విందుభోజనం తయారు చేస్తారన్నమాట. ఇందులో ఎంతో ఆనందముంది. అందరూ కలసి కట్టుగా కూర్చుని ఆరగిస్తూంటే అదో పండుగ.... ఐకమత్యానికి అంతకన్న చిహ్నమేముంది ?

సమాజంలో నిరుపేదగా పుట్టడం కన్నా తాము చేసిన పాపమంటూ ఏమీలేని, అట్టడుగున వున్న ఈ బాలలకి ఈ శిబిరాలు నూతన జీవితాన్ని ప్రసాదిస్తున్నాయి. వెలుగుబాట చూపుతున్నాయి. కీ. శే. మీరా మహదేవన్ మాటల్లో చెప్పాలంటే- ''మొబైల్ క్రెష్''లు ప్రారంభించడంలో మా వుద్దేశ్యం – పిల్లలకు బాల్యదశలో అందవలసిన కనీస సౌకర్యాలు అందేటట్లు చూడడమే. వాటిని విలాసం క్రింద పరిగణించరాదు. అయితే మన దేశంలో కొందరికి మాత్రమే ఈ సౌకర్యాలు లభించడం దురదృష్టకరం. ఇలా పిల్లలందరికీ అంతస్తుతో నిమిత్తం లేకుండా కనీస సౌకర్యాలు అందజేయడం-మన మరో ముఖ్యమైన పెట్టుబడి. ఇది వృధాపోని పెట్టుబడి. కారణం రేపటి దేశాభివృద్ధికి దోహదం చేసేది వారే కాబట్టి భావిభారత దేశాభివృద్ధికి మేము చేస్తున్నది మొదటిమెట్టు మాత్రమే. మన సామాన్య ప్రజల స్థితిగతులు మెరుగుపరచిననాడు కానీ మన దేశంలో ప్రజాప్రభుత్వం నెలకొన్నట్లు లెక్కకాదు. మా చేతనయినంత సహాయం చెయ్యడానికే ఈ సంచార శిశుసంక్షేమ శిబిరాలను ఈ దీన చరితులకోసం మేము ప్రారంభించాము.''

నిజమే. ఇటువంటి సంచార శిశుసంక్షేమ శిబిరాలు దేశమంతటా వ్యాపించాలి. ప్రభుత్వం యిందుకు చేతనైనంత సహాయం చెయ్యాలి. తాము రూపొందించిన చట్టాలు అమలు జరిగేటట్లు చూడాలి. లయన్సుక్లబ్‌లూ, మహిళామండలులు తదితర సాంఘిక సంక్షేమ సంస్థలు కూడా నడుంకడితే ఈ పని మరింత సులభతరమవుతుంది. మనమూ, మన పిల్లలూ వుండడానికి మనకోసం యిళ్ళు కడుతున్నవారికి - భవిష్యత్తులో వారి పిల్లల ఒడిలో వారికి చల్లటినీడ లభిస్తుంది.

—కమలా కుమార్



## వైద్య సలహాలు

కుమారి ఎన్.

నా వయసు పందొమ్మిది సంవత్సరాలు. ముఖం మీద, మోచేతులలో, కాళ్ళలో రోమాలు ఎక్కువగా వున్నాయి. వీటిని పోగొట్టడం ఎలా ? దయచేసి చెప్పగలరు.

ఇది వంశ పారంపర్యంగా – అంటే మీ తల్లిగారికి, ఆమె తల్లిగారికి అలాగే వుండేదే అయితే ఏమీ చేయలేము. బాగా పసుపు రాసుకుని స్నానం చెయ్యడం మంచిది. పెదాల మీదా, గడ్డం క్రిందా మరీ ఎక్కువగా వున్నట్టయితే ''బ్యూటీ క్లినిక్స్''కు వెళ్ళి చూపితే సులభంగా తీసివేస్తారు.

శ్రీమతి కె

నాకు పెళ్ళయి పద్దెనిమిది సంవత్సరాలవుతుంది. ముగ్గురు సంతానం. మూడేళ్ళ నుంచి అప్పుడప్పుడు కడుపునొప్పి వస్తుంది. తెలుపుపడుతూంది. మూత్ర విసర్జన కష్టంగా వుంది. ఋతుస్రావం జరగడానికి నాలుగైదు రోజులు ముందు నుంచే క్రింది కడుపు విపరీతంగా బాధ పెడుతుంది. ఋతుస్రావం సమయంలో కూడా తెలుపు పడుతుంది. ఈ బాధ తగ్గించడం-ఎలా ?

నడుము నొప్పి, క్రింది కడుపు బాధ, తెలుపు పడడం మొదలైన వాటికన్నింటికీ ముఖ్య కారణం గర్భాశయంలో పుండు వుండడమే. అందువల్ల డాక్టర్‌ను సంప్రదించి పరిశోధన చేసుకుని తగిన మందు వాడినట్లయితే బాధ తగ్గిపోతుంది.

కుమారి ఎస్.

నా వయసు ఇరవై సంవత్సరాలు. వక్షోజాలు చాలా చిన్నవిగా వున్నాయి. మనిషిని కూడా చాలా సన్నగా వుంటాను. బరువు పెరిగి వక్షోజాలు పెద్దవి కావాలంటే ఏం చెయ్యాలి. దయచేసి ఒక మార్గం చెప్పండి.

మంచి బలవర్ధకమైన ఆహారంతోపాటు రోజు తప్పకుండా రాగుల గంజి, వేరుసెనగలు, సెనగలు తీసుకోండి. ఆహారంలో పాలూ పళ్ళు విరివిగా చేర్చుకుంటే మంచి ఫలితం కనబడుతుంది.

శ్రీమతి జి. ఆర్.

పన్నెండు నెలల మా పాపకు ఏది తినిపించాలన్నా విశ్వప్రయత్నం చేయవలసి వస్తూంది. ఒక్కోసారి కొద్దిగా పాలు పట్టించడం కూడా అసాధ్యమవుతోంది. మల విసర్జన చేసేటప్పుడు ఏడుస్తుంది. మా పాప బాగా ఆహారం తీసుకుని ఆరోగ్యంగా వుండాలంటే ఏం చెయ్యాలి డాక్టర్ ?

పిల్లలు తిండి దగ్గర మారాం చేయడం సహజమే. దీనికి కారణం కూడా మనమే. పసిపాప ఎప్పుడూ తన చుట్టూ పదిమంది వుండాలని ఆశ పడుతుంది. తను భోజనం చేసే సమయాన్ని పొడిగించడంలో పాప ఎంతో ఆనందం పొందుతుంది. ఎందుకంటే తొందరగా తినేస్తే - తిన్న వెంటనే ఊయలలో వేసి నిద్ర పుచ్చడమో, చేతికి ఏదైనా ఒక బొమ్మను ఇచ్చి వెళ్ళిపోడమో చేస్తూ వుంటారు. అందువల్ల వీలైనంత ఎక్కువసేపు మారాం చేస్తూ వుంటుంది పాప. అంచేత మొదట్నుంచే సరియైన వేళకు ఆహారం తినిపించడం వాడుక చేయాలి. తీసుకోలేదంటే దిగులు పడకుండా ఊరుకోవాలి. అంతేగాని 'అదిగో చందమామ, ఇదిగో కాకిపిల్ల' అంటూ లాలిస్తూ తినిపించకూడదు. అలా చేయడం వల్లనే పిల్లలకు మారాం చేయడం అలవాటవుతుంది. మీ పాపకు సరిగ్గా ఆకలి వేయడం లేదు. అందుకే మల విసర్జన సమయంలో ఏడుస్తుంది. ఆహారం చాలినంత తీసుకోక పోవడం వల్లనే మలబద్ధం ఏర్పడుతుంది. పాపను డాక్టర్‌కు చూపించి ప్రోగ్రెసివ్ ప్రైమరీ కాంప్లెక్స్, యూరినరీ ఇన్‌ఫెక్షన్‌లాంటి రుగ్మతలు ఉన్నాయేమో వైద్య పరీక్ష చేయించి మందులు ఇప్పిస్తే – బాగా ఆకలి వేస్తుంది; ఆరోగ్యంగా వుంటుంది.

కుమారి ఎల్.

నాలుగు నెలలుగా మల విసర్జన ద్వారం వద్ద ఒకే దురదగా వుంటోంది. చిన్న చిన్న గుల్లలు కూడా వస్తున్నాయి. దయచేసి దీనికేదైనా ఒక మందు చెప్పండి డాక్టర్.

మలంలో చిన్న చిన్న పురుగులు వున్నట్టయితే అక్కడ దురద ఏర్పడుతుంది. అందువల్ల కడుపులో నులి పురుగులు వున్నాయా అని మల పరీక్ష చేయించి మందు తీసుకోవాలి. ఉప్పు కలిపిన వెచ్చటి నీళ్లతో శుభ్రంగా కడుక్కుంటే కొంత ఉపశమనం వుంటుంది. మల విసర్జన ద్వారంలో పగుళ్ళు, గుల్లలు వున్నట్టయితే డాక్టర్‌ను సంప్రదించడం ఉత్తమం.

రావుల కనకలక్ష్మి, గోదావరి ఖని

మీరు 'వనిత' ద్వారా తెలియజేసిన 'సమోస బ్యాగ్' అర్థం కాలేదు. దయచేసి వివరంగా చెబుతారా?

సమోస బ్యాగ్ అర్థం కాలేదన్నారు. కొన్ని విషయాలు ఆటోమాటిక్‌గ వేసుకుపోతాం. కాబట్టి ప్రతి చిన్న విషయం వ్రాయనవసరం లేదేమోనని పిస్తుంది. మీకు అర్థం కాలేదన్నారు కాబట్టి వివరంగా చెబుతాను. చిన్న బ్యాగ్‌కు కావలసిన 32 ముక్కలు రన్నింగ్ వయర్‌కు అతకాలన్నాను కదూ! అంటే ముందు 100 అంగుళాల వయర్‌కు 33 అంగుళాల తర్వాత ఈ 32 ముక్కలు అతికితే ఈ కొసకు సుమారు 33 అంగుళాలు మిగులుతుంది. ఇప్పుడు పెద్ద వుండ వేసుకొని, దానితో చుట్టూ అల్లితే, మధ్య లైనుతో కలిసి 3 వరుసలవుతాయి. ఇలాగ మొత్తం 9 రౌండ్స్ అల్లితే 19 వరుసలుంటుంది బేస్‌కు. ఇప్పుడు రన్నింగ్ వయర్ కట్ చేయాలి. దీని అవసరం వుండదు.

రెండు వైపులా మధ్యలో వున్న 2 పువ్వుల లోని చెరో వయర్ కలిపి పువ్వులు అల్లాలి. ఈ పువ్వులకున్న రెండు వయర్స్‌ను రన్నింగ్ వయర్స్‌గా వుపయోగించి వీటికి ఎడమ, కుడిలలో వున్న వయర్లతో పువ్వులు అల్లాలి. ఇలాగ మధ్యలో 10 మార్లు పువ్వులువేస్తే బ్యాగ్ ఎత్తు సరిపోతుంది. ముందు, వెనకు ఇలా అల్లుకొంటే '4 పాయింట్స్' వస్తాయి. రెండు వైపులా కుడివైపు 8, ఎడమవైపు 7 పువ్వులొస్తాయి. కంగారు పడకండి! రన్నింగ్ వయర్‌లో ఈ హెచ్చుతగ్గులు తప్పవు.

ఇప్పుడు మీకు బాగా అర్థమయిందనుకుంటాను.

నగజ, గంగినేని

మీరు చెప్పేవి ఇంకా స్త వివరంగా, సులభంగా అర్థమయేలా చెప్పండి. గౌన్ల మీద కుట్టే బిస్కట్ కుట్టు, మొగ్గల కుట్టు కుట్టాము. బాగా వచ్చాయి. కచ్‌వర్క్, కట్‌వర్క్ గురించి వివరంగా తెలియజేస్తారా?

మీరు కోరిన విధంగా వివరంగా ఎక్కువ బొమ్మలతో చెబుతున్నాను. చెప్పిన కుట్టు వచ్చిందంటే నాకెంతో సంతోషంగా వుంటుంది. కచ్‌వర్క్ ఇదివరలో చెప్పాను. కట్‌వర్క్ గురించి చెబుతాను.

జాగ్రత్తగా చేసేవారికి కట్‌వర్క్‌కు అర్గండి బాగుంటుంది. మొదట టేబిల్ క్లాత్ మీద ప్రయత్నించి బాగా వస్తుందన్న నమ్మకముంటే చీరల




మీద చేయవచ్చు. చిన్న చిన్న పువ్వులు, లతలు అయితే చీర బార్డర్‌కు బాగుంటుంది. కట్‌వర్క్‌కు ముఖ్యంగా కావలసింది పదునైన చిన్న కత్తెర. కత్తెర బాగు లేకపోతే పోగులు రేగి అసహ్యంగా వుంటుంది.



ముందుగా కావలసిన డిజైన్ వేసుకొని వీటి చుట్టూ అంటే రేకుల చుట్టూ దగ్గర దగ్గరగా కాజా కుట్టు వేయాలి. వీటి ముడులు లో వైపున వుండాలి. ఎందుకంటే గుడ్డ ఇక్కడ కత్తిరిస్తాము కాబట్టి పోగులు పోకుండా నీట్‌గా వుంటుందన్న మాట. కుట్టడం అంతా అయిన తర్వాత రైట్ సైడ్‌లో జాగ్రత్తగా లో భాగం కత్తిరించాలి. ఏ మాత్రం పొరపాటు జరిగినా అంతా వృధాప్రయాస అయిపోతుంది. తర్వాత రాంగ్ సైడ్‌లో ఏవైనా కొసలు వుంటే నిదానంగా కత్తిరించాలి. ఈ కత్తిరించడంలోనే మన పనితనం తెలుస్తుంది. తొందర స్వభావం వున్నవారు మరీ జాగ్రత్త వహించాలి. ఫోటోలో రేకుల లోపల అంతా కత్తిరించబడింది.

కొన్ని డిజైన్లకు లోపల గీతలుంటాయి. అటువంటప్పుడు ముందు గీతలు కుట్టుకొని ఆ తర్వాత చుట్టూ కాజా కుట్టు వేయాలి. గీతలకుగాను ముందు 3, 4 మార్లు వేయాలి. తర్వాత గుడ్డకు తగలకుండా దానిమీద నిండుగా కాజా కుట్టు వేయాలి. జాకెట్ హుక్స్‌కు లూప్ కుట్టే విధంగా అన్నమాట. గుడ్డ కత్తిరించేటప్పుడు ఈ గీతలు కట్ అవకుండా చూసుకోవాలి.

శమంతకమణి, విశాఖపట్నం

గులాబిపూలతో. వేసే క్రోషియాబ్యాగ్ ఒకటి షాపులో చూశాము, చాలా బాగుంది. అది అల్లవలెనని వుంది. అల్లే పద్ధతి తెలియజేయవలెనని కోరుతున్నాను.

ట్విస్టెడ్ (twisted) వయర్‌తో పూలు బాగుంటాయి. ముఖ్యంగా తెల్ల వయర్‌తో వేస్తే అచ్చు తెల్ల గులాబిలాగా వుంటాయి. కావలసినన్ని పువ్వులు అల్లుకొని కావలసిన ఆకారంలో పెద్ద సూదితో (అంటే పూలుకుట్టే సూది) వయర్‌తోనే చేతితో కలిపి కుట్టుకొని ఆకుపచ్చ కాటన్ లైనింగ్‌కు వాడితే అవి అడుగున ఆకులనే భ్రమను కలిగిస్తాయి. 13వ నంబర్ ప్లాస్టిక్ క్రోషియా సూదితో అల్లండి. ఒక్కొక్క పువ్వుకు సుమారు 21 అడుగుల వయర్ కావాలి. నేను చెప్పే కొలతలప్రకారం అల్లితే ఫోటోలో వున్న సైజు పువ్వు వస్తుంది.

వేసే విధానం 8 జడలతో ఒక రింగు వేయాలి.

I. రింగు లోపల సూది మీద వయర్ లేకుండా ఒక స్తంభం, సూది మీద వయర్‌తో 3 స్తంభాలు, తిరిగి వయర్ లేకుండా ఒక స్తంభం వేయాలి. ఇలాగ 1 + 3 + 1 చొ॥న మూడుమార్లు వేస్తే 3 రేకులు వస్తాయి. రేకు వెనక సూది గుచ్చి వయర్ తీసి ఒక కుట్టు వేయాలి. అంటే రెండు రింగులగుండా వయర్ లాగాలి.

II. 4 జడలు వేసి మొదటి రేకు వెనకవైపున మూడొంతుల దూరంలో గుచ్చి, వయర్ తీసి కుట్టు వేయాలి. ఇలాగ 4 మార్లు ఉజ్జాయింపుగా దూరం చూసుకొంటూ వేస్తే రెండవవరుస రేకులకు లూపులు తయారవుతాయి. ఇప్పుడు దీని లోపలగుండా

వెయాలి. 1 పొట్టి స్తంభం (సూది మీద వయర్ లేకుండా) + 4 పొడుగు స్తంభాలు + 1 పొట్టి స్తంభం - ఇలా 4 లూపులగుంటా రేకులు నింపి కాస్త ప్రక్కగా సూది గుచ్చి వయర్ వేసి ఒక కుట్టు వేయాలి. అంటే రెండు రింగులగుండా ఒకే మారు వయర్ వేయాలన్నమాట.



III. మొదటి లాగానే 3 వ వరుసకు లూపులు వేసుకోవాలి. 4 జడలతోనే వేయాలి లూపు ఈ మారు 5 లూపులు కావాలి 5 రేకులకు దూరం ఉజ్జాయింపుగా వేసుకోవాలి. లూపులు నింపడానికి 1 చిన్న స్తంభం + 5 పెద్ద స్తంభాలు + 1 చిన్న స్తంభం చొ॥న వేయాలి. ఆఖరున వెనక వైపునే ప్రక్కన సూది గుచ్చి వయర్ రింగులగుండా తీసి కత్తిరించాలి. ఈ వయర్ ముక్క మొదలు పెట్టేటప్పుడు మిగిలిన వయర్‌ను ముడివేస్తేసరి.

రౌండ్‌బ్యాగ్ కావాలనుకొంటే మధ్యలో ఒక పువ్వు, చుట్టూ 6 పువ్వులు కలపాలి. తర్వాత తిరిగి చుట్టూ పువ్వులు అతకాలి. ఇంకా వెడల్పు కావాలనుకొంటే ఇంకొక వరుస అతకాలి. ఇలా రెండు చేసుకొని ఈ రెంటినీ రెండు వరసలు పువ్వులతో కలపాలి. హాండిల్‌కు కూడా ఈ పువ్వుల వరుసనే వాడితే చాలా గ్రాండ్‌గా వుంటుంది. తెలుపు పువ్వులయితే చాలా జాగ్రత్తగా వుండాలి, మురికి కాకుండుటకు. పువ్వు మధ్యలో గ్యాప్ అక్కర లేదనుకొంటే పసుపురంగు పూసగాని, తెలుపురంగు పూసగాని-గుండ్రటివి-వేసి కుడితే షప్పాడి లాగా అందంగా వుంటుంది. పువ్వులు విడివిడిగా కలవకుండా ప్రతి వరుసకూ రేకులు పెంచుకొంటె ఒకటే పెద్ద పువ్వు కూడా అల్లుకోవచ్చు.

జి. సరోజిని, బెల్లంపల్లి

డబుల్‌నాట్ వ్యానిటీబ్యాగ్ అల్లే విధానం ఎంత మందినో అడిగినా ఎవరూ చెప్పడం లేదు. దయచేసి మీరు తెలుపగలరు.

అలాగే చెబుతాను. ఇది అల్లటం చాలా సులభం. దీనిని పైన్‌ఆపిల్ (అనాసపండు) అల్లకం అని కూడా అంటారు. దీనికెప్పుడూ రెండు రంగుల్లో వయరు వుండేనే బాగుంటుంది. కావాలంటే ఇంకా ఎక్కువ రంగులు వాడవచ్చు. ముక్కలు అతికేటప్పుడు మాత్రం, బొమ్మలో చూపినట్టు వేయాలి.




అంటే 2 వ బొమ్మలో లాగా వయర్ ముడితే ఒక నాట్ అవుతుంది. 3 వ నంబర్ లాగా వేస్తే డబుల్‌నాట్ అవుతుంది. బేసుకుగాను వయర్ అతికేటప్పుడూ, ప్రతి లైను మొదటి ముడి కూడా ఇలానే వుంటుంది. ఆ తర్వాత డబుల్ నాట్స్ అంటే 3 వ బొమ్మలో లాంటి ముడి 2 మార్లు వేస్తాము. ఇది గుర్తుంచుకోండి. 3 వ బొమ్మలో లాగా పెట్టుకొన్న తర్వాత, నిలువుగా వున్న వయర్‌ను పైకి తీసి, వయర్ లాగితే ముడి వస్తుంది. వయర్‌ను ఎప్పుడూ రైట్‌సైడ్ పైకి వుండేలా వుంచుకోవాలి. ఇది కూడా గమనించాలి.

ఇక ఫోటోలలో వున్న బ్యాగ్స్ కొలతలు చెబుతాను.

పెద్ద బ్యాగ్ :

| | | |
|---|---|---|
| కావలసిన ముక్కలు | - | 42 |
| ముక్కపొడవు | - | 38 అంగుళాలు |
| బేస్‌కు కావలసిన ముక్కలు | - | 6 |



హాండిల్స్‌వరకూ అల్లినది 14 లైనులు. ఆ తర్వాత ఇటు 12 అటు 12 వయర్లు అల్లకుండా వదిలి, మిగిలినవి కలిపి అల్లితే ఆటోమాటిక్‌గా షేప్ వస్తుంది. తర్వాత 7 లైనులు అల్లితే పొడవు సరిపోతుంది. ఆఖరున 3 లైనులు వుండగానే పై వయర్‌ను మడచి దానిపైన అల్లితే, ఆఖరున వయర్లు దోపటంలో ఇబ్బంది వుండదు. పైగా అందంగా కూడా కనిపిస్తుంది. 1½ అంగుళానికి డబుల్‌నాట్ వస్తుంది. దీనికి తగినట్టుగా బేస్‌కు వయర తీసుకోవాలి. అంటే 38 అంగుళాలు ముక్క పొడవుకదా + 42 ముక్కలు అతకటానికిగాను 63 అంగుళాల వయర్ ఎక్కువగా తీసుకోవాలి. సుమారు 100 అంగుళాల వయర్ తీసుకొంటే బేస్‌కు సరిపోతుందన్నమాట.



చిన్న బ్యాగ్ :

| | | |
|---|---|---|
| కావలసిన ముక్కలు | - | 30 |
| ముక్క పొడవు | - | 20 అంగుళాలు |
| బేస్‌కు | - | 4 లైనులు |

బేస్‌కుగాను రన్నింగ్ వయర్స్ విడివిడిగా తీసుకోవాలన్నమాట హాండిల్స్‌కు మనకు కావలసిన పొడవుకు 1½ రెట్లు వయర్ తీసుకొంటే సరిపోతుంది. బేస్ అల్లిన తర్వాత రన్నింగ్ వయర్ పెద్ద వుండ తీసుకోవాలి. ఈ అల్లికతో ఫ్లవర్‌వాజ్ కూడా చేశారు చాలామంది. అది ఇంకోమారు చెబుతాను. □




రాత్రి తొమ్మిదిన్నర దాటింది. ఆ వీధిలో జన సంచారం తగ్గింది. కాని ఊరు మాటుమణిగిపోయాక నిద్రలేచే పట్టాభి భవనం ఆ రోజు 'ఛిశ్శబ్దంగా వుంది. అదొక పురాతనమైన పెద్ద యిల్లు. అందులో రక రకాల వాళ్ళు సుమారు పదమూడు కాపురాలు వరకు వున్నాయి. అంతా పనులనించి యింటికివచ్చి రాత్రి తొమ్మిది దాటాక బాతాఖానీ మొదలుపెట్టి చుట్టుపక్కల వాళ్ళ నిద్రని ఖూనీ చేస్తూంటారు. కాని – ఆ రోజు ఆ యింట్లో అన్ని గదుల్లోను దీపాలు వెలుగుతున్నా అందరి మగాళ్ళూ గూటికి చేరుకున్నా ఇంకా నిశ్శబ్దంగా వుండటం ఆశ్చర్యమే!

అమావాస్య వెళ్ళిన మర్నాటి సినీవాలీ అందంగా కత్తిరించిన వెండితీగెలా ఆకాశంలో మెరుస్తున్నాడు.

ఒక్కొక్కరూ ముందున్న పంచలో చేరి, తలో చోట వుస్సురంటూ కూర్చుంటున్నారు. అందరి మనసుల్లోనూ ఒకటే సమస్య, ఒకటే బాధ — తర్కానికి, చర్చకి ఎవరు ముందు మొదలు పెట్టాలో తెలీని ఒక అయోమయ పరిస్థితి అది.

"నేనిలా జరుగుతుందని ఓ నెల్లాళ్ళ క్రితమే వూహించాను" అంది పార్వతమ్మ — వేడి వేడి నీళ్లు తెచ్చి భర్త కోసం ఓ పక్కగా పెట్టి.

"అబ్బే నేనసలు అనుకోలేదు. అనుకుంటే ముందే జాగ్రత్తపడి వుండేవాళ్లం" అంది కనకం నిస్పాటంగా.

ఒక్కొక్కరూ ఆడా మగా బయిటకి చేరి చర్చ మొదలు పెట్టారు.

ఈ మహాపట్టణంలో ఒక్కసారిగా యిల్లు ఖాళీ చేసి పొమ్మంటే ఎక్కడికి పోతాం? అనేదే అందరి సమస్యా—అదే అందరి మనసుల్నీ కలచివేసే బాధ.

"మేము పోము" అనే హక్కు వాళ్ళకి లేదు. వాళ్లుంటున్న ఆ పెద్ద కొంప వాళ్ళల్లో ఎవ్వరిదీ కాదు. అందరూ అద్దె కట్టి అవసరాన్ని గడుపుకుంటున్న అతిథులే.

పట్టాభి భవనం అంటే ఆ చుట్టు పక్కల పెద్ద పేరు. ప్రతి రిక్షవాడికీ తెలుసు. ఏ కిళ్ళీ బడ్డీలో అడిగినా అతి సునాయసంగా యిల్లు చేరచ్చు. అదొక మార్వాడి వర్తకుడి యిల్లు. అందులో ఎన్నో గదులు – వసారాలు, స్నానాల గదులు, మరుగు దొడ్లూ - ఇంటికి రెండువైపులా పెద్ద బావులు - పెద్ద పెట్టున వున్నాయి. ఆ యింట్లోకి ప్రవేశించటానికి ఎవరైనా ముందు కాస్త కంగారు పడతారు. ఎటు వెడితే ఏ గదిలోకి వెళ్తామో, ఎటు మెట్లు ఎక్కితే ఏ వసారా చేరుకుంటామోనని అనుమానం వస్తుంది. ఆ మార్వాడి ఎప్పుడూ ఆ ఇంటిని గురించి పెద్దగా పట్టించుకోలేదు. ఎప్పుడో అద్దెలకి యిచ్చేసి వూరుకున్నాడు. అతని దగ్గర వుండే ఓ గుమాస్తా మాత్రం ప్రతినెలా వచ్చి అద్దె వసూలు చేసుకుపోతూ వుంటాడు. అతను కచ్చితంగావున్నా కరకుమనిషి కాకపోవడంవల్ల ఓనరుకి అద్దెలు పెంచమని దుర్బోధ చెయ్యలేదు. దీనిమీద పెద్దగా దృష్టిలేని ఆ మహానుభావుడు అద్దెలు పెంచనూ లేదు. అందుకే అట్టడుగు తరగతి, మధ్య తరగతికీ మధ్యన వేలాడుతూ రెక్కాడితేగాని డొక్కాడని కొన్ని కుటుంబాలు అక్కడ చవుక అద్దెలో తలదాచుకుంటున్నాయి.

ఆ రోజు వుదయమే ఆ గుమాస్తా వచ్చి మార్వాడి యిల్లు ఎవరికో అమ్మేశాడనీ, అందుకు ఓ నెల్లాళ్ళలో అంతా యిల్లు ఖాళీ చెయ్యాలనీ చెప్పి వెళ్ళిపోయాడు. మర్రిచెట్టు నాశ్రయించుకున్న పిట్టల పాలిట అది తుపాకీ దెబ్బే అయింది.

అంతవరకు దెబ్బలాటలతో, వ్యంగ్యాలతో, ఆరోపణలతో రాత్రిళ్లు తగువులాడుకునే ఆ ఇంట్లో

వారందరికీ నోట మాట పడిపోయింది. అసలు ఒక్కొక్క సందర్భంలో అది ఎవరికివారే తమ యిల్లుగా భావించుకోవడం జరిగేది. ప్రతివాడూ ఎదుటివాడిని "నీ బాబుగాడి సొమ్మా" అంటూ దబాయించటం పరిపాటిగా జరుగుతూ వుండేది. కాని యీరోజు అందరికీ ఆ యిల్లు తమెవ్వరిదీ కాదని, తామక్కడినుంచి వెళ్ళిపోవాల్సిన సమయం ఆసన్నమైందనే చేదునిజం వాళ్ళ గొంతుకల్లో పచ్చి వెలక్కాయలా అడ్డుపడింది.

శేషమ్మ గదిలో దీపం డిమ్‌గా వెలుగుతోంది. అది పదిహేను కేండిల్ బల్బు. రోజంతా కష్టపడినా కడుపునింపుకోలేని పేదవాడిలా అది శక్తినంతా ధారపోసినా అంతకంటే ఎక్కువ కాంతిని యివ్వ లేకపోతోంది.

శేషమ్మ మెల్లిగా లేచింది. ఒళ్ళు తూలింది. కళ్ళు తిరిగాయి. నీరసంగా గోడ పట్టుకుని ఒక్క క్షణం నిలబడింది, గాలివానకి విరిగిపోయిన కొమ్మ చెట్టుని విడిచిపెట్టకుండా కొన వూపిరితో వేలాడు తున్నట్టుంది శేషమ్మ. చావురాదు — బ్రతుకురాదు— ఎన్నాళ్ళగానో ఆ యింట్లో ఆ చివరి గదిలో వంటరిగా, రోగిష్టిగా, లేచిన రోజున లేచి, లేని రోజున మూలుగుతూ, కాలం గడుపుతోంది, అయిదు ఆరు తారీఖుల్లో వచ్చే అరవైరూపాయల మనియార్డరు కోసం, కాంతి మళ్ళిన గాజుకళ్ళతో ఎదురుచూస్తూ అందులో పదిహేను రూపాయలు ఆ గదికి అద్దె కట్టి, మిగిలిన దానితో రోజా గంజి కాచుకొంటుంది. మరీ లేవలేకపోతే ఓ పావలా డబ్బులిచ్చి పక్కనే వున్న గవర్నమెంటు హాస్పటల్లో రిక్షాలో దిగుతుంది. శేషమ్మకి ఏం రోగమో ఏ డాక్టరుకీ అక్కడ తెలీదు. అందుకని ఏదో తోచిన మందులిస్తారు. ఖచ్చితంగా ఆమె రోగాన్ని గురించీ, ఆరోగ్యాన్ని గురించి ఆరా తీసే మనుష్యులు ఆమె వెనుక లేకపోవడంతో, అక్కడెవ్వరూ పెద్దగా పట్టించుకోరు. కొన్నాళ్ళున్నాక అదే సర్దుకుంటుంది. శేషమ్మ యింటికొస్తుంది, మళ్ళీ నాలుగు రోజులు బాగానే వుండి, మొదటి కొస్తుంది.

కన్న కొడుకు వస్తాడని, తనని చూస్తాడని, తనతో తీసుకుపోతాడనీ శేషమ్మ వెర్రి ఆశ. కాని ప్రతి నెలా డబ్బే వస్తుంది. కొడుకు రాడు.

కొడుకు పసివాడుగా వుండగానే మొగుడు చచ్చిపోయాడు. అష్టకష్టాలుపడి పిల్లాడిని పెంచింది. రామయ్యా తండ్రీ అంటూ కలవరిస్తూ చూసుకుంది. మిడిమిడి జ్ఞానం వచ్చేసరికి వాడికి తల్లిమీద అనుమానం మొదలైంది. వాళ్ళూ వీళ్ళూ 'నీ తల్లి మంచిది కాదు' అనడంతో వాడి మనసు విరిగింది. తల్లి శీలాన్ని శంకించటంతో వాడి ఆలోచనలు వక్రమార్గం పట్టాయి. ఇది తెలిసి శేషమ్మ కుమిలి పోయింది. వాడికో రోజు తన నిజాయితీ చెప్పుకో బోయింది. వాడు నమ్మలేదు. కొడుకైనా, మొగుడైనా, తండ్రైనా—వాడు మగాడు. ఆడదాన్ని అవమానించి, అనుమానించే హక్కు వాడికి పుట్టుకతో వున్నట్లు ఒక చీత్కారం చేశాడు. శేషమ్మ మనసు పుటుక్కుమంది. కట్ట తెంచుకున్న నదిలా దుఃఖం పొంగింది. ఆ రోజు మొగుడు చచ్చిపోయిన రోజున కూడా ఏడ్వనంతగా ఏడ్చింది. కొడుక్కి చదువురాలేదు. చదివించే శక్తి తనకి ఎలాగూ లేదు. వాడు అక్కడక్కడ తిరుగుతూ గడిపి ఓనాడు పూచ విడిచి వెళ్ళి పోయాడు. వెళ్ళిన రెండు నెలలకి వుత్తరం ఒకటి రాశాడు. తనని కన్నందుకు నెలకింత డబ్బు పంపుతాననీ, 'నిన్ను తల్చుకుంటే నాకు ఆడజాతిమీదే అసహ్యం వేస్తోంద'నీ రాశాడు. కొడుకు తనమీద ఏర్పరచుకున్న అకారణమైన అసహ్యానికి శేషమ్మ కుసిళ్ళిపోయింది. ఆమె మనసు దిగులుతో ఎండి పోయింది. శరీరం రోగంతో మోడులా ఐపోయింది. శేషమ్మ నడుస్తుంటే వెదురుబద్ద కదులుతున్నట్లు, దాన్ని వేదన వెంబడిస్తున్నట్లు వుంటుంది. తోడు లేని శేషమ్మకి ఆ పెద్ద కొంపలో ఆ మారుమూల గది నీడనిచ్చింది.

రోగిష్టి శేషమ్మ ఎక్కడికి కదలగలదు? మరొక ఇల్లు ఎక్కడ వెతుక్కోగలదు? ఆమెకెవరున్నారు? ఈ రోగంతో తీసుకునే శేషమ్మకి ఎవరిల్లు ఇస్తారు? ఒకవేళ ఎక్కడైనా యిల్లు దొరికినా ఆమె అద్దె ఎంతివ్వగలదు? ఆమె యిచ్చే అద్దెకి పూరికొంప కూడా రాదే! ఇదొక జటిల సమస్యగా మారి శేషమ్మ కొన వూపిరిని లాగేస్తోంది. అనాథగా మిగిలిపోయిన ఆ స్త్రీ మీద దేవుడికెందుకు దయ రాదా అని చూసినవారంతా బాధపడతారు.



1. 'అంతర్జాతీయ అవగాహన' కోసం కృషి చేసిన వారికి మన దేశంలో నెహ్రూ మెమొరియల్ అవార్డు ప్రతి సంవత్సరం యిస్తారు. అయితే ఆ అవార్డు పొందిన అమెరికా దేశస్థుడు ఎవరు?
2. క్రీస్తుశకం 425 నుంచి 1205 దాకా నేటి బీహారులో విరాజిల్లిన బౌద్ధ విశ్వ విద్యాలయం పేరు చెప్పగలరా?
3. ఆఫ్ఘనిస్తాన్, అల్జీరియా, అర్జంటైనా, కెనడా, క్యూబా, డెన్‌మార్క్ దేశాల రాజధాని నగరాలు ఏవి?
4. మన దేశంలో ప్రతి ఏడు 'అర్జున అవార్డు' అని ప్రభుత్వం యిస్తుంది. అయితే ఆ అవార్డు ఏ సంవత్సరం నుంచి యివ్వబడుతున్నది?
5. అత్యధిక ఉష్ణోగ్రత గల గ్రహం ఏదో చెప్పగలరా?
6. హీరాకుడ్‌డామ్ ఏ రాష్ట్రంలో వుంది?
7. ఈ రోజుల్లో ప్రతి యింట్లోనూ వాడకంలో వున్నవి స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రలు. అయితే ఈ స్టెయిన్‌లెస్ స్టీల్ ఏ ఏ లోహాల మిశ్రమంతో తయారు చేయబడిందో చెప్పగలరా?
8. ప్రపంచంలో ఒక దేశానికి 'ప్రధాని' పదవిని నిర్వహించిన తొలి వనిత ఎవరు? ఇంతవరకు ఎంతమంది అటువంటి పదవులు నిర్వహించారు?
9. భారత దేశంలో విద్యుత్ పరికరాలు చేసే అతి పెద్దదైన హెవీ ఎలక్ట్రికల్స్ ప్లాంట్ ఎక్కడ వుంది?
10. అబుల్‌ఫజల్ ఎవరు?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

శేషమ్మకి కళ్లు తిరుగుతున్నాయో, లేక భూకంపం వచ్చి యిల్లే తిరిగిపోతోందో తెలీలేదు. కళ్ళు గట్టిగా మూసుకుంది. ఒళ్లంతా గడగడ వొణికి నెమ్మదిగా గోడని పట్టుకున్న చేతులు జారాయి. ఆమె అక్కడే చతికిలబడింది.

అటుగా వచ్చిన పార్వతమ్మ -

"శేషమ్మా, అదేవిఁటలా కూలబడ్డావ్? బాగుంది. వంట్లో బొత్తిగా శక్తి లేకుండా పోయిందమ్మ నీకు. ఒక్కత్తివి ఇన్నాళ్లున్నావు. ఇప్పటికైనా ఆ కొడిక్కి యింత గడ్డి పెడుతూ రాయి, వచ్చి తీసుకెళ్లమని" అంటూ రెండు చేతులతో శేషమ్మని లేవనెత్తింది.

శేషమ్మ ఆయాసంతో వొగరుస్తూ - నెమ్మదిగా మంచం మీదకి చేరింది. శేషమ్మ అనారోగ్యం పెద్దగా పట్టించుకోకుండా అతి సహజంగా అక్కడి నుంచి బయటపడింది పార్వతమ్మ. నాలుగే బొగ్గులు మిగిలిన కుంపటి మీద గ్లాసు మట్టులోకి వున్న కాఫీ పెట్టి, ఆలోచనలో పడింది.

వసారాలోంచి మాటలు వినిపిస్తున్నాయి. తన లాంటి జీవితాలు ఎప్పుడు సుఖపడను? శేషమ్మ లాంటివాళ్ళు ఎప్పుడు కడతేరను? అని పార్వతమ్మ మధనపడింది.

ఈ యింట్లోంచి మారిపోవాలంటే ఎక్కడలేని బెంగా, భయం మనసుని చుట్టేస్తున్నాయి. మొగుడు తెచ్చే నూటయాభై రూపాయిలతోనే యిల్లు గడుస్తుందా? తనెన్ని విధాల రెక్కలు ముక్కలు చేసుకుంటే ఈ మాత్రంగా నడుస్తోందీ బండి. ఎదురింట్లో తను వంటపని చేస్తోంది. అది ఎదురిల్లు కనుక అటోపని యిటోపని సరిపెట్టుకుంటోంది. వాళ్ళింట్లో ఏమైనా మిగిలినా, యిచ్చినా తెచ్చుకోడానికి నామోషీగా వుండటం లేదు. వాళ్ళొక నలభై రూపాయలిస్తారు. తనింట్లో పని చూసుకుంటూ ఆ పని చెయ్యాలంటే తాము మరొక చోట కెళ్ళిపోతే ఎలా కుదురుతుంది? అంటే తనకా అవకాశం పోయినట్లే. పోనీ అక్కడే చూసుకుందామంటే తనేమీ వంటగత్తె కాదు. ఏదో కాలం కలిసి రాక పడేపాట్లు, తనకొచ్చే నలభై రూపాయలతో పాలూ, బొగ్గులూ గడిపేస్తోంది. ఇప్పుడది ఆగిపోవడమే కాకుండా అద్దె పెరుగుతుంది. ఇంత విశాలమైన గది ఇరవై రూపాయిలకి ఎక్కడా దొరకదు.

వెచ్చబడిన కాఫీచుక్క తీసుకెళ్ళి శేషమ్మ కిచ్చి వచ్చింది పార్వతమ్మ. అనాధులకి, దరిద్రులకి, నిత్య బాధితులకే దేవుడు చావైనా యివ్వడు అని మరొక్కసారి బాధపడింది. ఆడదాని బ్రతుకులో అడుగడుగునా గండాలే, అవి గడిస్తే అందలం- లేకపోతే అధః పాతాళం.

ఈ పార్వతమ్మ పార్వతిగా ఊహ తెలిసినప్పటి నుంచి సుఖం అంటే ఏమిటో ఎరగదు. తన పన్నెండో ఏట తల్లి చచ్చిపోతే, తన కింద నలుగురు పిల్లల్నీ పెంచి పెద్ద చేస్తూ నిత్యం వొళ్ళెరుగని పని చేసేది. అప్పటికీ అది బాగోలేదు- యిది బాగోలేదు అని తండ్రిచేత చీవాట్లు తినేది. పెళ్ళి చేసే శక్తిలేక, చెయ్యాలనే ధ్యాసలేక సంసార భారం తన మీద పడితే చదువూ

జొన్నలగడ్డ అనూరాధ

ఏ కళలోనైనా చిన్నతనంలోనే పేరు తెచ్చుకోవడమన్నది అరుదైన విషయం. అయితే నాట్యంలో అటువంటి అరుదైన ఘనతని పొందినవారు అడపా దడపా మనకి కనిపిస్తునే వుంటారు. కాని ఒక్కరే ఏక సమయంలో పలు పాత్రలు పోషించి అందరి మన్ననలు పొందడమన్నది చెప్పుకోదగ్గ విశేషం. అటువంటి క్లిష్టమైన కార్యాన్ని సమర్ధవంతంగా సాధించిన బాలిక—జొన్నలగడ్డ అనూరాధ.

'భావయామి రఘురామం' నాట్య ప్రదర్శనలో అనూరాధ--దశరధుడు పుత్రకామేష్టి యాగం చేయడం దగ్గర్నుంచి 'సీతారామ పట్టాభిషేకం' వరకు ముప్పైఐదు పాత్రలను తను ఒక్కతే అభినయించి ప్రఖ్యాతి చెందిన నాట్యచార్యులెందరి మన్ననలో అందుకున్నది. కూచిపూడి నాట్యాచార్యులు శ్రీ చింతా రాధాకృష్ణమూర్తి వద్ద ఆమె నాట్యం నేర్చుకుంటోంది.

పదేండ్ల చిరుప్రాయంలోనే ఇంతటి పేరు తెచ్చుకున్న అనూరాధ ఇంతవరకు ఏభై ప్రదర్శనలకు పైగా ఇచ్చింది. మూడు గంటలసేపు అలసట లేకుండా రంగస్థలంపై ఏకధాటిగా నృత్యం చెయ్యగలదు ఈ బాలిక.

హైద్రాబాదులో నిర్వహించబడిన పన్నెండవ అఖిల భారత సంగీత నృత్య పోటీలలో సబ్ జూనియర్స్ విభాగంలో పాల్గొని కూచిపూడి నాట్యంలో ప్రథమ బహుమతిని, 1977 లో బాలల అకాడెమీ నిర్వహించిన భరత నాట్యం పోటీలలో రాష్ట్రస్థాయిలో ప్రథమ బహుమతిని, రాజమండ్రి కళాజ్యోతివారి పోటీలలో జూనియర్స్ విభాగంలో కూచిపూడి నాట్యంలో ప్రథమ బహుమతినీ, శ్రీ నారీ కేదారేశ్వరుడు ప్రత్యేక బంగారు పతకాన్నీ అనూరాధ పొందింది.

'భామా కలాపం', 'కృష్ణ శబ్దం' అభినయించడంలో నేర్పరి ఐన అనూరాధ నృత్యాలను కొన్నింటిని హైద్రాబాదు దూరదర్శినివారు ప్రదర్శించారు.



**కాకినాడ సెంట్ జోసెఫ్ కాన్వెంట్‌లో ఆరవ తరగతి చదువుతున్న అనూరాధ అఖిల భారత స్థాయిలో పేరు గడించాలని ఆశిస్తున్నది.**

—నాగలక్ష్మి



జి. శైలజ

**రాయలసీమలోని ప్రధాన నగరాలలోనూ, కర్ణాటకలోని పావుగడ, బెంగళూరు నగరాలలోనూ, నాగపూర్‌లోనూ యిటీవల నృత్య ప్రదర్శనలిచ్చి పలువురి మన్ననలు పొందింది చిరంజీవి జి. శైలజ.**

**అనంతపురంలోని కృష్ణకళామందిర్ నృత్య పాఠశాలలో శ్రీ ఎమ్. అప్పారావు వద్ద శాస్త్రీయ నృత్యాన్ని అభ్యసిస్తున్న శైలజ 'బాలగోపాల తరంగము', 'జతిస్వరము'ల ప్రదర్శనలో ఎందరి ప్రశంసలో అందుకున్నది. గత సంవత్సరం కృష్ణ కళామందిర్‌లో జరిగిన నాట్య పోటీలలో శైలజ ప్రథమ బహుమతి పొందింది.** □

సంధ్యాలేని పార్వతి అక్కడా యిక్కడా కష్టపడి యిల్లు నెట్టుకొచ్చేది. అలాంటి సమయంలో నారాయణతో పరిచయమై అది పెళ్ళిదాకా వచ్చింది. ఆ పెళ్ళికి తండ్రి వొప్పుకోలేదు. వొప్పుకోకపోవటానికి కారణం ఏమీలేదు. అది పార్వతి స్వంతంగా నిర్ణయించుకోవడం. అదొక్కటే ఆయనకిష్టం లేకపోవటానికి కారణం. కాని పార్వతి అందుకు తల వంచలేదు. తను నమ్ముకున్న నారాయణతో వచ్చేసింది. అయితే పార్వతిని కూర్చోబెట్టి హాయిగా పోషించగల శక్తి అతనికి లేకపోవడంతో పెళ్ళి అయిన నాటినుంచి పార్వతి ఆమె కష్టం ఆమెకి వుండనేవుంది. ఈ దేశంలో చదువుకున్నా, చదువుకోకపోయినా, చేతనైనా కాకపోయినా మగాడి మీద భారాన్ని తోసేసి హాయిగా ఉండే స్త్రీలు తక్కువేమో. ప్రతికష్టంలోనూ ఎక్కువపాలు తనే పంచుకుంది పార్వతి. నలభై అయిదేళ్లు దాటినా యీనాటికీ యిద్దరి పిల్లలకోసం, భర్తకోసం కష్టపడి పని చేస్తూనే వుంటుంది. అలాంటి పార్వతి యీ రోజు యీ యిల్లు మారిపోవాలంటే వచ్చే యిబ్బందుల్ని మరచిపోయి ఎలా వుండగలదు? అందుకే నిద్రరాక గుమ్మం మీద కూర్చుని బయట మాటలు వింటోంది.

కనకం విలాసంగా వేరుశనక్కాయిలు కొట్టుకుని తింటోంది. ఆమె మనసులో దిగులుగా వున్నా పైకి మాత్రం నిర్లక్ష్యంగానే కనిపిస్తోంది. రోగిష్టి మొగుడు దొరికినందుకు మొదట్లో ఏడ్చినా లంకంత కొంపలో ఎవ్వరెవ్వరో వచ్చిపోయే ఆ పెద్ద లోగిలిలో తన వ్యవహారం ఎవ్వరూ పట్టించుకోకపోవడం ఆనందంగానే అనిపించింది. తనకి మాత్రం ఎవరితో ఏముంది? ఒక నరసింహంతో తప్ప. అతని గది తమ గదికి పక్కనే. ఎప్పుడూ యిద్దరూ ఎంతో జాగ్రత్తగా వుంటారు. తీరని తన కోర్కెలు తీర్చుకోవడమేకాకుండా భర్తకి మందులు, బలానికి హార్లిక్సులు తెప్పించి గుట్టుగా కాపురం నెట్టుకొస్తోంది. అలాంటిది యీ రోజు యిక్కడి నుంచి కదిలితే నరసింహం ఏమైపోతాడు? అతను కనబడకపోతే తనేమైపోతుంది? ఇంత అనువుగా, యింత గుట్టుగా తనెలా వుండగలదు? తనీమాత్రం సుఖంగా వుందని దేవుడు కళ్ళల్లో నిప్పులోసుకుంటున్నాడు అని కనకం దేవుడి మీద మెటికలు విరుస్తున్నట్లు శనక్కాయిలు టపీటపీమని కొడుతోంది. ఆమె ఆలోచిస్తూనే వుంది. ఏలాగైనా నరసింహం తామూ ఒకే యింట్లో వుండేటట్లు ఏర్పాటు చేసుకోవాలి. ఈ విషయం మొగుడితో నెమ్మదిగా, అతనికి అనుమానం రాకుండా చెప్పి వొప్పించాలి. అతను కనుక వొప్పుకుంటే మిగిలిన వాళ్ళేమనుకున్నా తను లెక్కచెయ్యదు. కాని అతను వొప్పుకుంటాడా? ఆరోగ్యం లేకపోయినా అతని అహంకారానికి లోటులేదు. కాని తను మాత్రం అలా యిలా వదలదు. ఎలాగైనా ఈ సమయంలో తన నోరు మూతపడితే తన సుఖానికే శాశం పడుతుంది.

కనకం ఆలోచిస్తూనే వుంది. పథకాలు వేస్తూనే వుంది.

శేషమ్మ అవస్థపడుతూ, యిల్లెక్కడ వెతుక్కోనా అని ఆయాసపడుతూనే వుంది.

పార్వతమ్మ చెదరిపోతున్న ఆర్థిక పథకాన్ని ఎలా నిలుపుకోవాలా అని ఆరాటపడుతూనే వుంది.

వసారాలో ఆవలింతల మధ్య చర్చ జరుగుతూనే వుంది.

రాత్రి మాత్రం ముందుకు కదులుతూనే వుంది. ఆ రాత్రేకాదు, ప్రతీ రాత్రి అలాగే గడుస్తోంది. ఒక్కొక్కరూ ఎక్కడో ఒక చోట యిల్లు కుదిరిందని ఆ యింట్లోంచి కదులుతూనే వున్నారు. ఇల్లు బావురుమంటూనే వుంది. బకాసురుడి బలికి ధైర్యంగా వెళుతున్నట్లు ఒక్కొక్క కుటుంబం, బళ్ళ మీద సామాను వేసుకుని ముందుకు కదులుతోంది. మిగిలినవాళ్ళు వెళ్ళేవాళ్ళకి వీడ్కోలు చెపుతున్నారు.

శేషమ్మ రాసిన రెండు వుత్తరాలకి కొడుకు దగ్గర్నుంచి జవాబు రాలేదు. కదలలేక మెదలలేక కట్టెముక్కలా పడుంది మంచంలో. జాలిపడి పార్వతమ్మ మొగుడితో అంది.

"పాపం శేషమ్మ. మనతోబాటే ఏదైనా ఒక గది........"

"చాల్లే వూరుకో. తనకొకటి దిక్కులేదు మెడకో డోలు అన్నట్లు, ఆ రోగిష్టి మేళంతో చచ్చిపోతాం" కసిరాడు. పార్వతమ్మ మాట్లాడలేదు. దయాదాక్షిణ్యాలకి స్తోమతకావాలి. అది లేవని తెలిసి వాటిని మనసు అట్టడుగున సమాధి చేసేసింది. కాళ్ళరిగిపోయేలా యింటికోసం మొగుడు తిరుగుతుంటే మరింకేమీ అనలేక వూరుకుంది. పక్కనే వున్న కోమటికొట్లో బాకీ తీరలేదు. దూరంగా వెళ్ళాలంటే అతను పీకల మీద కూర్చుంటాడు. అమ్ముకుందామన్నా అరకాసు బంగారం లేదు. అడుక్కుతినే బ్రతుకు కాదు. పరిష్కారమయ్యే సమస్యలూ కావు అని వుస్సురంది పార్వతమ్మ మనసు.

*

రోజులు గడుస్తున్నాయి. గడువురోజు ముందుకురుకుతోంది. రెండుసార్లు గుమాస్తావచ్చి గుర్తు చేసి వెళ్ళాడు. ఇల్లు కొనుక్కున్న సాయిబు యిల్లు చూసి పగలకొట్టించి పెద్ద హోటల్ నిర్మించబోతున్నట్లు చెప్పి వెళ్ళాడు.

ఆరోగ్యం పూర్తిగా చెడిపోయిన శేషమ్మ గుండెల్లో గుబులు మరీ ఎక్కువైంది. తను ఒక్క అడుగు కదల్లేదు. గడువు ఒక్కరోజు వుంది. తను కదలనంటే సామాను బయట పడేస్తారు. తన అనారోగ్యం కూడా నటనేనంటారు.

తనెంత అవమానాన్ని ఎదుర్కోవాలో వూహించి కలగిపోయింది. కొడుకు ఒక్కసారి వస్తే, వాడిని ఒక్కసారి చూసి కళ్ళు మూసేద్దామని వుంది. కాని వాడు రాలేదు. శేషమ్మకి ఆయాసం ఎక్కువైంది. ఆవేదన ఎక్కువైంది. ఈ బాధ నుండి విముక్తి ప్రసాదించమని దేవుడికి మొక్కుకుంటోంది. చావురాక, బ్రతకలేక నలిగే స్త్రీ జాతికి ప్రతీకగా గిజగిజ కొట్టుకుంటోందామె బ్రతుకు.

ఆర్థికంగా చితికిపోయి, అల్లాడిపోతోంది పార్వతి, ఇల్లు ఎక్కడా కుదరలేదు.

కనకాన్ని రోగిష్టి మొగుడు చితగ్గొడుతున్నాడు. కనకం అంతకంటే పెద్దగా అరుస్తోంది.

"సంసారం చెయ్యడానికి లేని బలం చావబాదటానికి వచ్చిందేం నీకు" అంటూ మొగుడి మీద విరుచుకు పడుతోంది. ఆ మొగుడు కూడా ఆమె దొరికినంత మేరకి పిడి గుద్దులు గుద్దుతున్నాడు. నోటి కొచ్చినట్లు తిడుతున్నాడు. అంతా ఖాళీ చేసిన ఆ ఇంట్లో వాళ్ళ అరుపులు ప్రతిధ్వనిస్తున్నాయి.

ఆ ఉదయమే నరసింహం చెప్పా పెట్టాకుండా గది ఖాళీ చేసి వెళ్ళిపోయాడు. ఆ వుక్రోషం పట్టలేక కనకం అందర్నీ తిట్టి పోస్తోంది. రాత్రి దాకా గొడవ జరుగుతూనే వుంది. రోగిష్టి మొగుడు పెళ్ళాన్ని తీసుకుని బావమరిది దగ్గరకి బయలుదేరాడు. పాడు ముండని వదిలి పారేస్తానని శపథం చేసి, క్షణాల మీద సామాను సర్ది బండిలో వేశాడు. వెక్కిళ్ళ మధ్య సణుగుతూ కనకం బండి ఎక్కింది.

పక్క వీధిలో ఒక పాకలో గదిని మాట్లాడి వస్తే పార్వతమ్మ సామాను కట్టలు కట్టింది. కను చీకటి పడేవేళ కరంటు లేని పాకలోకి గాలికి గలగలలాడే తాటాకుల భయంకర శబ్దాల్లోకి - సర్దుకు పోవడమే జీవిత ధ్యేయంగా ఎరిగిన పార్వతమ్మ కదిలింది.

ఆ రోజు తెల్లవారింది.

పనివాళ్ళు యిల్లు పగలగొట్టడానికి వచ్చారు.

నిర్జీవంగా పడివున్న శేషమ్మని చూసి గతుక్కుమన్నారు. ఓనరుతో చెప్పి దిక్కులేని శేషమ్మకి అంతిమ యాత్ర ఏర్పాటు చేశారు.

దీనులు, హీనులు, దిక్కు మొక్కు లేని ఎందరో స్త్రీల జాబితాలోంచి ఒక ప్రాణి నిష్క్రమించింది.

గూడు లేదని తెలిసి పక్షి గుట్టుగా ఎగిరి పోయింది. □



# వంటలు

మనకు బెంగుళూరు మిరపకాయలని, బుంగ మిరపకాయలనీ దొరుకుతాయి. వాటినే పూనా-బొంబేలలో "బడి మిర్చి" అంటారు. వీటితో చాలా రకాలు చేసుకోవచ్చు. మన భోజనంలో పచ్చడికి ప్రాముఖ్యం వుంది కాబట్టి పచ్చడి ఎలా చెయ్యాలో చూడండి మరి:

నిలవ పచ్చడి

రెండు మిరపకాయల్ని కడిగి పై తొడిమ తీసి లోపలి గింజలతో ముక్కలు కోసి నూనెలో దోరగా వేయించుకోవాలి.

చిన్న నిమ్మకాయ సైజంత చింతపండు నానబెట్టి ఒక కప్పు రసం పిండి ఓ గిన్నెలో ఉడకబెట్టాలి. దానిలో ఉప్పు, సరిపడేటంత, కారం 2 టీ స్పూన్లు, మెంతిపిండి 2 టీ స్పూన్లు, ఇంగువ కావలసినంత వేసి బాగా తిప్పి వేయించిన మిరప ముక్కల్ని వేసి గుజ్జుగా అయ్యేవరకు సన్నని సెగ మీద ఉడికించి ఆరిన తరువాత సీసాలో పెట్టుకోవాలి. రెఫ్రిజిరేటర్‌లో 2, 3 నెలలు నిలువ ఉంటుంది. దీని రుచి ఊరగాయలాగా ఉంటుంది.



వేపుడు లేక కూర

మసాలా : ఒక గుప్పెడు పచ్చి వేరుశనగ పప్పుని నూనె లేకుండా దోరగా వేయించి పొట్టు తీసి ఉంచుకోవాలి. దానిలోనే 2 ఎండు మిరప కాయల్ని కూడా వేసి వేయించాలి. ఇప్పుడు ఈ రెంటిని కచ్చాపచ్చాగా నూరి ఆఖరిలో 2 వెల్లుల్లి తొనలు వేసి నూరి తీసుకోవాలి.

మూకుడులో నూనె వేసి ఆవాలు, జీలకర్ర చిటపట లాడేక ఒక ఉల్లిపాయ కోసిన ముక్కలు వేసి 3 నిమిషాల తరువాత 4 మిరపకాయల్ని కోసి ఆ ముక్కలు వేసి ఉప్పు, పసుపు జల్లి తిప్పాలి. అవి ఉడికిన తర్వాత, పై పొడి వేసి 3 నిమిషాలు ఉంచి దించాలి. మూత పెట్టకుండా వండితే పొడిపొడిగా చక్కగా వస్తుంది.

మరికొన్ని...:

మూకుడులో నూనె వేసి ఆవాలు, జీలకర్ర చిటపటలాడేక ఉల్లిపాయ వేసి 3 నిమిషాల తరువాత 4 మిరపకాయల్ని కోసిన ముక్కలు వేసి ఉప్పు, పసుపు జల్లి వేగాక అరకప్పు శెనగపిండి - ఒక టీ స్పూను క్రష్డ్‌పెప్పర్ [అంటే 4 ఎండు మిరప కాయలు 2 వెల్లుల్లి తొనలు చిటికెడు జీలకర్ర కచ్చాపచ్చాగా నూరినది. దీనినే గొడ్డుకారం అని కూడా అంటారు] వేసి ఎర్రగా వేయించాలి. తినడానికి చాలా బాగుంటుంది.

4 మిరపకాయల్ని ముక్కలు కోసుకోవాలి. 4 కారెట్లని కోరుకోవాలి. $\frac{1}{4}$ కొబ్బరి చిప్పని కూడా కోరుకోవాలి. ఒక ఉల్లిపాయ కూడా తీసుకోవాలి. మూకుడులో నూనె వేసి ఆవాలు, జీలకర్ర చిటపటలాడేక ఉల్లిపాయ ముక్కలు వేసి 3 ని॥ తరువాత మిరపకాయలు, కారెట్‌కోరు వేసి ఉప్పు, పసుపు జల్లి వేయించాలి. ముక్క వేగినప్పుడు కొబ్బరికోరు క్రష్డ్‌పెప్పర్ జల్లి 5 ని॥ వేయించి దించాలి.

మూకుడులో నూనె వేసి మినపపప్పు, శనగపప్పు, ఆవాలు, జీలకర్ర వేసి దోరగా వేగాక ఉల్లిపాయ వేసి 3 ని॥ తరువాత మిరపకాయ ముక్కలు వేసి ఉప్పు, పసుపు జల్లి మూత పెట్టాలి. చిన్న అల్లం ముక్క 2 వెల్లుల్లి తొనలు, 2 పచ్చి మిర్చి నూరి కూర మీద వేసి ఎర్రగా వేగిన తరువాత దించాలి.

ఇలాగే పొటాటో కూడా కలిపి వేయించవచ్చు. చాలా బాగుంటుంది. నలుగురు ఉన్న కుటుంబంలో ఒకపప్పు, పచ్చడితో ఈ 4 కాయల కూర సరిపోతుంది. దాన్నిబట్టి ఎవరికెంత కావాలో చూసుకోవచ్చు. నూనె ఎక్కువ పట్టదు. మూత లేకుండా సన్నని సెగ మీద వేయించితే పొడిపొడిగా ఉండి ఎంతో బాగుంటుంది. ముఖ్యంగా కారెట్‌తో చేసినది చపాతీల్లోకి చాలా బాగుంటుంది. ఈ రకాలన్నీ నేను చేసి ఇక్కడ ఎంతోమందికి వడ్డించాను. అన్ని రకాల జాతుల వారు చాలా చాలా యిష్టపడ్డారు. మరి ఇప్పుడు మీ వంతు!

—ఆశాజ్యోతి సూదల
అలెగ్జాండ్రియా (వర్జీనియా)

'వనిత' అభినందనలతో

## రవివర్మ వర్ణచిత్రం
## కేరళ సుందరి

శ్రీ చిత్రా ఆర్ట్‌గాలరీ, త్రివేండ్రమ్ సౌజన్యంతో



# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

'బ్రాహ్మీదేవి'

కన్నడ సాహిత్యంలో దాదాపు ఎనిమిది వందల సంవత్సరాల క్రితమే 'వచనాలు' అనే ఒక సాహిత్య ప్రక్రియ ప్రసిద్ధమైంది. నిజానికి 'వచనాలు' అనేవి తెలుగులో వచనం అనుకునే గద్య రచనలు కావు. వాటికి కూడా ఒక దేశీయ ఛందోగమనం ఉన్నది. భక్తి ఆవేశంతో పలికే పలుకులకు ఆ వచన ఛందస్సు చాల అనుకూలమైనది. కన్నడ సాహిత్యంలో యీ వచన రచన చేసినవాళ్లు వీరశైవ కవులు. అందులో వీరశైవ మతాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చిన బసవేశ్వరుడు వచన రచనకు ప్రథమ గణ్యుడు.

బసవేశ్వరునితోపాటు ప్రసిద్ధురాలైన మహా కవయిత్రి - వచన రచనలో ప్రథమ శ్రేణిని అలంకరించిన మహారచయిత్రి - అక్క మహాదేవి. ఆమె కన్నడ దేశంలో జన్మించి జీవితమంతా అక్కడనే గడిపినా చివరకు సిద్ధిపొందినది ఆంధ్రప్రదేశంలోని శ్రీశైల దివ్యక్షేత్రమున.

ప్రపంచంపై వైరాగ్యం కలిగి బైరాగులుగా తిరిగే పురుషులవలెనే - వీరశైవ మతంలో శివ భక్తితో లోకాన్ని విస్మరించి శివుడే సకలమూ అనుకొని జీవితాన్ని గడిపిన స్త్రీలు కూడా ఉండేవారు. అట్టివారిని "శివశరణురాండ్రు" అంటారు. అక్క మహాదేవి శివశరణురాండ్రలో అగ్రగణ్య. ఆమె ఎన్నో మహితాద్భుతాలను చూపించింది.

క్రీ. శ. పన్నెండవ శతాబ్దంలో ఉడుతడి అనే గ్రామంలో జన్మించింది అక్క మహాదేవి. ఆ గ్రామం నేటికీ కన్నడ రాజ్యంలో శివమొగ్గ (షిమోగా) జిల్లాలో ఉన్నది. తన తల్లితండ్రులకామె ఒక్కతే సంతానం. సుమతి, నిర్మలశెట్టి అనువారామె తల్లి తండ్రులు. వారున్ను గొప్ప శివ భక్తులు. వీరశైవాచారపరులు. చిన్నప్పటి నుండి శివభక్తిని అక్కమహాదేవి అలవరచుకొన్నది. ఆమె సంస్కృత, కన్నడ భాషలలో గొప్ప వైదుష్యాన్ని సంపాదించింది. శివుడే తనకు సర్వస్వమూ అనుకొని యౌవనవతి అయినప్పుడు శివశరణురాలైంది.

'శరణసతి - లింగసతి' అని చెప్పినట్లు శివ శరణురాలికి శివుడే భర్త - అని భావించి శివుని యందు మధుర భక్తితో శివ చింతనతో ఆమె కాలాన్ని గడపసాగింది. మధుర భక్తి అంటే గోపికలు శ్రీకృష్ణునియందు చూపించిన భక్తి లాంటిది. అటువంటి భక్తినే శ్రీకృష్ణ చైతన్య మహాప్రభువు ప్రచారం చేసింది.

పన్నిద్దరాళ్వార్లలో ఒకతె అయిన గోదాదేవి ధనుర్మాస వ్రతం పట్టి శ్రీకృష్ణుని భర్తగా ధ్యానించి రోజుకొక పాశురాన్ని రచించి గానం చేసి చివరకు శ్రీరంగనాథుణ్ణి వివాహం చేసుకుని ఆయనలో ఐక్యమైన గాథ మిక్కిలి ప్రచారంలో ఉన్నది.

అక్కమహాదేవి కూడా శివుణ్ణి భర్తగా భావించి నిరంతరం శివ చింతన చేస్తూ - శివునిపై వచనాలు రచించి పాడుతూ చివరకు శివునిలో ఐక్యమైన మహాభక్తురాలు.

అక్కమహాదేవికి శివభక్తితోపాటు అమితమైన సౌందర్యం కూడా ఉండేది. ఆమె జన్మించిన ప్రాంతానికి రాజుగా ఉన్న జైనమతావలంబి ఆమె సౌందర్యాన్ని గురించి విని 'ఆమె రాజ అంతఃపురంలో ఉండవలసిన సుందరి. ఆమెను రాచ నగరుకి తీసుకురండి' అని రాజభటుల్ని పంపించాడు. తన శివ చింతనకు నిత్య శివ ధ్యాన యోగానికి రాజు అడ్డు కలిగించకుండా ఉంటే తాను అంతఃపురంలో వచ్చి ఉండటానికి అభ్యంతరం లేదన్నదామె. రాజుకా మాటలు చెప్పితే ఒప్పుకున్నాడతడు. ఆమె రాచనగరుకి చేరింది.

కాని కామాంధుడైన రాజు అంతఃపురంలో ఆమెను బలాత్కరించ ప్రయత్నించాడు. ఆమె చీరకొంగు పట్టుకుని లాగాడు. అప్పుడు మహాద్భుతం జరిగింది. ఆమె చీరను విసర్జించింది. కాని ఆమె వెంట్రుకలు పెరిగి ఆమె శరీరం చుట్టూ కప్పుకొన్నవి. ఆమె "తుచ్ఛుడా! నీవు నా శివధ్యానానికి భంగం కలిగించావు. ఇక నేనిక్కడ ఉండనక్కరలేదు" అని అంతఃపురం వదిలి వెళ్ళిపోయింది. ఆమె 'కేశాంబర' కావడంతో రాజు భయభ్రాంతుడై ఉండిపోయాడు.

ఆమె కల్యాణ కటిక నగరానికి వెళ్ళి అక్కడ అల్లమప్రభు, బసవేశ్వరుడు మొదలగు వీరశైవ భక్తులను కలసి అనుభావ మంటపంలో కూర్చుని శివభక్తి మహత్తు వివరణలు చేసింది.

అక్కడనుంచి బయలుదేరి శ్రీశైలానికి కాలినడకతో వచ్చి శ్రీమల్లికార్జునస్వామి ఆలయం వెనుక కొంత దూరంలో ఉన్న ఒక బిలములో నివసిస్తూ శ్రీమల్లికార్జునస్వామిని సేవిస్తూ - అనేకాద్భుత వచనాలను భక్త్యావేశంతో పలుకుతూ శ్రీశైలమల్లికార్జున స్వామిలో ఐక్యమైపోయింది.

ఆమె భక్త్యావేశంతో పలికిన వచనాలన్నీ కలసి 'అక్కమహాదేవి వచనాంజలి' అని ప్రసిద్ధి పొందినవి. ఆమె మరియొక రచన 'యోగాంగ త్రివిధి.' ఇది త్రిపద ఛందస్సు. ఆనాటి శివకవులు కన్నడంలో ఎక్కువగా త్రిపద ఛందస్సును ఉపయోగించారు. ఆమె కవితలో ఛందో వైవిధ్యం ఎక్కువలేదు. కాని భక్త్యావేశం - నిసర్గ రమణీయమైన కవితా నైపుణ్యం అత్యున్నత స్థాయిలో ఉన్నవి. ఆమె కవిత్వాన్ని చెన్నబసవేశ్వరుడు (బసవేశ్వరుని మేనల్లుడు) మిక్కిలి ప్రశంసించాడు.

అక్కమహాదేవి కన్నడ సాహిత్యాకాశంలో ధ్రువతార. మీరాబాయి, గోదాదేవివంటి భక్తురాలు. మన సంస్కృతికి మధురమైన చిహ్నము. □

# తీరిక వేళల్లో:

# వైరుతో సీతాకోక చిలుక

ఈ సీతాకోకచిలుక చేయడానికి రెండు రంగుల్లో వైర్లు సన్నవి (జపాన్ వైరు అంటారు కొన్ని చోట్ల), బ్యాగులు అల్లే వైరు కావాలి. ముందుగా ఒక వైరు 50″ పొడుగు వుండేలాగా 10 ముక్కలు కట్ చేసుకోవాలి. వేరొక రంగు వైరు 20″ ముక్క ఒకటి కట్‌చేసి ఆ తరువాత ముక్కకు 4″ అధికం చేస్తూ 10 ముక్కలు కట్ చేయాలి (20 + 4, 24 + 4, 28 + 4). ఇక షుమారు అర మూర పొడుగు వుండేలాగా నాలుగు ముక్కలు తీసుకొని (యే కలరు అయినా ఫరవా


1


2

లేదు) సగానికి మడిచి ఉంచుకోవాలి. అదే సైజు రెండు ముక్కలకు ప్లాస్టిక్ పూసలు యెక్కించి (ఒక్కొక్కటి) యివి కూడా మధ్యకు మడిచి వుంచుకోవాలి. (ఇవి కండ్లలాగా వుంటాయి) ఇక యీ చిన్నముక్కలన్నీ సగానికి మడిచి ఆ మడిచిన భాగము ఒక పెన్సిలుకు వేసుకొని రెండు కలుపుకొని పట్టుకోవాలి. ఒక ముక్క కట్ చేసుకొని


3

మడిచి కొసలు బయటికి వచ్చేటట్లు (మీసాలలాగా) వీటితో కలిపి గట్టిగా (మొదటి బొమ్మలోలాగా) పట్టుకోవాలి. 20″ ముక్క తీసుకొని యీ వైర్లకు రవుండుగా ఒకసారి వేసి తిరిగి యింకొక చుట్టు చుట్టి ముడివేయాలి (రెండవ బొమ్మలోలాగా) ఆ తరువాత అట్లానే 50″ ముక్క వేయాలి. ఇట్లా



అది ఒకటి యిది ఒకటి చొప్పున ఆఖరు వరకు వరుసగా అన్నీ ముక్కలు వేయాలి. అన్నీ గట్టిగా వేసిన తరువాత పెన్సిలు లాగివేయాలి. ఇక ముందు వేసిన 20″ ముక్క వదిలి 50″ ముక్క మడిచి పట్టుకోవాలి. ఆ తరువాత వుండే 24″ ముక్కతో ముడులు వేసుకొంటూ రావాలి. ఒక ముక్క తరువాత ఒక ముక్కతో కొనదాక ఆ మడిచిన వైరు (3వ బొమ్మలో మాదిరి) ముడులు వేస్తూ రావాలి (ఒక వైరుతో రెండు ముడులు వెయ్యాలి). అట్లా ప్రతి లైనుకు ఒక వైరు పైన విడిచి రెండవ వైరు మడిచి పైన చెప్పిన విధంగా ముడులు వెయ్యాలి. అట్లా 7 వరుసలు వేయాలి. అంటేపైన ప్రతి లైనుకు తగ్గుతూ వస్తుంది. 7 వరుసలు అయిన పిదప ఆ మడిచిన వైరు తిరిగి పైకి మడిచి ఆ తరువాత వైరుతో పైనచెప్పిన విధంగా ముడులు వేస్తూ పైకి రావాలి. అట్లా ఒక వరుస తరువాత ఒక వరుస చొప్పున క్రింది నుంచి తిరిగి పైకి అల్లుతూ రావాలి. వచ్చేటప్పుడు పైన ఒక్కొక్క వరుసలో వదిలిన వైరు ఒక్కొక్క లైనుకు వరుస క్రమంగా కలుపుకొంటూ తిరిగి 7 లైనులు వెయ్యాలి. అట్లా కలిపినందున మధ్యలో చిన్న చిన్న రంధ్రాలు వస్తాయి. (అంటే ఆ వదలిన వైరు కలపగానే ఆ లైను వదిలి తిరిగి ప్రక్క వైరుతో ముడులు వేసుకొంటూ రావాలి, 7 వరుసలు కాగానే తిరిగి ఆ వైరును క్రిందికి మడిచి పట్టుకొని ముందు వేసిన విధంగా ఒక ముక్క (లైనుకు) వదులుతూ క్రిందికి 7 వరుసలు అల్లుకొని తిరిగి (7 లైను కొనలే) పైకి మడిచి కలుపుకొంటూ పైకి వేసుకొని ఆఖరున పైన ముందు వేసిన ముక్క (20″)ను కలుపుకోవాలి. అంతా కాగానే రెండు, రెండు వైరులు కలుపుకొంటూ మామూలు ముడులు గట్టిగా వేసుకొని కట్ చేసుకోవాలి. ఇలా తయారైన సీతాకోకచిలుకని గోడకు చీలకొట్టి పెడితే చాల అందంగా వుంటుంది. కావలసిన వారు సైజువారీగాచేసి పెట్టుకోవచ్చు. (ఫోటోలో చూస్తే తెలుస్తుంది) చిన్నది కావాలంటే ముక్కలు తగ్గిస్తే చాలు. కావలసినవారు పైన చెమ్కీగాని, పూసలుగాని కుట్టుకోవచ్చు.

వైర్లు మడిచి పట్టుకొనేటప్పుడు ఒక వైరు పైకి, ఒక వైరు క్రిందికి వుండేటట్లు పట్టుకొని (అన్ని చిన్న వైర్లు) ముడులు వెయ్యాలి. రెండు కండ్ల పూసలు రెండు వైపులా ఒక్కొక్కటి వస్తాయి. వైరు చుట్టూ ముక్కలు అన్నీ ముడులు వేసేటప్పుడు ముడులు క్రిందికి రావాలి.





రెండవ వైరు వంచి ముడి వేసేటప్పుడు ఆ చిన్న వైర్ల కట్టను దగ్గరగా వంచి పట్టుకొని ముందు ఒక ముడివేసి లాగి తిరిగి రెండవ ముడి లాగివేసిన మధ్యలో జాగా వుండకుండా వుంటుంది. శాంపిలుగా ఒక ముడిమటుకు 3వ బొమ్మలో చూపడమైనది. అట్లానే అన్ని వైర్లతో ఆ వరుస వేసి తిరిగి పైన ఒకటి వదిలి రెండవది మడిచి రెండు వరసలే వేసుకోవాలి.

—ఆమంచర్ల రాజేశ్వరి

"నెక్స్ట్"....అంటూనే భయపడ్డారు ఆఫీసరు గారు. భయపడుతూ, ఆనందపడుతూ, ఆందోళన పడుతూ లోనికి ప్రవేశించింది అపర్ణ భుజాల చుట్టూ చీర చెంగు లాక్కొని.

"గుడ్‌మార్నింగ్ సార్" అని తీయగా, వినయంగా విష్ చేసింది.

విష్ అందుకోకుండానే భయపడుతూ ప్రక్క చూపులు చూస్తూ వుండిపోయారు ఆఫీసరుగారు.

ఆమె సర్టిఫికేట్ దొంతిని, పట్టుకొని నిల్చునే వుండిపోయింది. పైన ఫేన్ తిరుగుతున్నా ఇద్దరికి చెమట పట్టేస్తూంది. కాకుంటే కారణాలు వేరు.

ఆ పిల్ల ఇంతకుముందు చాలా ఇంటర్వ్యూలకు హాజరయ్యింది. ఏదో మొదటి రెండు మూడు ఇంటర్వ్యూలకి కాస్త గాభరాపడిందేమో కాని, తర్వాత హాజరయిన పది పదిహేను ఇంటర్వ్యూలకి మామూలుగానే వెళ్ళి వచ్చేసింది. ఏదో మొండి తనం, నిరాశనుంచి పుట్టుకొచ్చిన తెగింపు, ఆమెనలా తయారు చేశాయి. కాని, ఈ ఇంటర్వ్యూ అలాంటిది కాదు. చాలా ముఖ్యమైనది. మొత్తం మీద స్ట్రిక్ట్, సిన్సియర్, అని పేరు పొంది, "ఉత్తరా"యణానికి గాని "దక్షిణా"యనానికి గాని లొంగని ఆఫీసరుగారు చేసే ఇంటర్వ్యూ. ఆయన ఆఫీసులోని స్టెనో ఉద్యోగానికి ఇంటర్వ్యూ "మెరిట్ నాదరించే ఆఫీసరు కాబట్టి ఇంటర్వ్యూకొచ్చిన నలుగురిలో తనకే ఎక్కువ మెరిట్స్ వుండటం చేత తనకే ఆయన ఉద్యోగమియ్యొచ్చు. ఆ ఆలోచన ద్వారా కలిగిన ఆశతో ఆ ఇంటర్వ్యూ కొచ్చింది అపర్ణ. తను పడ్డ కష్టనిష్ఠూరాలకు, మంగళం పాడేసే రోజు, ఇదేకావచ్చు, అన్న ఆశతోను ఆత్రుతతోను వుంది కాబట్టే ఆ పిల్లకి చెమట పట్టేసింది.

ఇక ఆయన కెందుకు చెమట పట్టిందీ అంటే, ఆయన బ్రహ్మచారి. బ్రహ్మచారులందరూ ఎలా గుంటారో గాని, ఈయనకి మాత్రం ఆడవాళ్ళంటే అందులోను ఆడపిల్లలంటే చెప్పలేనంత భయం. పైగా ఆయనకు ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఎక్కువ. తను చేస్తున్న ప్రతీ పనిని ప్రపంచమంతా వెయ్యి కళ్ళతో చూసి విమర్శించడానికి సిద్ధంగా వుందని అతని భయం. ప్రక్కవాళ్ళంటే అతనికి విపరీత మైన భయం. అలాగని ప్రక్కవాళ్ళ కోసం. ఆయనేపనీ చేయడు. పైగా, ప్రక్కనున్న వాళ్ళు తనను కాకా పట్టేసి తన ద్వారా ఏమయినా పనులు చేయించుకుంటున్నారేమోనని, ఆయన అప్పుడప్పుడు అనుమానపడి పోతుంటారు కూడా. ఆ అనుమాన మొచ్చేసిన వెంటనే ఆయన ముందుగా, ప్రక్కవాళ్ళతో మాట్లాడటం మానేస్తారు. తను ఆ ప్రక్కవాళ్ళకి సాయం చేసానేమోనని, ఈ ప్రక్కవాళ్ళు అనుమానిస్తున్నారేమోనని ఆరాలు తీస్తారు. ఒక పది పదిహేను

# మరో ఆడపిల్ల కథ

యస్. సీతాలక్ష్మినాయుడు

రోజులు, రాత్రింబవళ్ళు జుత్తు పీక్కొని ఆ విషయం కోసమే, బుర్ర పాడుచేసుకుంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే - ఆయన తనని తానే నమ్మడు.

ఇకపోతే ఆడవాళ్ళంటే కాదు, ఆడవాళ్ళకి సంబంధించిన అనేకానేక విషయాలన్నా, అతనికి ఎలర్జీ. ఆడవాళ్ళు వచ్చే పార్కులకిగాని పిక్‌నిక్‌లకుగాని ఆయన చచ్చినా హాజరుకాడు. ఇంట్లో ఆడవాళ్ళు లేరు (పెళ్ళిచేసుకోలేదు కనుక). ఆఫీసులోను ఆడవాళ్ళులేరు. (ఇంతవరకూ ఎవర్నీ అపాయింట్ చెయ్యలేదు గనుక) కాని ఇప్పుడో, ఒక ఆడమనిషి, అందులోనూ ఆడపిల్ల, తన ఆఫీసుకొచ్చేసేటట్లుందే, ఆఫీసులో ఆడవాళ్ళు మగవాళ్ళు కలిసి పనిచేస్తే ఎన్ని ఇబ్బందులొస్తాయి? ఎన్ని సమస్యలు తలెత్తుతాయి? పైగా, తన గురించి, పైవాళ్ళేమనుకొంటారు? 'ఇంత కాలానికి, ఆ బ్రహ్మచారికి ఆడగాలి అవసరమొచ్చిందే' అని వ్రేలెత్తి చూపితే? అయినా అస్తమానమూ ఒక ఆడపిల్లను ప్రక్కను పెట్టుకొని తను పనిచెయ్యగలడా?....నో! ఇంపోజిబుల్!

అసలు ఇంటర్వ్యూ కొస్తున్న అభ్యర్థుల జాబితాలో ఆడపేరు చూడగానే ఆఫీసరుగారు అంతెత్తు ఎగిరి పడ్డారు. వెంటనే ఆ అమ్మాయి పేరును తప్పించేయమని .... ఎంప్లాయిమెంట్ ఆఫీసరుకు ఫోను చెయ్యాలనుకొన్నాడు. కాని, అలా చేస్తే ఆయన ఎక్కడ తను లంచం తీసుకొని మిగతా ముగ్గురు మగ కేండిడేట్స్‌లో ఎవరికయినా ఫేవర్ చెయ్యదలచుకొన్నట్లు, ఆ ఎంప్లాయిమెంట్ ఆఫీసరు అనుమానిస్తాడేమోనని, ఆ ప్రయత్నం మానేశారు. అయినా ఏదో పార్టీలో ఆ ఎంప్లాయిమెంట్ ఆఫీసరు కలవగా 'ఏమిటండీ అందరూ మగవాళ్ళు పనిచేస్తున్న మా ఆఫీసులో ఆడపిల్ల ఒకవేళ సెలక్టయితే పని చెయ్యగలదా' అని అడగనూ అడిగారు. దానికాయన ఆ అమ్మాయి క్వాలిఫికేషన్స్ గడగడా చెప్పేసి .... బి. ఏ. ఫస్ట్‌క్లాస్, టైప్, షార్ట్‌హేండ్‌లతో, లోయర్, హయ్యర్ పాసయ్యింది. ఆ అమ్మాయికి మీరు తప్పక ఉద్యోగమియ్యాలండి. షి ఈజ్ రియల్లీ మెరిటోరియస్ —'అనేశారు. అదిగో అప్పటినుంచి ఈ ఆఫీసరుగారికి చింత పట్టుకొంది. నిద్రాహా

రాలులేవు. ఈ ప్రమాదాన్నుంచి ఎలా గట్టెక్కాలో తెలియదు. ఇంటర్వ్యూ టైముకి సెలవు పెట్టేద్దామని ప్రయత్నించారు. కాని హెడ్డాఫీసు నుంచి ఫోను .... ఈ ఇంటర్వ్యూ అయ్యాక సెలవు ఇస్తామని. ఇంకేం చేసేదిలేక ఆ వేళ నుంచి బితుకు బితుకుమంటూనే ఇంటర్వ్యూ రోజు కోసం ఎదురు చూస్తున్నారాయన. ఆ రోజు రానే వచ్చింది. ఆ పిల్లా రానే వచ్చింది.

మరంచేత ఆఫీసరుగారికి చెమట పట్టేసింది.

ప్రక్క చూపులు చూస్తూనే, ఒక చూపు ఆ పిల్లవైపు విసిరేశారు. బుద్ధిగా సర్టిఫికేట్స్‌ను గుండెలలో దాచుకొని నిల్చునుంది. మహా వుంటే ఇరవయిరెండు .... ఇరవయిమూడో మొత్తానికి పాతికలోపు వయస్సు.

మరోసారి ఆఫీసరుగారి గుండెలో....చిన్న బాంబు ప్రేలినట్లయ్యింది.

"నా సర్టిఫికేట్స్ సార్" అని, ఇంత లావు పాటి సర్టిఫికేట్స్‌ను అతని ముందుకు పెట్టింది అపర్ణ. కొండచిలువ ముడతలు ముడతలుగా పడుకొని వున్నట్లుంది, ఆ సర్టిఫికేట్స్‌ను చూస్తుంటే ఆఫీసరుగారికి.

భయంగానే సర్టిఫికేట్స్ అందుకొని ఆ పిల్ల వైపు చూడకుండానే, "బి సీటెడ్" అనేసి సర్టిఫికేట్స్‌లోనికి తల దూర్చేశారు.

ఆ పిల్ల పొంగిపోయి "థేంక్యూసార్" అని తియ్యగా కాంప్లిమెంట్స్ అందించేసి, ఒద్దికగా ఆఫీసరుగారి ఎదురుగా వున్న కుర్చీలలో ఒక దాంట్లో కూర్చుండిపోయింది.

ఎందుకో తెలియదుగాని అపర్ణకి ఆ క్షణంలో తనకి ఉద్యోగం వచ్చేస్తుంది అన్న గట్టి నమ్మకం వచ్చేసింది. ఒకసారి ఆఫీసర్ రూమ్‌ని పరీక్షించేసి ఆ వెనుక ఆఫీసరుగారివైపు చూసింది. సర్టిఫికేట్స్‌ను నిశితంగా పరీక్షించేస్తున్నారాయన. 'ఇక నేం ...ఉద్యోగం ఖాయము' అనుకొంది ఎందుకో మరి.

చాలా సంతోషంగా వుందా పిల్లకు.

సంతోషంగా వున్న సమయాలలో .... గతంలో ఏడ్చిన సంఘటనలు గుర్తొస్తాయి సాధారణంగా. అలాగే, బాధపడుతున్న సమయాలలో గతంలో ఆనందపడ్డ సమయాలు గుర్తొస్తాయి.

ఇప్పుడు అపర్ణకి గతమంతా గుర్తుకొచ్చింది. (కారణమేమంటే ఆమెకి గతమంతా విషాదమే మరి)

బాగా బ్రతికి....చితికిపోయి, రిటైరైన హెడ్మాస్టర్ అనంతరావుగారి మొదటి భార్య కూతురు అపర్ణ. అపర్ణకింకా పదేళ్లు నిండకముందే వాళ్లమ్మకి నూరేళ్ళు నిండిపోయాయి. చిన్నపిల్ల సంరక్షణార్ధమని, బంధువులు బలవంత పెడుతున్నారని.... మనసుకు నచ్చ చెప్పుకొని మరో భార్యను పెళ్లాడేశారు అనంతరావుగారు. ఆ తరువాత ఇంచుమించుగా మొదటి భార్యను మరిచిపోయినట్లే ఆయన. కాని అపర్ణ మాత్రం సవతి తల్లి ఏదో సాకుతో గొడ్డును బాదినట్లు బాదినప్పుడల్లా ఇంటి ముందరి జామచెట్టు క్రింద కూలబడి కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ తల్లిని తలచుకొనేది ప్రతీ రోజూ.

### ద్రౌపది మళ్ళీ పుట్టింది!

ఈ మధ్య జర్మనీకి చెందిన 'బిల్డ్ జైటంగ్' అనే పత్రిక ఒక విచిత్రమైన ఉదంతాన్ని వెల్లడిచేసింది.

జర్మనీలో ఓ భీమా సంస్థలో ఐదుగురు వ్యక్తులు ఉన్నత పదవి నిర్వహిస్తున్నారు. వారు ఒకరికి తెలియకుండా ఒకరు తమ కంపెనీ కార్యదర్శినితో పరిచయం పెంచుకున్నారు. ఏటేటా జరిగే కంపెనీ కాన్ఫరెన్స్‌లకి అంతా ఒక చోట గుమిగూడారు. అప్పుడే వారు మళ్ళీ ఒకరికి తెలియకుండా ఒకరు ఆమెతో కలిసి తిరిగారు. సరిగ్గా తొమ్మిది నెలలు తిరిగేసరికి ఆ సెక్రటరీ కాస్తా పండంటి పిల్లవాడిని కన్నది. అంతటితో వూరుకుండా....ఐదుగురికీ తెలియబర్చింది. ఐదుగురూ ఆమెని చూడడానికి వచ్చారు. ఒకరినొకరు చూసి మొదట తెల్ల మొహాలువేశారు. ఆ తరువాత గొడవ పడకుండా పెద్ద మనుషుల్లా రాజీపడి ఒక్కొక్కరూ ఆ పిల్లవాడి పెంపకానికి నెలకి నూట అరవై రూపాయలు యిచ్చేందుకు ఒప్పందం చేసుకున్నారు. మన 'ద్రౌపది' మాత్రం హాయిగా నవ్వేసి ఐదుగురు భర్తల్ని – ఒక కొడుకుని చూసుకుని మురిసిపోయింది తనంత అదృష్టవంతురాలు లేనందుకు.

ఐదు × నూటఅరవై ఎంత ?

అనంతరావుగారు మరో ఆరుగురు పిల్లలకి తండ్రయ్యారు. అందులో నలుగురు ఆడపిల్లలు. ఆ సరికి తాతలనాటి నుంచి వస్తున్న ఆరెకరాల భూమి హరించుకుపోయింది. పైగా ఉద్యోగం నుంచి రిటైరయిపోయారు కూడా. అప్పటికి అపర్ణ బి. ఎ. ఫస్ట్ క్లాసులో పాసయ్యింది. సవతితల్లి తిట్లు, దీవనలను భరిస్తూనే టైప్ షార్ట్‌హేండ్ పరీక్షలు కూడా పాసయ్యింది.

ఆ వెనుక ఎన్నో ఇంటర్వ్యూలకి హాజరయ్యేది. తిరిగి చేతులూపుకుంటూ వచ్చేసేది. అలా వచ్చేసినప్పుడల్లా....

జబ్బుతో మంచానపడ్డ తండ్రి గొణుగుతూ తిట్టేవాడు. నిక్షేపంలా వున్న సవతితల్లి మాత్రం ఆ వాడవాడంతా వినిపించేటట్లు తిట్టేది. ఆ క్షణాన్నే పరుగెత్తుకెళ్ళి, ఏ నూతిలోనోపడి చావాలనుకొనేది అపర్ణ చాలామంది నిరుద్యోగుల్లాగానే. కాని చాలా మందిలాగానే ఆమె చావలేదు. ఏదో ఆశ....ఇన్ని మెరిట్సున్న తనకి .... ఏదో ఒకనాడు ఉద్యోగం రాకపోతుందా ? అప్పుడు ఈ నరకాన్నుంచి తనకి విముక్తి రాకపోతుందా అని.

అదిగో ఆ ఆశ ఇప్పుడు నెరవేరేటట్లుంది. సిన్సియారిటీకి మారు పేరయిన ఆఫీసరుగారు జరిపే ఇంటర్వ్యూ. మెరిట్‌ని ఆదరించే ఆఫీసరు తనకు ఉద్యోగం ఇవ్వకపోతాడా ? తప్పక ఇస్తారు. ఆ ఆశతోనే ఈ ఇంటర్వ్యూకొచ్చింది అపర్ణ.

గతంలో మునిగిపోయిన అపర్ణ తన చేతి మీద ఏదో ప్రాకుతున్నట్లనిపించగా త్రుళ్ళిపడి ప్రస్తుతానికొచ్చి చేతివైపు చూసుకుంది.

తల గిర్రున తిరిగినంత పనయ్యింది.

మరోసారి చూసింది. మరోసారి చూసింది. అది కల కాదు....నిజమే.

జామి కొమ్మమీద గొంగళి పురుగులా....ఆమె చేతిమీద ఆఫీసరుగారి చెయ్యి. నిజమే....స్ట్రిక్ట్ సిన్సియర్ నిజాయితీపరుడని పేర్గాంచిన ఆఫీసరుగారి చెయ్యి. అతని చెయ్యి వణుకుతూంది.

విసురుగా చేతిని వెనక్కు లాక్కొని నిలబడింది. అతను దొంగచూపులు చూస్తున్నాడు.

అతని చేతిలోని సర్టిఫికేట్స్‌ను విసురుగా లాక్కొని, అతనివైపు పరమ అసహ్యంగా చూసి, "యూ బ్రూట్" అని ఛీత్కరించేసి ఆ గది నుంచి బయిటకొచ్చేసింది అపర్ణ....అపరకాళిలా.

*

"ఏమే ఏమయ్యిందే ఉద్యోగం ?"

ఇంటి గుమ్మం ఎక్కకముందే నిలదీసి అడిగింది అపర్ణ సవతితల్లి.

సమాధానం చెప్పకుండానే తల వాల్చేసి....

ఇంటిలోనికొచ్చింది అపర్ణ.

"ఏంటే ఏంటాతల బిరుసు. అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పకుండా ఏంటా దూకుడు. ఇంతకీ ఏమయ్యిందే ఈ ఉద్యోగం కూడా...."

ఆవిడ మాటలు పూర్తి కానివ్వకుండా అడ్డుపడి తను అడిగాడు అనంతరావు ఆశగా 'ఏమ్మా! ఏమయ్యింది? ఈ ఉద్యోగం ఖాయమేనా?'

తండ్రి అలా అడుగుతుంటే ఇంక నిగ్రహించుకోలేక పోయిందా పిల్ల. తను తలచుకొన్నది జరిగినదీ గుర్తు కొచ్చింది. అందులోనూ తనే ఇంటర్వ్యూలోనూ ఎదుర్కొని అవమానం ఇప్పుడు ఎదుర్కొన్నానే అన్నది గుర్తు కొచ్చింది.

ఇంకా ఆవేశాన్ని ఆవేదనని ఆపుకోలేక చేతినున్న సర్టిఫికేట్స్‌ని దూరంగా విసిరేసి రెండు చేతులతో ముఖాన్ని కప్పుకుని ఏడుస్తూ కూలబడి పోయింది అపర్ణ.

"ఏంటే! ఎవరో చచ్చినట్లు ఏంటా ఏడుపు దొంగ ముండా! అయినా నీ ఏడుపుగొట్టు ముఖం చూసి నీ కెవడిస్తాడే ఉద్యోగం? ఎంతమంచి ఆఫీసరయితే మాత్రం నీ ముఖాన్న ఉద్యోగం రాత లేకపోతే నీకెలా గొస్తుందే ఉద్యోగం? ఎందుకొచ్చిన గొడవ తల్లీ! హాయిగా నాలుగిళ్ళలో అంట్లు తోమడానికయినా కుదురవే! నీ కడుపుకైనా తిండి దొరుకుతుంది...."

"పిన్నీ.."

"ఎందుకే బోడి పౌరుషం? అంత పౌరుషమున్నదానివయితే ఉద్యోగం రాలేదని తెలిసినాక ఏ నుయ్యో గొయ్యో చూసుకోక ఇంకా ఏ ముఖం పెట్టుకుని ఇక్కడికి కొస్తావే."

"అదెందుకు చస్తుందే....మనలని చంపి గాని అది చావదు." అని ఇంకా తిట్టబోయి దగ్గుతెర అడ్డురాగా ఆగిపోయారు అనంతరావుగారు.

"మీరు చేసిందే ఇది. ఆడదానికి చదువెందుకండీ అని నేను నెత్తినోరు కొట్టుకొని చెప్పినా విన్నారుకాదు. లేనిపోని గొప్పలకు పోయి వున్నదంతా గుల్ల చేసుకొని దీన్ని చదివించారు. ఇది ఉద్ధరించేస్తుందని గూళ్ళెగరేసారు. ఇప్పుడు చూడండి! అమ్మా! తల్లీ! ఇంక నిన్ను ఇంటిలో పెట్టి పోషించడానికి మాకేమీ మడులు మాణిక్యాలు మూలగటము లేదు. ఇక నీదారి నువ్వు చూసుకో తల్లీ...."

ఇక వినలేక లేచి నిల్చుంది అపర్ణ. ఇలాంటి



# వైద్య విశేషాలు

మన దేశంలో 'మలేరియా' జ్వర పీడితులు రాను రాను అధికమైపోతూ వుండడంతో, వైద్య శాస్త్రజ్ఞులు ఈ అంటువ్యాధిని అరికట్టే మార్గాలు సులభతరం చేయడానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు. 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కమ్యూనికబుల్ డిసీజెస్' (కొత్త ఢిల్లీ)కు చెందిన డా॥ ఎ. ఎస్. రాయ్‌చౌదరి, డాక్టర్ డి. ఎస్. చౌదరి – ఇటీవలే ఈ వ్యాధిని నిరోధించడానికి ఒక 'వాక్సిన్'ను తయారుచేసే ప్రయత్నంలో విజయం సాధించారు. మలేరియాను వ్యాపింపజేసే 'ప్లాస్ మోడియం మలేరియా' క్రిములపై పరిశోధనలు జరిపి, వీటి నుండి 'వాక్సిన్'ను తయారు చేయవచ్చని, ఆ 'వాక్సిన్' వల్ల, శరీరంపై మలేరియా క్రిముల ప్రభావం ఏ మాత్రమూ ఉండదని, అందువల్ల మలేరియా విస్తృతమయ్యే ప్రమాదమూ వుండదని ఈ డాక్టర్లు తెలియజేశారు.

ఇది ఇలా ఉండగా, లక్నోలోని 'సెంట్రల్ డ్రగ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్'కు చెందిన వైద్య శాస్త్రజ్ఞులు - చిట్టెలుకలపై ప్రయోగాలుచేసి మలేరియా నిరోధానికి ఉపవాసమే ఒక మందుగా పని చేస్తుందన్న విషయాన్ని కనుగొన్నారు. ఉపవాసం చేయడంవల్ల శరీరంలో ఏర్పడే రసాయనిక ప్రక్రియ కారణంగా మలేరియా క్రిములు ఎర్రకణాలలోకి ప్రవేశించడానికి అవకాశం ఉండదని, అందువల్ల మలేరియా తగ్గుముఖం పడుతుందనీ ప్రకటించారు. చిట్టెలుకలకు నయమైనట్లే, ఉపవాసం చేస్తే మనుష్యులు కూడా మలేరియా బారి నుంచి తప్పించుకోవచ్చునట!

*

మద్యపానం వల్ల గుండెపోటు వస్తుందని చాలా మంది అనుకుంటూ వుంటారు. కాఫీ, మద్యపానానికి హృద్రోగాలకు సంబంధం లేదని — ఈ మధ్య ఢిల్లీలో జరిగిన తొమ్మిదవ 'ఇంటర్నేషనల్ హార్ట్ కాంగ్రెస్'లో ఆ కమిటీ అధ్యక్షులు డా॥ ఎమ్. తాజుద్దీన్ వెల్లడి చేశారు. ఆ సమావేశంలో గుండె, గుండెకు సంబంధించిన రోగాలపై చర్చ జరిగింది. క్రమ పద్ధతిలో, మంచి ఆహారం తీసుకోకపోవడం, జీవితంలో ఎదుర్కొన వలసి వచ్చే కష్టనష్టాలు, ఒడిదుడుకులు మొదలైన కారణాలవల్లే హృద్రోగాలు కలుగుతాయని, మద్యపానానికీ గుండె జబ్బులకూ సంబంధంలేదని – ఆ సమావేశంలో డా॥ ఎమ్. తాజుద్దీన్ వివరించారు.

*

చూపు సరిగ్గా లేక, దూరదృష్టి, హ్రస్వ దృష్టి వంటి కంటి సమస్యలతో బాధపడుతూ, రకరకాల కళ్లద్దాలు ఉపయోగించి, విసుగుచెందిన వారికి ఓ ఆశాజనకమైనవార్త. ప్రత్యేకంగా తయారు చేయబడ్డ కొన్ని కాంటాక్టు లెన్సులను ఉపయోగిస్తూ, కంటిలోని కార్నియా (కంటి గ్రుడ్డు ముందువైపున ఉండే గ్లాసు ప్లేటువంటి భాగం)ను సరిచేయవచ్చని, ఆ విధంగా కంటి చూపు సరిగ్గా లేక బాధపడుతున్నవారిని పూర్తిగా బాగు చేయవచ్చని – అమెరికాలోని 'నేషనల్ ఐ రీసెర్చ్ ఫౌండేషన్'వారు ఇటీవల తెలియజేశారు. మామూలుగా వాడే కళ్లద్దాలు, కాంటాక్టు లెన్సులు తాత్కాలికంగా ఉపయోగపడతాయేకాని అవి కంటి సమస్యలను పూర్తిగా పరిష్కరించలేవు. ఇప్పుడు రూపొందించబడిన కాంటాక్టు లెన్సులను వ్యాధిగ్రస్థులు-రెండు సంవత్సరాలపాటు ఉపయోగించవలసి వుంటుంది. కంటి వైద్యులు ఈ కాంటాక్టు లెన్సులను-అప్పుడప్పుడు మార్చుతూ, ఏ లెన్సుల వల్ల దృష్టి సరిగ్గా వుంటుందో పరిశీలించి, రెండవ సంవత్సరాంతంలో సరైన కాంటాక్టు లెన్సులను నిర్ధారణచేసి, రోగికి అమర్చుతారు. ఈ వైద్య విధానం చాలా ఖరీదైనదని, ఐతే, ఈ ఖర్చును తగ్గించే మార్గాలను కూడా వైద్య శాస్త్రజ్ఞులు అన్వేషిస్తున్నారని తెలుస్తున్నది.

*

నపుంసకత్వాన్ని శస్త్రచికిత్స ద్వారా నివారించవచ్చునని డాక్టర్ శక్తిదాన్ (కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం-యూరోలజీ శాఖ) ఇటీవల ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌వారి పత్రికలో-ప్రచురించిన తమ నివేదికలో తెలియజేశారు! ఈ అంశంపై వివిధ పరిశోధనా కేంద్రాలలో రెండు దశాబ్దాలుగా-వైద్య పరిశోధనలు జరుగుతూ వున్నాయని, శస్త్రచికిత్స ద్వారా పుంసత్వాన్ని కృత్రిమ పద్ధతిలో కల్పించినప్పటికీ, ఫలితాలు ప్రయోజనదాయకంగా వున్నాయని, ఆయన ఆ నివేదికలో వివరించారు.

# కలకలలాడే
# ముఖ కళకోసం కలికి కంటికి కాటుక




everest/79/SH/117-tl

## దక్షిణభారతీయస్త్రీల కళ్ళల్లో కోటికాంతులను విరియింపజేసేందుకు

## శింగార్
డీలక్స్ కాజల్ (కాటుక)

సన్మానాలకు తరచు అలవాటుపడిపోయినా ఏంటో ఈ రోజు మరీ తల తీసేసినట్లనిపించింది ఆమెకు. పైగా కోటి ఆశలతో వెళ్లిందేమో_ఒక్కసారే ఆకాశం మీద నుంచి అగాధంలోనికి పడిపోయి నట్లుందామె. అందుకే మరీ కష్టంగా వుంది. ఇక బ్రతుకెందుకు? చస్తాను-అన్న నిర్ణయానికొచ్చేసిందామె. గొంతు చించుకొని నోటికొచ్చినట్లు తిడుతూంది అండాళమ్మ. ఇరుగు పొరుగువారు గుమ్మం చుట్టూ చేరడంతో ఆమె శ్రుతి పెంచేసింది. అనంతరావుగారు కూడా దగ్గుతూనే తిడుతున్నారు. తిడుతూనే దగ్గుతున్నారు.

ఇక వినలేక, భరించలేక, అక్కడ నిల్చోలేక, బ్రతకడాని కిష్టంలేక, వీధిలో కొచ్చేసింది అపర్ణ. ఆమె వెనుకే ఆ ఇంటి తలుపులు భళ్ళున మూసుకొన్నాయి.

*

మధ్యాహ్నపువూట ఆఫీసుకు శెలవు పెట్టేసి తన గదికొచ్చేశారు ఆఫీసరుగారు. బట్టలు మార్చుకొని ఫేన్ వేసుకొని పడుకొన్నారు. కళ్ళు మూసుకున్నారు. కాని నిద్ర రావటం లేదు. ఆందోళన తగ్గటంలేదు. బాత్‌రూమ్ కెళ్ళి శుభ్రంగా ముఖం కడుక్కు_నొచ్చేశారు. ఫేన్ స్పీడ్ పెంచేశారు. పడుకొన్నారు. కానేం లాభం లేదు. ఆందోళన తగ్గలేదు. ఆలోచనలు తెగిపోలేదు. మాటిమాటికి "యూ బ్రూట్" అని తననో క్రూరమృగాన్ని చూసినట్లు చూసిన ఆ అమ్మాయి చూపులే గుర్తొస్తున్నాయి. గుండెల్లో నుంచి వణుకు పుట్టుకొస్తుంది. తను చేసిన ఈ పాపానికి దేవుడు తనని శూలానికి గుచ్చి మరుగుతున్న నూనెలో పడేసి వేయించేస్తున్నట్లు ఊహించుకొని భయపడిపోతున్నారాయన.

ఇక పడుకోలేక గదిలో అటూ ఇటూ పచార్లు చెయ్యటం మొదలెట్టారు.

"అంతా తను అనుకున్నట్లే జరిగింది. కాని ఎందుకీ అశాంతి, అలజడి, భయము, వణుకు" అదే అర్థం కావటం లేదాయనకు.

ఇంతకు ఆయన ఏమనుకున్నారంటే....

అపర్ణ సర్టిఫికేట్స్ చూశాక ఇంటర్వ్యూకి వచ్చిన అందరిలోనూ ఏకోణం నుంచి చూసినా అపర్ణకే మెరిట్ వుంది. అన్న విషయం ఆయనకు తెలిసిపోయింది. ఏ విధంగా చూసినా ఆ ఉద్యోగానికి అర్హురాలు అపర్ణేనని అతని అంతరాత్మ బల్లగుద్ది చెబుతోంది. కాని ఈ ఉద్యోగాన్ని ఆడపిల్ల కివ్వటమా? అందులోను అందమైన ఆడపిల్ల. నిండా పాతికేళ్ళున్నా నిండని పిల్ల. పైగా అస్తమానమూ తనతో ఉండాల్సొస్తుంది. ఇద్దరూ ఒకే గదిలో సుమారు ఆరేడు గంటలు పన్చేయాలి. కొన్నిసార్లు ఆ పిల్ల తన ఇంటికి రావల్సి వస్తుంది కూడా! హే భగవాన్! ఇంకేముంది. తన గురించి నలుగురు ఏమనుకుంటారు? తనమీదున్న గుడ్ ఇంప్రెషన్ ఏమవుతుంది? నలుగురు తనను తలెత్తి చూసి నానా రకాలుగా వ్యాఖ్యానిస్తుంటే తను భరించగలడా! భరించి బ్రతకగలడా! తన క్రింది ఉద్యోగులు తనకు తాటాకులు కట్టేసి వాయించి పారెయ్యరూ! అంతెందుకు? పామును మెడకు చుట్టుకొని నాట్యం చేసినట్లు ఈ ఆడపిల్లను ప్రక్కన పెట్టుకొని తను పని చెయ్యగలడా! నో! ఇంపోజిబుల్ ఎనీ హౌ! ఈ పిల్లకు ఉద్యోగం ఇయ్యకూడదు. ఎలా? మెరిట్‌ని ఇగ్నోర్ చేసేస్తే స్ట్రిక్ట్, సిన్సియర్ అని పేర్గాంచిన తన పరువు బజారుపాలవుతుందే. ఏ కారణం చూపించి ఈ పిల్లకి ఉద్యోగం ఇయ్యకపోవడం?

ఆ వెనుక తల పీక్కు_న్నారు గాని ఆయనకు ఆ పిల్లకి ఉద్యోగం ఇవ్వకుండా వుండే కారణం దొరకలేదు.

ఇక చేసేది లేక నిస్సహాయంగా ఆ పిల్ల వైపు చూశారు. ఆ పిల్ల ఈ లోకంలోనే వున్నట్లులేదు. ఏదో ఆలోచనలో వుంది. ఆ పిల్లని అలా చూశాక ఆఫీసరుగారికో మంచి ఆలోచన వచ్చింది. తనేదయినా చెడ్డపని చేసి (అదీ రూల్స్‌కి వ్యతిరేకంగా కాకుండా) ఆ పిల్లకి తన మీద బేడ్ ఇంప్రెషన్ - కలుగజేస్తే? ఆ కోపంతో ఆ పిల్ల ఈ ఉద్యోగం వద్దు - అని వెళ్ళిపోతే_వెరీగుడ్! అదే మంచి ఐడియా అన్న నిర్ణయానికొచ్చి ఆ గదిలో జరిగింది—మరో మనిషి చూడటానికవకాశంలేదు గనక, (కారణం ఆ గదిలో వాళ్ళిద్దరూ తప్ప మరెవరూ లేరు) ఒకవేళ ఆ పిల్ల తిట్టినా మరో మనిషికి వినబడదు గనక (ఆ గది సౌండ్ ప్రూఫ్) అలా చేదాం అని నిర్ధారణ చేసుకొని గుండె దిటవు చేసుకొని దేవుడికి క్షమాపణ చెప్పుకొని ఆ పిల్ల చేయి మీద చెయ్యేశారు ఆఫీసరుగారు.

అతనను కొన్నట్లే ఆ పిల్ల సివంగిలా లేచి, లక్ష తిట్లకు సరిసమానమైన ఒక పెద్ద తిట్టు తిట్టి నీబోడి ఉద్యోగమెవడిక్కా_వాలనేసి వెళ్ళిపోయింది.

బాగానే వుంది.

కాని ఇదేమిటి ఆ పిల్ల అలా వెళ్ళిపోయిన దగ్గర్నుంచి తన అంతరాత్మ నానా గొడవ చేసేస్తోంది. నానాతిట్లు తిట్టేస్తోంది. తనకన్నా.... డబ్బు తీసుకొని ఉద్యోగాలిచ్చే వాళ్ళే నయమని.... వాళ్ళకి డబ్బు కక్కు_ర్తేగాని తనలాంటి నీచపు బుద్ధి వుండదని వాళ్ళ కన్నా తను సంఘానికి ఘోర ప్రమాదకారని, తను...ప్రక్క_వాళ్ళ మెప్పు కోసమే నీతి, నిజాయితీ, నటిస్తున్నానని, తనేదయినా అడవిలో వుండుంటే (మనుష్యులు లేని చోట) తను క్రూర మృగం కన్నా అన్యాయంగా ప్రవర్తించుండే వాడని....ఇలా ఇష్టమొచ్చినట్లు తిట్టేసి, నిలదీసి భయపెట్టేస్తోంది అంతరాత్మ.

ఆఫీసుకు సెలవు పెట్టేసి ఇంటికొచ్చేసినా భయం, వణుకు, అలజడి, ఆందోళన తగ్గలేదు.

పచార్లు ఆపేసి, బెడ్ మీద వాలిపోయి, అశాంతిగా అటూ ఇటూ దొర్లసాగారు ఆఫీసరుగారు.

ఇంతలో ప్యూన్‌లోనికొచ్చి, "సార్! మీ గురించి ఎవరో అమ్మాయి వచ్చారు. పేరు అపర్ణట. ముందు గదిలో కూర్చోమని చెప్పాను. [illegible] చెప్పమంటారా? వెళ్లిపొమ్మని చెప్పమంటారా?"

క్రింద బాంబు ప్రేలినట్లు త్రుళ్లిపడి లేచారు ఆఫీసరుగారు.

అపర్ణ ఆ పిల్లే! ఇంటికెందుకొచ్చింది. అక్కడ పూర్తిగా తిట్టలేదని తిట్టడానికొచ్చిందా! పోనీ తిట్టనీ. అలాగయినా తనకు మనశ్శాంతి దొరుకుతుందేమో! ఇది మంచిదే. తను క్షమాపణ చెప్పుకోవచ్చు.

"సరే వుండమను....నేనిప్పుడే వస్తాను" అని చెప్పి ప్యూనును పంపించేశాడు.

ఆ వెనుక భయపడుతూనే ముందు గదిలోనికి వెళ్ళాడు. అతన్ని చూడగానే అపర్ణ లేచి నిల్చుంది.

కొన్ని క్షణాలపాటు భయంకర నిశ్శబ్దం. ఆ వెనుక....అపర్ణ రెండడుగులేసి ఆఫీసరు దగ్గర కొచ్చి, "సారీ! సార్! మీరూహించినట్లే.... నాలాంటి నిరుద్యోగులకు మానం కన్నా, ప్రాణం కన్నా ఉద్యోగమే ముఖ్యం. మీరేం కోరితే అది యిచ్చేందుకు సిద్ధంగా వున్నాను. నాకా ఉద్యోగం ఇప్పించండి" అనేసి తల వాల్చుకొని నిలబడిపోయింది.

ఆఫీసరుగారు ధామ్మని క్రింద పడిపోయారు!□

# సుమతీ మొరార్జీ

"నేను స్త్రీ నైనంత మాత్రాన నన్నేదో ప్రత్యేకంగా చూడాలని గానీ, ప్రత్యేకమైన గౌరవాన్ని యివ్వాలని గానీ నేనెన్నడూ ఆశించలేదు; అడగనూ లేదు. నన్ను తోటివారు తమ సహ వుద్యోగినిగా గుర్తించి, గౌరవిస్తేచాలు. అదే నాకు కొండంత బలాన్ని ఇస్తుంది" అంటారు శ్రీమతి సుమతి శాంతి కుమార్ మొరార్జీ.

ఆమె అన్న మాటల్లో ఎంతో సత్యం లేకపోలేదు. సాధారణంగా కొన్ని వున్నత పదవులు కేవలం పురుషులు మాత్రమే నిర్వర్తించగలరన్న అపోహ చాలామందికి వుంది. స్త్రీలు ఆ పదవులు చేపట్టినా 'ఆఁ వారేం చెయ్యగలరులే' అనే చులకన భావం గల పురుషులే కాదు-స్త్రీలు కూడా వున్నారు. కాని అటువంటి పదవులను స్త్రీలు కూడా ఎంతో సమర్థవంతంగా నెరవేర్చగలరని కొందరు వనితలు నిరూపించారు; నిరూపిస్తూనే వున్నారు. అటువంటి వారిలో ప్రథమశ్రేణికి చెందిన వనిత – బొంబాయిలోని సిందియా స్టీమ్ నావిగేషన్ కంపెనీ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ సుమతీ మొరార్జీ!

నౌకా వాణిజ్యం ఆనాడు, ఈనాడు కూడా ప్రపంచపరంగా పురుషుల హస్తగతంగానే వుంది. కాని ప్రపంచం మొత్తం మీద అటువంటి వున్నత పదవికి చేరగలిగిన ఏకైక వనిత - శ్రీమతి సుమతీ మొరార్జీ. అందుకే ఆమె విశిష్ట వనితగా పరిగణింపబడుతున్నారు. అరవైతొమ్మిదేళ్ళ సుమతీబెన్ ఈనాటికీ ఎంతో వుత్సాహంతోనూ, వుత్తేజంతోనూ నౌకా వాణిజ్య వ్యవహారాలను చూసుకుంటున్నారు. అనేక క్లిష్ట విషయాల మీద చర్చలు జరపడం, నిర్ణయాలు తీసుకోవడం, తన వుద్యోగుల కష్టనష్టాల గురించి తెలుసుకోవడంతోనే ఆమెకి క్షణం తీరిక లేకుండా వుంటుంది. ఇక నౌకా వాణిజ్యానికి సంబంధించిన వివరాలు, లెక్కలు ఆమె మునివేళ్ళమీదుంటాయి.

మన దేశంలో నౌకా పరిశ్రమని స్థాపించిన ప్రథములలో ఒకరైన నరోత్తమ్ మొరార్జీ కోడలు సుమతి. మామగారి ప్రోత్సాహంతోనే నౌకా వాణిజ్యం గురించి తెలుసుకోవడం ప్రారంభించారామె. నరోత్తమ్ మొరార్జీ హఠాన్మరణంతో సుమతి నౌకా వ్యాపారంలోకి ప్రవేశించాల్సి వచ్చింది. 1940 నాటికి ఆమె డైరెక్టర్ కాగలిగారు. 1946 నాటికి ఆ కంపెనీపై పూర్తి అధికారాన్ని సంపాయించగలిగారు సుమతి. ఇప్పటికి ఆమె నౌకా వాణిజ్యంలోకి ప్రవేశించి నాలుగు దశాబ్దాలవుతోంది.

ఆమె అకుంఠిత దీక్షవల్లా, సమర్థవంతమైన నాయకత్వం వల్లా సిందియా కంపెనీ నేడు ఏభై ఓడలను పొందడమే కాక ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు వాణిజ్య సామగ్రిని రవాణా చేస్తోంది.





సుమతీబెన్ కేవలం ఆఫీసునే అంటి పెట్టుకుని వుండకుండా తరచు ఆ ఓడలని కూడా పరీక్షిస్తూ వుంటారు. వాటిని ముద్దుగా ఆమె 'అవి నా కుమార్తెల'ని అంటూ వుంటారు. ఓడలోని ప్రతీ భాగం ఆమె శ్రద్ధతో పరిశీలిస్తారు. నౌకల గురించిన పఠనం, సాంకేతిక పరిజ్ఞానం ఆమె అధ్యయనం చేశారు. అందువల్ల ఎక్కడ ఏ లోపమున్నా వెంటనే కనిపెట్టెయ్యగల నేర్పు ఆమెకి వుంది.

సుమతీబెన్ పలుమార్లు విదేశపర్యటన చేశారు. అక్కడ నౌకాయానం మీద జరిగిన సమావేశాలలో పాల్గొన్నారు. కొన్ని నౌకల ప్రారంభోత్సవం చేయడానికి కూడా ఆమె విదేశాలకు వెళ్ళారు.

జాతీయ నౌకా యజమానుల సంఘానికి ఆమె అధ్యక్షురాలు. జాతీయ షిప్పింగ్ బోర్డులోనూ, అంతర్జాతీయ నౌకా సమాఖ్యలోనూ ఆమె సభ్యురాలు.

నౌకా వాణిజ్యంలో ఆమె చేసిన విశిష్టమైన సేవకు గుర్తింపుగా ప్రభుత్వం 1971 లో ఆమెకు 'పద్మవిభూషణ్' యిచ్చి గౌరవించింది.

నౌకా వాణిజ్యంలోనే కాక స్వాతంత్ర్య సమరంలోనూ ఆమెకు భాగం వుంది. మహాత్మాగాంధీ, జయప్రకాష్ నారాయణ్ వంటి జాతీయ నాయకుల పరిచయంతో ఆమె స్వాతంత్ర్య సమరంలో చురుకుగా పాల్గొన్నారు. 1915లో గాంధీజీ దక్షిణ ఆఫ్రికా నుంచి తిరిగి వచ్చిన తరువాత ఆమె యింటనే కొంతకాలం బస చేశారు. 1924లో ఆయనకి అపెండిసైటిస్ ఆపరేషన్ తరువాత విశ్రాంతి కోసమూ, 1944లో పూనా జైలు నుంచి విడుదలైన తరువాతా కూడా గాంధీజీ ఆమె ఇంటనే బస చేశారు. ఆ యింటి పేరు 'పాంబన్'. గాంధీజీకి ఎంతో ప్రీతిపాత్రమైన గృహం అది. అందుకే నేటికీ అక్కడ ఆయన వుపయోగించిన పాదరక్షలు, కలము వంటి వస్తువులను భద్రంగా దాచారు సుమతి. గాంధీజీ ప్రార్థన చేసిన స్థలంలో విగ్రహం ప్రతిష్టించారామె.

తన వద్దనున్న అత్యంత విలువైన వస్తువు 'నూలుతో వడికిన చీర' అంటారామె. వెలకట్టలేని ఆ చీర గాంధీజీ వడికినది!

ఒకవైపు నౌకా వాణిజ్యంలో తలమునకలవుతూనే మరోపక్క తమ యింటి ఆవరణలోనే స్థాపించిన పాఠశాలల వ్యవహారాలు కూడా చూసుకుంటున్నారామె. 1963లో ప్రారంభించిన ఈ పాఠశాలలలో యిప్పుడు 600 మంది విద్య అభ్యసిస్తున్నారు.

జయప్రకాష్ నారాయణ్ మాటల్లో చెప్పాలంటే- "సుమతీబెన్ నౌకా వ్యాపారంలో ఆరితేరిన వణిక్ప్రముఖురాలే కాదు. అంతకుమించి చక్కని హృదయమూ, సంస్కారమూ, మానవత్వం మూర్తీభవించిన వనిత కూడా." □

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-49' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు జూలై 25 వ తేదీ లోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 సెప్టెంబర్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. తొందర తొందరగా అన్నమాట.
2. సూర్యుడు పడమట ఉదయించినట్లా?
3. మంచైనా కావచ్చు; మేలైనా కావచ్చు.
4. కరుణలేకుండా కటిక పన్లు చేస్తాడు.
5. తెలుసుకోవడానికి అంతం వుండదుగదా!
6. కాలికింద వుండేదే తిరగబడితే?
7. పిల్లల్ని నిద్ర పుచ్చుతుంది.
8. 'కుళ్ళుగలది' తారుమారు.
9. మొదటి అక్షరాన్ని అదే అక్షరంతో నొక్క, తర్వాత మాటను తిరగేస్తే, ఎగరగలిగేది.
10. తేలికలో శ్రీచందనం
11. నితవ
12. ఔరా అని ఆశ్చర్యపోవడానికి

### ఆధారములు – నిలువు

1. సాక్ష్యానికి దీనికిమించినది లేదంటారు.
5. చిన్నదానికి ముద్దయిన మాట
13. స్త్రీల–ఆచ్ఛాదనం
14. పేరుపెట్టే వేడుక
15. ఆనందం
16. సాధు జంతువు
17. పోట్లాడుకోవడం
18. 16 నిలువులో వున్నదానికి సంబంధించే దీన్ని తిరగేసి హోమం చెయ్యడానికి ఉపయోగిస్తారు.
19. చాలా తెలిసి వున్నవాడు.
20. వ్రాయబడేది
21. అతుకు
22. ఒక గ్రామదేవత పేరు
23. పాడగల పిట్ట ఇక్కడ కో(యన)లేదు
24. వట్టిదే-ఏమీలేదని!

## వనిత మాటల కొలువు-49

## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 13 | 14 | | 15 | ■ | 16 |
| | ■ | 2 | | ■ | 3 | 17 | |
| ■ | ■ | 4 | | 18 | ■ | | ■ |
| 5 | 19 | ■ | 6 | | ■ | 7 | 20 |
| 8 | | 21 | ■ | ■ | ■ | 9 | |
| | ■ | 10 | | 22 | | | ■ |
| 11 | 23 | | ■ | | ■ | ■ | 24 |
| ■ | | ■ | 12 | | | | |

పేరు ____________________

చిరునామా ____________________

____________________

____________________

____________________

# చూడండి...
# సర్వోత్తమ తెలుపు కోసం రానిపాల్®









బట్టలను ఆఖరుసారి జాడించునపుడు కొంచెము రానిపాల్ వేయండి. అపుడు చూడండి...
బట్టలపై మెరిసే తెలుపు! రానిపాల్ తెలుపు! తెల్లటి బట్టలు ఏవైనా కాని—
నూలు, సింథెటిక్ మరియు మిశ్రమ బట్టలు రానిపాల్‌తో మెరుస్తూ వుంటాయి.

**నియమానుసారంగా రానిపాల్‌ను వేయండి...తెలుపు చూడండి, చూపండి!**

నూలు దుస్తులకు **రానిపాల్®**
సింథెటిక్ మరియు మిశ్రమ దుస్తులకు **రానిపాల్®-ఎస్.**

Shilpi SG-2A/78 Tel



# గోళ్ళకి రంగు

ఈ రోజుల్లో గోళ్ళకు రంగు వేసుకుని ఆనందించడం స్త్రీలకు పరిపాటి అయింది. మన పూర్వీకులు కూడా చేతి వ్రేళ్ళకు గోరింటాకును పెట్టుకుని అందం తెచ్చుకునేవారు. గోరింటాకు పెట్టుకోవడం అందం మాత్రమే కాదనీ, అది గోళ్ళను రక్షించడానికి ఎంతో తోడ్పడుతుందనీ మనందరికీ తెలుసు. అయినప్పటికీ గోళ్ళకు ఈ కృత్రిమమైన రంగు వేసుకోవడానికే నేడు ఎక్కువమంది స్త్రీలు సుముఖత చూపుతున్నారు. గోరింటాకు పెట్టుకునే వనితల సంఖ్య నానాటికీ తగ్గిపోతున్నది. ఇది పాశ్చాత్య నాగరికతా ప్రభావం తప్ప మరొకటి కాదు. గోళ్ళకు వేసుకునే ఈ రంగును ఆంగ్లంలో "నైల్‌పాలీష్" అని అంటారు. ఈ నైల్‌పాలీష్‌లు అందంగా వుండటంచేత, రకరకాల రంగులలో లభ్యం కావడం చేత, దానిని ఉపయోగించే పద్ధతిలో ఇబ్బందులు లేకపోవటం చేత నేటి స్త్రీలకు ఈ నైల్‌పాలీష్‌పై మోజు ఏర్పడటానికి కారణాలుగా చెప్పుకోవచ్చును.

ఏమైనా ఈ నైల్‌పాలీష్ తయారు చేయటం చాలా సులభమైన పని. దీనికి కావలసిన వస్తువులు కూడా పెద్ద ఖరీదైనవి కాకపోవటం మరో ప్రత్యేకత. ఈ కారణాలవలన స్త్రీలు తమ స్వంత అవసరానికి ఇంట్లోనే చేసుకోవచ్చు. లేదా జీవనోపాధికి ఈ నైల్‌పాలీష్ తయారీని ఒక వృత్తిగా కూడా తీసుకోవచ్చును.

ఇది తయారు చేయడానికి ముఖ్యంగా కావలసిన పదార్థం "సెల్యులాయిడ్". ఈ సెల్యూలాయిడ్‌ను డబ్బుపెట్టి కొనవలసిన అవసరం లేదు. ఉపయోగపడని పాత ఫిల్ములు వగైరా సెల్యూలాయిడ్ వస్తువులను సేకరించి పెట్టాలి. మీకు తెలిసిన ఫోటో స్టూడియోలలో కానీ లేదా ఫోటోగ్రాఫర్లని గానీ ఎవరినైనా అడిగితే కావలసినన్ని పాత ఫిల్ములు లభిస్తాయి.

ఈ విధంగా సేకరించుకున్న ఫిల్ములను కత్తెరతో ముక్కలుగా కత్తిరించాలి. తర్వాత ఒక బక్కెట్‌లో బట్టలు ఉతికే సోడా కొద్దిగా వేసి తగినంత నీరు పోసి ఆ నీటిలో ఈ ఫిల్ము ముక్కల్ని వేయాలి. ఈ విధంగా ముక్కల్ని సోడా నీటిలో రెండు రోజులపాటు ఊరనివ్వాలి. ఈ విధంగా చేయటం వలన ఫిల్ములో వున్న నలుపురంగు చెరిగిపోయి, అవి శుభ్రమైన సెల్యూలాయిడ్ ముక్కలుగా అవుతాయి. ఈ ముక్కల్ని బయటకు తీసి, నీటిని బాగా విదిలించి ఎండలో పెట్టి ఎండనివ్వాలి. బాగా పొడిగా అయ్యాక మళ్ళీ కత్తెర తీసుకుని ఇంకా చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించాలి. ఇప్పుడు ఈ ముక్కల్ని 100 గ్రెయినులు (అంటే సుమారు ఏడు గ్రాముల బరువు) మాత్రం తూచి తీసుకోవాలి. ఈ ముక్కల్ని తూచి ఒకవైపు విడిగా పెట్టాలి.

ఇంకా అసిటోన్ (Acetone) ఒక అవున్సు (అంటే సుమారు 30 గ్రా), అమైల్ అసిటేట్ (Amyl Acetate) రెండున్నర అవున్సులు (సుమారు 75 గ్రా), స్పిరిట్ రెడ్ నలభై అవున్సులు (సుమారు 1,100 గ్రా) తీసుకోవాలి.

ఇప్పుడు ఒక పెద్ద శుభ్రమైన గాజు సీసాను తీసుకోవాలి. దానిలోకి అసిటోన్‌ను, అమైల్ అసిటేట్‌ను పోసి బాగా కలపాలి. (సీసాను ఝాడించి కలపండి). ఇక ఈ మిశ్రమంలోకి తూచి పెట్టిన సెల్యూలాయిడ్ ముక్కల్ని వేసి ఊరనివ్వాలి. ఈ సీసాను అలాగే వుంచేయాలి. రెండు రోజులు గడిచాక చూస్తే సెల్యూలాయిడ్ ముక్కలు కనిపించవు. ద్రవ మిశ్రమంలో కరిగిపోయి వుంటాయి. ఇప్పుడు ఈ మిశ్రమంలోకి స్పిరిట్ రెడ్ అనే ఎర్రని ద్రవాన్ని కలిపి బాగా సీసాను ఝాడించి కలిపి, కార్కుతో సీసామూతిని గట్టిగా బిగించి పెట్టేయాలి. మూడు రోజులు అయ్యాక ఈ సీసాను మళ్ళీ బాగా ఆడించి, లోపలి ద్రవం బాగా కలిసేలా చేసి, ఒక పల్చని శుభ్రమైన గుడ్డ తీసుకుని వడపోయాలి. ఇదే ఎరుపురంగు పాలీష్. దీనిని శుభ్రమైన సీసాలలోకి పోసి నిల్వ చేసుకోవచ్చును. అమ్మకానికి పంపేవారు తగిన సైజు సీసాలలో పోసి, అందంగా లేబిల్ అతికించి పంపవచ్చును. ఈ ఎరుపురంగు నైల్‌పాలీష్ గోళ్ళకు అందాన్ని, మెరుపును చేకూర్చి స్త్రీల అందానికి, అలంకరణకి మెరుగులు దిద్దుతుంది.

కొంతమంది స్త్రీలకు రంగు గల పాలీష్‌లు ఉపయోగించడం ఇష్టం ఉండదు. అలాంటివారికి రంగు లేని నైల్‌పాలీష్‌లు ఉపయోగపడతాయి. ఈ పాలీష్ గోళ్ళకు వేసుకుంటే గోళ్ళు సహజ రంగులోనే వుంటాయి. దీనిని పురుషులు కూడా ఉపయోగించవచ్చును. చూచేవారికి రంగు వేసుకున్నట్లు కనిపించదు. కానీ గోళ్ళు అందంగా తళతళలాడుతూ వుంటాయి. ఇదే ఈ రకం నైల్ పాలీష్‌లోని ప్రత్యేకత.

దీనిని కూడా సులభంగానే తయారు చేయవచ్చును. ఇది తయారు చేయడానికి గ్రెయిన్ ఆల్కహాల్ (Grain alcohol) ఆరు అవున్సులు (సుమారు 180 గ్రా), టార్టారిక్ ఆమ్లము (Tartaric acid) రెండు డ్రాములు (సుమారు అయిదు గ్రాములు), టించర్ మిర్ర్ (Tincture myrrh) రెండు డ్రాములు కావాలి.

ముందుగా గ్రెయిన్ ఆల్కహాల్‌ను ఒక సీసాలోకి తీసుకోవాలి. దానిలోకి టార్టారిక్ ఆమ్లమును, టించర్ మిర్ర్‌ను వేసి సీసాతోనే కలుపుతూ కరిగించాలి. ఈ మిశ్రమం మొత్తం బాగా కలిశాక కార్కుపెట్టి వుంచేయాలి. ఈ మిశ్రమమే రంగు లేని నైల్‌పాలీష్. ఈ పాలీష్‌ను గోళ్ళకు వేసుకునే ముందు గోరు వెచ్చని నీటితో గోళ్ళను తడిపి, ఆ తర్వాత పాలీష్ వేసుకోవ్వాలి. కావాలనుకున్న వాళ్ళు ఈ పాలీష్ వేసుకున్నాక దానిపైనే రంగు పాలీష్‌ను కూడా వేసుకోవచ్చును.

—గార్ల సరస్వతి

### జంటగా వుంటేనే హాయి!

ఈ మధ్య అమెరికా జీవిత భీమా సమాఖ్య ఒక సర్వే జరిపింది. అసలు వివాహం చేసుకోవడం వల్ల కలుగుతున్న లాభాలేమిటా అని. వారి సర్వేలో మరో రెండు కారణాలు (మిగతావి ఏమిటో!) బయటపడ్డాయట. అవేమిటంటే—ఆరోగ్యమూ, జీవిత ప్రమాణం హెచ్చడమునూ.

అమెరికాలో విడాకులు పొందిన చాలామంది మగవారిని (అరవైఐదేళ్ళలోపువాళ్ళనే) అదే వయసుకలిగి, హాయిగా కాపురం జేసుకుంటున్నవారినీ పోల్చి చూశాక—విడాకులు పొంది, ఒంటరితనం అనుభవిస్తున్న వారిలో యితరులకన్న గుండె జబ్బులు, క్యాన్సర్ వ్యాధీ, క్షయవ్యాధి రెట్టింపు వున్నాయట. ఆత్మహత్య చేసుకునే వారి సంఖ్య ఐదు రెట్లు అధికంగా వుందిట. విడాకులు పొందిన స్త్రీలలోనూ యిదేవిధంగా వుందట.

ఇందువల్ల తెలుస్తున్నదేమిటంటే ఒంటరితనం భౌతికంగానూ, మానసికంగానూ మనిషిని దెబ్బ తీస్తుంది. అందువల్లనే ఏమో మన పెద్దలు—'శీఘ్రమే కళ్యాణ ప్రాప్తిరస్తు' అని అంటారు మరి!

# బామ్మగారి పేజీ



వసు—

నేను రాస్తున్న పెళ్ళి మంత్రాల విషయాలు చదువుతున్నారు గదర్రా. అదే, చదువుతున్నారెండి-మీరు రాస్తున్న ఉత్తరాలవల్ల నాకూ తెలుస్తోంది.

ఐందా—

ఎంతవరకూ చెప్పాను?—

జ్ఞాపకం వచ్చింది-తలంబ్రాలు పోసుకోడం.

హోమం చేసేటప్పుడు వరుడు, వధువు కుడి చెయ్యి పట్టుకుంటాడు. ఒకవేళ, పొరపాటున వదిలేస్తే ఇద్దరూ దూరమైపోకుండా, ఆ దంపతుల కొంగుల్ని కూడా ముడి వేస్తారు. దాన్నే 'బ్రహ్మ ముడి' అంటారు; అదే బ్రహ్మగ్రంథి. బ్రహ్మ అంటే పురోహితుడు. ఆ ముడులు పురోహితుడు వేస్తాడు గనక, అది బ్రహ్మముడి అయిందన్న మాట!

మరి, వరుడు వధువును అగ్ని దగ్గరకు తీసుకొచ్చి ఏమంటాడో తెలుసా?—"పూషా త్వేతో నయతు హస్త...." అన్న మంత్రం చెబుతాడు. అంటే, "ఓ అమ్మాయీ! సూర్యుడు నీ చేతులు పట్టుకుని, ఇక్కడి నుంచి అగ్ని సన్నిధికి తీసుకుని వచ్చుగాక! హోమం అయిన తర్వాత నిన్ను మా యింటికి బండి మీద తీసుకువెళ్తాను. అశ్వినీ దేవతలు అనుమతి ఇస్తారు. నువ్వు మా యింటికి ఆధిపత్యం వహించాలి." అని.

కన్యక పుట్టగానే సోముడు కొంతకాలం, గంధర్వుడు కొంతకాలం, అగ్ని కొంతకాలం కన్యకను కాపాడుతారు. అంచేత వాళ్ళు ఆమెకు 'పతులు'గా భావింపబడ్డారు. హోమం చేతా ప్రార్థనలచేతా వాళ్ళను సంతృప్తులను చేసి, వారి వల్ల తాను కన్యకను పొంది, మనిషి 'భర్త' అవుతాడు. అందుకని "సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిధ ఉత్తరః...." అని మంత్రం చెబుతారు. కన్యకను ఉద్దేశించి చెప్పే ఆ మంత్రార్థం—"సోముడు నిన్ను పొందడం చేత అతను ప్రథమపతి. రెండవవాడు గంధర్వుడు. అగ్ని మూడవవాడు. మనుష్యుడినైన నేను నాలుగోవాడిని. సోముడు నిన్ను గంధర్వుడికిచ్చాడు. గంధర్వుడు అగ్నికిచ్చాడు. అగ్ని-నిన్ను, ధనకనకాలనూ నాకు ఇచ్చుగాక!"

ఈ మంత్రం ఉచ్చరించిన తర్వాత, వరుడు కన్యక కుడిచెయ్యి పట్టుకుంటాడు. ఇదే 'పాణిగ్రహణం'. అలా, మంత్రం చెప్పి ఆమెను గ్రహించడమే వివాహం చేసుకోడం-దాని అర్థమే పాణిగ్రహణం.

ఇక్కడ "గృభ్ణామితే సుప్రజాస్త్వాయ....": "తేహ పూర్వే జనాసో....": "సరస్వతి ప్రేదమవ సుభగే వాజినీవతి ...": "య ఏతి ప్రదిశ స్సర్వాదిశోమ సవమానః...." అన్న నాలుగు మంత్రాలు చెబుతారు.

వీటి అర్థం ఏమిటంటే—

"ఓ కన్యకా! నీ చేతిని పట్టుకుంటున్నాను. ఎందుకనంటే, మంచి సంతతి పొందడానికి. ప్రజ్ఞావంతులైన భగుడు, అర్యముడు, సవిత—అన్న ముగ్గురు దేవతలు నేను గృహస్థ ధర్మాలు నిర్వర్తించడానికి నిన్ను నాకు ఇచ్చారు. నువ్వు నాతో వార్ధక్యం వచ్చేవరకూ కలిసి వుండు. అంతవరకూ మనం విడిపోకుండా, కలిసి వుండాలి. ఆ దేవతలు ఆదికాలంలో వివాహం చేసుకుని, గృహస్థ ధర్మాలు నడిపిన వారు. వాళ్ళలో అగ్ని మొదటివాడు. వారు నడిపించిన గృహస్థ ధర్మాలనే నేనూ నడిపించాలని నిన్ను నాకు ఇచ్చారు. అందుకని నీ చేతిని నేను పరిగ్రహిస్తున్నాను. ఓ సరస్వతీదేవీ! ఈ పాణిగ్రహణాన్ని ఆశీర్వదించు. అన్నసమృద్ధిగల దానివి. నిన్ను స్తుతిస్తున్నాము. భక్తులకు ఇవ్వడానికి బంగారాన్ని చేతిలో పట్టుకుని, సర్వ దిక్కుల్లోనూ సంచరించేవాడూ, అగ్నికి మిత్రుడూ అయిన వాయువు నిన్ను నా మీద మనసుగల దాన్నిగా చేస్తాడు!" అని.

వివాహంలో జరిగే ముఖ్యమైన మరో కార్యక్రమం-సప్తపది. సప్తపది కాకుండా పెళ్లి పూర్తి కాదు. వివాహసిద్ధికి సప్తపది పరమావధి.

సప్తపది అంటే ఏమిటి? వరుడు వధువును ఏడడుగులు నడిపిస్తాడు. నడిపిస్తూ తన కోరికలు ఏడు వాక్యాల్లో తెలియజేస్తాడు. తర్వాత ఆమెతో తన సఖ్యతను చెప్పి, ఆమె సఖ్యతను ఆశిస్తాడు. జన్మాంతమే కాకుండా, జన్మ జన్మాంతరాలవరకూ సఖ్యతను కుదిర్చేదిగా 'సప్తపది'కి పేరుంది. అందుకనే, సఖ్యతకు పర్యాయపదంగా 'సాప్తపదీనము' అన్న మాట వాడతారు.

హోమానికి ఉత్తరం వైపున కుడి కాలు పెడుతూ, పడమటి దిక్కుగాగాని, ఉత్తరదిక్కుగా గాని వరుడు వధువును నడిపిస్తాడు. ఏడు అడుగులు వేస్తూ ఒక్కో అడుగుకి ఒక్కో మంత్రం చొప్పున ఏడు మంత్రాలు చెబుతాడు. మొదట-'ఏకమిషే విష్ణుస్త్వాన్వేతు' అంటాడు. "నీకు అన్నసమృద్ధి కలగడానికి విష్ణువు నిన్ను అనుసరించుగాక!" అని. 'ద్వే ఊర్జే విష్ణుస్త్వాన్వేతు' అన్నది రెండో పదం. ఇది బలం కలగడానికి. 'త్రీణివ్రతాయ విష్ణుస్త్వాన్వేతు' అన్న మూడో పదానికి అర్థం-వ్రతం సమృద్ధిగా కలగడానికి. 'చత్వారి మాయో భవాయ విష్ణుస్త్వాన్వేతు' అన్నది నాలుగో మంత్రం. అంటే, సుఖం కలగడానికి. 'పంచ పశుభ్యో' పశు సమృద్ధి కలగడానికి. 'షడ్ర తుభ్యో విష్ణుస్త్వాన్వేతు' అన్న ఆరవ పదానికి అర్థం—ఋతువులు అనుకూలం కావ

దానికి. 'సప్త సప్తభ్యో హోత్రాభ్యో విష్ణుస్త్వాన్వేతు' అన్నది చివరిది. సోమయాగానికి సప్త హోత్రలూ వుండాలి. అందువల్ల యజ్ఞం చేయించ దానికి ముఖ్యులైన ఋత్విక్కులు లభించడానికి, విష్ణుదేవుడు నిన్ను అనుసరించుగాక-అని అర్థం.

తర్వాత చదివే, ''సఖా సప్తపదా భవ సఖాయౌ....'' అన్న శ్లోకానికి అర్థం గమనించండర్రా – 'నాతో ఏడు అడుగులు నడిచి - నాకు సఖివైనావు. మనమిద్దరం సఖులమైనాము. నీ స్నేహాన్నుంచి నేను విడిపోను. నువ్వు కూడా నా చెలిమిని విడవకు. మనం చేసే ప్రతి పనిలోనూ ఇద్దరం కలిసి, ఆలోచించుకుని నిర్ణయిద్దాము. మన యిద్దరికీ ఒకరి మీద ఒకరికి ప్రేమ వుండాలి. మన మనస్సులు కలిసి వుండే విధంగా నేను చేస్తాను. నువ్వు ఋగ్వేదం వంటి దానివి. నేను సామవేదంవంటి వాడిని. (అంటే, ఆ వేదాలు రెండూ పరస్పర సంబంధం గలవి. అలాగే, మనమూ పరస్పర సంబంధం కలిగిన వారం – అని.) నువ్వు భూమివి. నేను ఆకాశాన్ని. నేను మనస్సు. నువ్వు వాక్కు. పై వాటికిగల అనుకూల్యం మనకి కూడా కలుగుగాక! పుత్రునీ, ఐశ్వర్యాన్నీ పొందడానికి, ఓ ప్రియభాషిణీ - నాతో రా!'

చూశారా! ఇలాంటి అర్థాలుగల మంత్రాలు చదువుతారన్న మాట - వివాహంలో. మరి, మళ్లీసారి తక్కిన విషయాలు కూడా చెబుతాను.

## ప్రశ్నలకు జవాబులు

**జి. భ్రమరాంబ, కాకినాడ**

బామ్మగారూ! వైధవ్యం పొందిన స్త్రీకి జుట్టు, అలంకారాలు తీసెయ్యడం అన్న విధానం ఎలా వచ్చింది? ఇప్పటికీ అది మానడంలేదు ఎందుకని?

స్త్రీకి శీలానికి మించినదేదీ లేదన్న నమ్మకం అనాదిగా వుంది; నేటికీ వుంది. ఎలాటి పరిస్థితుల్లోనూ స్త్రీ తన శీలాన్ని బలి చెయ్యలేదు; చెయ్యదు అని గదా. అందువల్ల భర్త పోయిన తర్వాత ఆమె అందవిహీనంగా వుంటే, ఆమె శీలానికి ముప్పురాదన్న నమ్మకంతో పెద్దవాళ్ళు అలా కొన్ని నియమాలు పెట్టేశారు. పైగా తాను కూడా అటువంటి వాంఛలు కలిగి వుండకూడదన్న ఉద్దేశంతో తిండిలోనూ, తక్కిన విషయాల్లోనూ కూడా మరికొన్ని నియమాలు ఏర్పాటు చేశారు. భర్తపోయిన స్త్రీని ఎందుకూ కొరగాని దానిలాగా రూపొందించారు. నిజానికి ఇది గర్హించవలసిన విధానమే. కాని, ఆ రోజుల్లో ఎవరైనా మాట ఎత్తగలరా? పైగా మూఢ విశ్వాసాలు కొన్ని. మరి, రానురాను సాంఘిక వ్యవస్థలో మార్పులు వస్తున్నాయి. సంఘ సంస్కర్తలు విషయాలను వివరిస్తున్నారు. స్త్రీ కూడా మనిషేనన్న భావనలు అందరికీ కలుగుతున్నాయి. ఇప్పటికీ—భర్తపోతే, అలంకారాలు అవీ తీసేస్తున్నారు గాని – జుట్టు తీయించడం అన్నది బాగానే తగ్గిపోయింది. అలంకారాలూ అవీ తీసేసుకున్నా, ఇదివరకులా కాకుండా భర్తపోయిన స్త్రీలు ఇవాళ, ఉద్యోగాలు చేసుకుంటున్నారు; కొందరు తిరిగి వివాహాలూ చేసుకుంటున్నారు.

**ఆర్. కామేశ్వరమ్మ, బరంపురం**

బామ్మాజీ! నాకో సందేహం కలిగింది. భృగువు అనబడే మహర్షి సప్త మహా ఋషులలో ఒకరా? కాదా? నా ఉద్దేశం అవును అనే. కాని ఒకరు కాదంటున్నారు. సప్తఋషుల పేర్లు చెబుతారా?

సప్త మహర్షుల్లో భృగువు పేరు లేదమ్మా. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు-సప్తర్షులుగా కొన్ని గ్రంథాలు పేర్కొంటున్నాయి. అయితే, ఇందులోనూ కొంత తేడా కనిపిస్తోంది. మరొక క్రమంలో-మరీచి, అత్రి, అంగీరుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు అని కూడా చెబుతారు. అయితే, మామూలుగా చెప్పుకునేది మాత్రం—పైన చెప్పిన క్రమమే.

**జి. వి. రాఘవకుమారి, నిడదవోలు**

బామ్మగారూ! రాత్రివేళల్లో గోడల మీద నీడలు (దీపం వెల్తురువల్ల) పడితే, పిల్లలు చూడకూడదంటారు. కాని, స్కూళ్ళలో మాత్రం చేతివేళ్ళతో గోడల మీద నీడల బొమ్మలు వెయ్యడం అవీ నేర్పుతున్నారు. మరి పెద్దల మాట ప్రకారం నీడ చూడకపోవడమా? గురువుల మాట ప్రకారం నీడ చూడాలా?

'పిల్లలు నీడ చూడకూడదు' అన్నదానికి కారణం వుందమ్మా. వెల్తురు దూరాన్నిబట్టి నీడ పొడుగులు, వెడల్పులూ మారుతూ వుంటాయి గదా—ఒక్కోసారి అవి భయంకరంగా కూడా కనిపిస్తాయి. 'నీడ చూసి దడుసుకోడం' అన్నది అలాగే వచ్చింది. అలాంటి భయంకరమైన నీడల్ని చూసినప్పుడు, పిల్లలు దడుసుకుంటారు. రాత్రి పడుకునేటప్పుడు, అదే వాళ్ళ బుర్రలో వుంటుంది. అవి వాళ్ళ మెదడులో దుష్ఫలితాలు కలిగిస్తాయి. ఆ పరిణామాల వల్ల ఏవేవో కలలు రావచ్చు; భయాలూ కలగవచ్చు. అందుకనే 'నీడ చూడరాదు' అన్నారు. అయితే, ఇవాళ దాన్ని 'మూఢ నమ్మకం' కింద కొట్టి పారేసినా, అందులో కొంత నిజం లేకపోలేదు. చేతి వేళ్ళతో నీడ బొమ్మలు వెయ్యడం అంటారా – అంత వరకూ ఫర్వాలేదు గదా - అయినా, ఇవాళ అన్నిచోట్లా, అందరిళ్ళలోనూ పెద్ద దీపాలొచ్చేసిన తర్వాత, నీడలు అంత భయంకరంగా కనిపించడం లేదు లెండి....



గుండెపోటు వున్నవారు, హైబ్లడ్ ప్రెషర్ వున్నవాళ్ళు ప్రొద్దున్నే పరగడుపున రెండు వెల్లుల్లిపాయలు తొక్కతీసి మెత్తగా చితకకొట్టి తింటే నెల రోజులలో గుణం కనబడుతుంది. —సుసర్ల జయారావు

**రాధికా చంద్రమూర్తి, అహ్మదాబాదు**

పసిపిల్లలకి సంవత్సరం వచ్చేవరకూ దువ్వెనతో తల దువ్వకూడదు అంటారు. ఎందువల్లనండీ?

పసి పిల్లల తల పై భాగం చాలా లేతగా వుంటుంది. దువ్వితే దువ్వెన పళ్ళు ఏ మాత్రం గట్టిగా పడినా, అక్కడి మృదువైన చర్మం చీరుకోవచ్చును. ఇంకోటి కూడా వుంది—ఇంట్లో అందరూ ఉపయోగించే దువ్వెనలని పిల్లలకి ఉపయోగించడం ఆరోగ్యరీత్యా కూడా మంచిది కాదు గదా!

**ఆర్. నాగశిరోమణి, బెంగళూరు**

ఆ మధ్య లాల్‌బాగ్‌లో బోన్‌సాయ్ పద్ధతిలో కొన్ని చెట్లు పెట్టారు. అవి చాలా బాగున్నాయి. మాకు కూడా బోన్‌సాయ్ పద్ధతిలో చెట్లు పెడదామని వుంది. అందుకు మీ సలహా కోరుతున్నాము.

బెంగళూరులో దొరుకుతాయి. లాల్‌బాగ్ నర్సరీలోనేకాక అక్కడి యితర నర్సరీలలో కూడా లభిస్తాయి. బోన్‌సాయ్ కళ మీద చాలా పుస్తకాలు అమ్ముతున్నారు. అవి చదివి దాని ప్రకారం చేసినట్లయితే మనం చేసినా ఆ చెట్లు బ్రతుకుతాయి. పైగా అదేమీ బ్రహ్మ విద్యకాదు. కాకపోతే టైం ఎక్కువగా పడుతుంది. అంటే పది–పదిహేను సంవత్సరాల దాకా పడుతుందన్నమాట. సరదా వున్న వాళ్ళయితే ఆ పుస్తకాలు కొని ప్రయత్నించండి. ఆ విధంగా అన్ని చెట్లూ చెయ్యవచ్చు.

**ఆర్. రజనీరెడ్డి, కోరగుంటపల్లె**

మా పెరటిలో చిన్న ఉసిరి చెట్టు సంవత్సరం క్రితం వేశాము. బాగా పెరుగుతున్నది. ఆ చెట్టు ఎప్పుడు కాపుకు వస్తుంది? దానికి తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటో తెలియజేస్తారా?

ఉసిరిచెట్టు కాపుకురావడానికి మూడు, నాలుగేళ్ళు పడుతుంది. తీసుకోవలసిన జాగ్రత్తలు అంటూ ప్రత్యేకంగా ఏవీ లేవు. ఎరువు బాగా వెయ్యాలి అంతే.

**ఎస్. రాజేశ్వరి, వెల్లూరు**

మా ఇంట్లో ముద్దమందార (దాసాని) చెట్టు పువ్వులు మొగ్గలు గానే రాలిపోతున్నాయి. పై పెచ్చు ఈ మధ్య చెట్టు కొమ్మల మీద ఒక రకం గ్రుడ్లు వచ్చాయి. అది, చెట్టుకు అమ్మవారు లాంటిదని ఎవరో అన్నారు. నిజమా? అలా అయితే అది పోగొట్టడం ఎలా? మందార చెట్టుకు ఏ ఎరువు వెయ్యాలో చెబుతారా?

అమ్మవారు కాదుగానీ 'ఫంగస్' అని అది ఒక విధమైన తెగులు. అంచేత ఆ చెట్టు కొమ్మ భాగం కానీ గ్రుడ్లు పట్టి వున్న ఆకు గానీ తీసుకువెళ్ళి మీకు సమీపంలో గల వ్యవసాయశాఖవారికి చూపించండి. దానిని వారు పరీక్షించి ఆ తెగులు నివారణకి తగిన మందు యిస్తారు. ఇక మందారచెట్టు బాగా పెరగడానికి తగిన ఎరువు అంటారా – బాగా మగ్గిన పశుపెంట, ఎర్రమన్ను, ఏటి ఇసుక వేస్తే చాలు.

**సిహెచ్. సూర్యకాంతం, భద్రాచలం**

మా పెరటిలోని బాదం చెట్టు మూడు సంవత్సరాల నుంచి పూత పూస్తున్నది. కాని పూత నిలవకుండా రాలిపోతోంది. ఎరువు, నీటికొరత లేదు. మరెందుకని పూత రాలిపోతోందో చెబుతారా?

పూత రాలిపోతోందంటే అందుకు కారణం బలం లేకపోవడం. ఎరువు, నీరు బాగానే వున్నాయని మీరంటున్నారు. కాని అవి చెట్టు వేళ్ళవరకూ అందుతున్నాయా లేదా అన్నది మీరు గమనించడం లేదు. చెట్టుకి ఊరికే ఎరువు వేసి, నీరు పోసినంత మాత్రాన చాలదు. చెట్టు చుట్టూ రింగ్‌లా తవ్వి ఎరువు వెయ్యాలి. బాదం చెట్టుకి పశుపెంట శ్రేష్ఠమైన ఎరువు. ఆ తరువాత నీరు పోశారంటే పూత రాలిపోదు. చెట్టు బాగా కాస్తుంది.

**ఆర్. వి. శేషకుమారి, సత్తుపల్లి**

మా ఇంట్లో చేమంతి చెట్లు వున్నాయి. బాగా మొగ్గలు వేస్తున్నాయి. ఐతే పువ్వులు సరిగ్గా విచ్చుకోవడం లేదు. కారణం ఏమిటో తెలియజేస్తారా?

చేమంతి సీజనల్ (Seasonal) జాతికి చెందినది. పాత మొక్కని పీకిపారేసి దాని చుట్టూ వుండే పిలక మొక్కలను చిన్న చిన్న తొట్లలో వెయ్యాలి. అవి కొద్దిగా పెద్దవయ్యాక యింకా స్త పెద్ద తొట్టెలలోకి మార్చి పశుపెంట తగినంత వెయ్యాలి. అప్పుడు అవి ఏపుగా ఎదుగుతాయి. చక్కటి పువ్వులు పూస్తాయి. అప్పుడిక దానికి పూతగా

---

### కూరలు – పోషకపదార్థాలు

కాకరకాయ:

ఇది తీగజాతికి చెందినది. దీని ఆకులు అరచేతి వేళ్ళలా వుంటాయి. కాకరకాయలలో రెండు రకాలు వున్నాయి. పొట్టివి, పొడుగువి. కొన్ని తెల్లగానూ, కొన్ని ఆకుపచ్చగానూ వుంటాయి.

ప్రతి 100 గ్రాముల కాకరకాయలోనూ–92.4 గ్రాముల తేమ, 1.6 గ్రా॥ ప్రొటీన్లు, 0.2 గ్రా॥ కొవ్వుపదార్థం, 0.8 గ్రా॥ ఖనిజపదార్థం, 0.8 నార, 4.2 గ్రా॥ పిండిపదార్థం, 0.02 గ్రా॥



కాల్షియం, 0.07 గ్రా॥ భాస్వరం, 1.8 మిల్లిగ్రాముల ఇనుము, 210 యునిట్ల విటమిన్ ఏ, 88 మిల్లి గ్రా॥ విటమిన్ సి, 0.5 మి. గ్రా॥ నికోటినిక్ ఆమ్లమూ వున్నాయి. వీటి కెలోరీ విలువ–25.

కాకరకాయ పిండి బెల్లం పెట్టి వండితే రుచిగా వుంటుంది. కాకరకాయ సన్నగా ముక్కలుగా తరిగి ఉప్పు వేసి నూనెలో వేయించి కారం జల్లి చేసుకున్న కూర నోటికి హితవుగా వుంటుంది. ఉల్లికారం కూరి చేసుకున్న కూర కూడా చాలా రుచిగా వుంటుంది. కొందరు కాకరకాయతో పులుసు కూడా చేసుకుంటారు.

కాకరకాయ సాధారణంగా చేదుగా వుంటుంది. ఐతే యిందులో తీపిగా వుండే కాయ పథ్యానికి వుపయోగపడుతుంది. కఫవాతాన్ని హరింపజేస్తుంది. కాకర వేడి చేస్తుంది. కాకరాకు ఎండబెట్టి చిక్కగా పులుసు కాచుకుని త్రాగితే క్రిములు నశిస్తాయి. పిత్తం హరిస్తుంది. కాకరతీగ, పండు, గింజలు కూడా క్రిములను పోగొడతాయి. కాకర వీర్యనష్టాన్ని కలిగిస్తుంది. ఐతే కాకరపండు రసాయనద్రవ్యం, బలాన్ని కలిగిస్తుంది–అని చెబుతుంది ఆయుర్వేద శాస్త్రం.



# పెరటితోట పెంపకం

**-లలితకుమారి**

వెదురుబద్దలను కట్టడం గానీ, లేక తొట్టెల లోంచి తీసి భూమిలోకి నాటడం గానీ చేయవచ్చు.

**ఐ. బేబి ఉషాకుమారి, పాతపట్నం**

మేము పూల కుండీలలో తెల్లచామంతి మొక్క వేశాము. ఇప్పుడు పూత పూస్తోంది. కాని పువ్వు లోపల నలుపు బూడిద పడినట్లు అవుతోంది. కారణమేమిటి?

ఆఫిస్ (Afis) అని ఒక రకమైన ఫంగస్ వుంది. బహుశ మీ చెట్టుకి ఆ ఫంగస్ పట్టి వుంటుంది ఒక పువ్వు తీసుకువెళ్ళి మీకు సమీపంలో గల వ్యవసాయ శాఖవారికి చూపించండి. వారు పరిశీలించి తగిన మందు యిస్తారు.

**ఎమ్. పద్మావతి, సంపర**

మా తోటలో మేము లిల్లి, చేమంతి, కనకాంబరం, గులాబి, టెంకిస్ చెట్లు వేశాము. అన్ని బాగానే వున్నాయి. కాని కనకాంబరం మొక్కలకి మాత్రం ఆకు ముడతపురుగులు పట్టాయి. ఇవి క్రమక్రమంగా మొగ్గలని, పువ్వులని కూడా తొలిచివేస్తున్నాయి. ఈ క్రిమినివారణకు ఉపాయమేదైనా వుంటే చెబుతారా?

అది ఒక విధమైన ఫంగస్‌వల్ల ఏర్పడు తుంది. దీని నివారణకి మెలతియాన్ (Melathian) అనే మందు వుంది. అది కొని, అందులో యిచ్చిన సూచనల ప్రకారం తగినన్నిపాళ్ళు నీరు కలిపి చెట్టుకు వేస్తే పురుగు పోతుంది. చెట్టు కళకళలాడుతుంది.

**జి. సుధారాణి, కొల్లూరు**

మా ఇంట్లో రెండు మల్లి అంట్లు నాటాము. ఆరు నెలలవుతున్నా మొగ్గ తొడగడం లేదు. ఎరువు, నీరు బాగానే వున్నాయి. కాని మొగ్గ రాకపోవడానికి కారణమేమిటో తెలియజేస్తారా?

మల్లెపూవుల్లో చాలా రకాలు వున్నాయి. వాటి వెరైటీనిబట్టీ అవి మొగ్గ తొడగడం ఆధార పడి వుంటుంది. ఉదాహరణకి మధుర, పూందమల్లి ప్రాంతాలలోని మల్లెలు అక్కడ తప్పితే మరో వూర్లో సరిగ్గా పూతపుయ్యవు. మల్లెలలో కొన్ని గొడ్డు మల్లెలు కూడా వున్నాయి. ఇవి అసలు పుయ్యవు. అంచేత మీరు ఏ వెరైటీకి చెందిన మల్లె అంటు వేశారో తెలుసుకోకుండా చెప్పడం కష్టం. ఐనా, మరి కాస్త ఎరువు వేసి ప్రయత్నించి చూడండి.

**బి. భాగ్యలక్ష్మి, రామాపురం**

మా పెరటిలో మనోరంజని చెట్లు అంట్లు తెచ్చి వేశాము. నాలుగైదు సంవత్సరాల నుంచి ప్రయత్నిస్తున్నాం గానీ ఒక్క అంటు కూడా పెరగక చిగురు దశలోనే ఎండిపోతోంది. ఐతే మా బావి దగ్గర మనోరంజనం చెట్టు మాత్రం ఏపుగా ఎదిగి పువ్వులు పూస్తోంది. ఇంటి దగ్గర ఆ చెట్టు వుండాలన్న మా ప్రయత్నం మాత్రం ఫలించడం లేదు. కాబట్టి ఏం చెయ్యాలో-ఏ విధంగా ఆ చెట్టు నాటితే బతుకుతుందో తెలియజేస్తారా?

చాలామంది చెట్లు నాటేటప్పుడు ఒక పొర పాటు చేస్తూ వుంటారు. బహుశ మీరూ అటువంటి పొరపాటే చేసి వుంటారు. చిన్న చెట్టుకదా అని మామూలుగా గొయ్యి తీసి అందులో చెట్టు నాటి వుంటారు. కాని అలా చెయ్యకూడదు. చెట్టు వేసేటప్పుడు గొయ్యి పెద్దదిగా వుండాలి. అప్పుడే ఎరువు, నీరు వేళ్ళకంటా చేరుతుంది. మనోరంజనం చెట్టు పాదు రకానికి చెందినది. కాబట్టి దానికి ఊతగా వెదురుకర్రలు కట్టాలి. తగిన ఆధారం లేకపోతే చెట్టు నేలపాలవుతుంది. ఈ సూచనలను అనుసరిస్తూ ఈసారి చెట్టు నాటండి. తప్పకుండా చెట్టు బతికి పువ్వులు పూస్తుంది.

**కస్తూరి సకుల్కర్, బెల్లంపల్లి**

మా పెరట్లో కరివేపాకు చెట్లు నాటితే రావడం లేదు. ఎన్నిసార్లు నాటినా చెట్టు చచ్చిపోవడమో, ఆకులు రాలిపోవడమూ, ఎండు పుల్లలు మిగలడమూ జరుగుతోంది. తోట్లో కూడా నాటి చూశాము. అందులోనూ రాలేదు. ఎందుచేత?

కరివేపాకు చెట్టు ఎక్కడ పడితే అక్కడే పెరుగుతుంది. అటువంటిది మీ పెరటిలో పెరగలేదంటే ఆశ్చర్యంగానే వుంది. చెట్టు నాటేటప్పుడు తగిన జాగ్రత్తలు తీసుకుని వుండరు. పైన చెప్పినట్లుగానే చిన్న చెట్టు కదా చిన్న గొయ్యి చాల్లే అని వూరుకుని వుంటారు. ఈ చెట్లన్నింటికీ 'పిట్ట కొంచెమూ - కూత ఘనము' అనే సామెత చక్కగా వర్తిస్తుంది. చిన్న చెట్టయినా పెద్ద గొయ్యి కావాలి. కాబట్టి ఈసారి అడుగు నిలువున వలయాకారంగా పెద్ద గొయ్యి తీసి అందులో కరివేపాకు చెట్టును నాటండి. తగిన ఎరువు, నీరు చేరిస్తే అప్పుడు చెట్టు బాగా పెరుగుతుంది.

**పి. రాణి, రొంపిచెర్ల**

మా ఇంట్లో కుండీలో కనకాంబరం చెట్టు వేశాము. దాని మొదలు దగ్గర ఎర్రచీమలుపట్టి క్రమక్రమంగా చెట్టు అంతా పాకాయి. పైపెచ్చు చెట్టుకి ఎర్రచీడ పట్టింది. గమాక్సిన్ పౌడర్ చల్లినా చీడ వదల కుండా గ్రుడ్లతో అలాగే వుంది. అవి పోవాలంటే ఏం చెయ్యాలో చెబుతారా?

ఆఫిస్ అనే చీడపురుగు వుంది. మీ చెట్టుకు పట్టిన చీడ అదే. ఆ పురుగు యొక్క మలము తీపి రుచికలిగి వుంటుంది. అది తినడానికే చీమలు వస్తాయి. ఈ చీడపురుగు పట్టిన మేర తెల్లగా బూజు పట్టినట్లుంటుంది. కొద్దిగా పట్టినట్లయితే ఆ మేర మెలతియాన్ మందు చల్లితే పోతుంది. మరీ ఎక్కువగా వున్నట్లయితే ఆ కొమ్మ కొట్టేసి కాల్చేయ్యాలి. దానికదే మందు. □

సశేష నవల

# కృష్ణవేణి

విమలారామం

"ఈ దేశంలో ఇలాంటి వాటికి జైలుశిక్షలు వేసే చట్టాలు లేవురా! అందుకనే నీలాంటి దౌర్భాగ్యులంతా పెళ్ళాల ప్రాణాలిలా తీస్తున్నారు!" అన్నాడు పురుషోత్తం కటువుగా.

"ఏ చట్టాలూ అక్కర్లేదు. ఎవ్వరూ నా మీద రిపోర్టు చెయ్యనక్కర్లేదు. నా పెళ్ళాం హాస్పిటలు పాలవటానికి నేనే కారకుడ్ని. నా నేరం నేనే ఒప్పుకుంటున్నాను. నాకు నేనే శిక్ష విధించుకుంటాను." అంటూ విసురుగా లేచి గోడకి తల పెట్టి దబదబా కొట్టుకోవటం మొదలు పెట్టాడు విశ్వనాధం.

ఈ హఠాత్పరిణామానికి పురుషోత్తం నిర్ఘాంతపోయాడు. అతను తేరుకొని విశ్వనాధాన్ని అవతలకి లాక్కువెళ్ళేసరికి అప్పటికే అతని నుదురు చిట్లి రక్తం చివ్వున చిమ్మింది. రాత్రి నిర్మలతో ఘర్షణ పడినప్పుడు తూలి గడప మీద పడిపోయాడు. ఆ గాయం మీదనే మళ్ళీ దెబ్బ తగిలింది. ఆ రక్తధార చూసి పురుషోత్తం కంగారు పడిపోయాడు.

"ఎంత పని చేసావు విశ్వం!" అన్నాడు అతని గాయాన్ని గుడ్డతో ఒత్తిపట్టి.

విశ్వనాధం పెదవులు కొరుక్కుంటూ బాధని నిగ్రహించుకుంటున్నాడు. అతన్ని లేవదీసి కుర్చీలో కూర్చోపెట్టి గాయాన్ని కడిగి కట్టుకట్టాడు పురుషోత్తం. "వెరీసారీ విశ్వం! తొందరపడి ఏవో మాటలన్నాను. నువ్వు మనస్సులో పడుతున్న బాధని గ్రహించలేకపోయాను."

"నేను చేసిన పాపానికి నాకీ శిక్ష సరిపోదు." అన్నాడు విశ్వనాధం పళ్ళు బిగపట్టి బాధని ఓర్చుకోటానికి ప్రయత్నిస్తూ.

అతని బుగ్గల మీద జలజల కారుతున్న కన్నీటిని చూసి సంచలించిపోయాడు పురుషోత్తం. అతని కళ్ళు కూడా చెమర్చాయి. చటుక్కున స్నేహితుడి చేయి పట్టుకుని "డాక్టరు దగ్గరికి వెడదాంరా!" అన్నాడు.

"వద్దు. నాకు మందులు వేయకూడదు. నేను కృష్ణని ఎన్ని బాధలు పెట్టానో ఎన్ని రకాల చిత్రహింసలు పెట్టానో అన్నీ నేను అనుభవించాలి! నా ఒళ్ళంతా రక్తం ధారలుకట్టాలి. గాయాలతో నేను కుళ్ళికుళ్ళి చావాలి!"

"ఊర్కో విశ్వం!"

"అందర్కీ అన్యాయం చేసాను. అందర్నీ చేతులారా దూరం చేసుకున్నాను. నేను చస్తే"

"ఛ! ఏమిటా మాటలు! మీవాళ్ళంతా నిన్ను నువ్వు సంస్కరించుకోవాలని ఆశించారే కాని నిందించుకోవాలని హింసించుకోవాలని కాదు. జరిగిందంతా మర్చిపో. జరగవల్సింది ముందు చూడు."

"ఇంకేం చూడమంటావు? ఏ ముఖం పెట్టుకొని కృష్ణ దగ్గరికి వెళ్ళను? ఇంతకాలం ప్రాణాలు తీసి యిప్పుడు క్షమాపణ అడగనా! నేనిప్పుడు వెడితే నా ముఖాన అంతా ఉమ్మేస్తార్రా!"

"ఎంత పిచ్చివాడివిరా! అక్కడ నిన్ను అభిమానించేవాళ్ళే కాని అవమానించేవాళ్ళెవరూ లేరు. నీలో మార్పు రావాలని ఆశించినవాళ్ళే కాని నిన్ను చీదరించుకునేవాళ్ళెవరూ లేరు. నువ్విప్పుడు కళ్ళబడితే కృష్ణవేణి నిజంగా ఎంతో సంతోషిస్తుంది!"

"కృష్ణ నన్ను క్షమిస్తుందా?"

"జరిగిపోయిన దాని గురించి విచారిస్తూ యిక్కడ కూర్చోవటం వల్ల ప్రయోజనం లేదు. ముందామె గండం గడిచి బయటపడాలి. మనమెంత త్వరగా బయలుదేరి వెడితే అంత మంచిది. ఇప్పటికే చాలా ఆలశ్యమయిపోయింది" అని తొందర పెట్టాడు పురుషోత్తం.

నేల మీద గాలికి రెపరెపలాడుతున్న టెలిగ్రామ్ కాగితం అంతకన్న ఎక్కువగా విశ్వనాధాన్ని తొందర పెట్టింది!

## 79

తమ్ముడి కొడుకు బాలసారెకు హైద్రాబాదు వెళ్ళిన విశ్వనాధం మరికొన్నాళ్ళు అక్కడే వుండి వుంటే?



లేక అతనితో కృష్ణవేణి కూడా తిరిగి వచ్చి వుంటే? పోనీ కృష్ణవేణి యిల్లు విడిచి వెళ్ళిం తర్వాతయినా అతని మనసులో సరియైన సంఘర్షణ జరిగి వుంటే? కనీసం, ఆమె ఉత్తరాలకయినా అతని మనసు కరిగి వుంటే? ఆఖరికి కాత్యాయిని ఉత్తరమయినా అతను తెరిచి చదివి వుంటే?

ఇలా ఎన్నో జరగవల్సినవి! కాని, వాటిలో ఏ వొక్కటీ జరగలేదు. అందుకే జరగకూడనివి ఎన్నో జరిగిపోయాయి. ఇక్కడ విశ్వనాథం భార్య మీద కోపంతో మూర్ఖుడై మరింత పతనమై పోయాడు. అక్కడ కృష్ణవేణి ఆరోగ్య పరిస్థితి విషమించిపోయింది.

ఒకోక్కప్పుడు చిన్న చిన్న సంఘటనలే జీవితంలో పెద్ద పెద్ద మార్పులకి దారితీస్తాయి. అనాలోచితంగా చేసిన పనులే అనుకోని పరిణామాలకి కారణభూతమవుతాయి!



మాలతి నిర్మల నవల కొని తేవటం ఎంత ప్రమాదకరమైన మార్పుకి దారి తీసిందో ఆమెకు తెలియదు. అలాగే, నిర్మల అనాలోచితంగా చేసిన మరో పని ఎంత ప్రమాదానికి దారి తీసిందో ఆమెకు తెలియదు!

అన్నగారి మీద మనస్సు విరిగి వదినగార్ని చూడ్డానికి బయలుదేరిన నిర్మల ఆ వేళ తెల్లవారు ఝామున స్టేషనుకు వచ్చినప్పుడు బండికింకా టైముంటే చిన్నన్నగారికో ఉత్తరం వ్రాసి పోస్టు చేసింది. ఆ ఉత్తరం క్లుప్తంగా వుండుంటే ఆ తర్వాత పరిణామాలు అంత విపరీతంగా వుండేవి కావు. కాని, వదినగారికి జరిగిన అన్యాయాన్ని భరించలేని బాధలో అక్కడ తను విన్నది – చూసింది – చేసింది అంతా వ్రాసేసింది. వ్రాసిందేదో మళ్ళీ చదువుకొనే వ్యవధి లేకపోయింది. అయితే, అంత కోపావేశాలలో కూడా ఆమె ఒక ముఖ్యమైన విషయం మర్చిపోలేదు. ఆ ఉత్తరం కళ్ళబడితే తల్లి–తండ్రి–అన్నలు వదినలు తట్టుకోలేరు! అలాగని, ఎవరికీ తెలియకుండ ఎవరి సహాయమూ లేకుండా తాను వదినని హైద్రాబాదు ఎలా తీసుకు వెళ్ళగలుగుతుంది? అన్నీ తెలిసినవాడు – వదినని ఒప్పించగలిగినవాడు చిన్నన్నయ్య ఒక్కడే! అతనికి తెలిస్తే చాలని అతని ఆఫీసు అడ్రసుకి ఉత్తరం వ్రాసింది.... ఈ సంగతులు ఎవ్వరికీ తెలియకుండా అతన్ని రహస్యంగా రమ్మని కూడా వ్రాసింది!

కాని, ఆ వూరు చేరాక – వదినగారి పరిస్థితి చూసాక – ఆమె గుండె లవిసిపోయాయి. ఉత్తరం అంది చిన్నన్నగారు వచ్చేదాకా ఆగలేకపోయింది. ఆ ఉత్తరం ఎప్పటికందుతుందో? కీడు శంకించి కాత్యాయినితో సంప్రదించి తెలిసున్న వాళ్ళింటికి వెళ్ళి అక్కడి నుంచి ట్రంకాల్ చేసింది!

ఫోనులో చెల్లెలు మాటలు ఒకటి రెండు వినేసరికే మురళీమోహన్‌కి షాక్ తగిలినట్టయింది! ఆమె ఏం చెపుతోందో - కూడా అతనికి అర్ధం కాలేదు. అతను స్పృహలోకి వచ్చేసరికి.... అర్ధాంతరంగా కాల్ కట్ అయిపోయింది. అతను ఎక్స్ఛేంజ్‌కి ఫోన్ చేశాడు కాని.... లైన్సు పాడయిపోయాయని జవాబు వచ్చింది! ఆ నెంబరుకి యిటు నుంచి ట్రంకాల్ బుక్ చేసినా ప్రయోజనం లేకపోయింది!

వదిన....ప్రమాదం...ఎవరికి చెప్పద్దు.... వెంటనే బయలుదేరు....అవే మాటలు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి. ఆ కంగారులో చెల్లెలు యిచ్చిన అడ్రసు నోట్ చేసుకోలేదు. మార్గం తోచక వెంటనే రామచంద్రానికి ఫోన్ చేసి రమ్మన్నాడు.

సంగతి విని "ఊరు తెల్సింది. టెలిఫోన్ నెంబరు తెల్సింది. అది చాలు మనకి. వెంటనే బయలుదేరుదాం!...." అన్నాడు రామచంద్రం.

"మళ్ళీ కాల్ వస్తుందేమో!...."

"పోనీ, మీరిక్కడ వెయిట్ చెయ్యండి. నేనింటికి వెళ్ళి మరో జత బట్టలు తెస్తాను. ఎక్కడికో క్యాంపుకి వెడుతున్నారని చెప్పి వస్తాను."

"నాకేం చేయాలో తోచటం లేదు...."

"కంగారు పడకండి. నేను కూడా వస్తానుగా! డబ్బూ అదీ ఎక్కడయినా తీసుకు వస్తాను. ఎందుకయినా మంచిది మా నాన్నగారికి మాత్రం ఈ విషయం చెపుతాను." అని చెప్పి రామచంద్రం వెళ్ళిపోయాడు.

రెండు గంటల తర్వాత అతను తిరిగి వచ్చాడు. తెల్సిన సమాచారం మీదే ఆశ పెట్టుకొని వాళ్ళు ప్రయాణమై వెళ్ళిపోయారు!

అయితే, ఆ మర్నాడు నిర్మల వ్రాసిన ఉత్తరం ఆఫీసులో అందటం ఆమె కలలో కూడ ఊహించని ప్రమాదానికి కారణమైంది. ఆ ఉత్తరం మీద అనాలోచితంగా ఆమె వ్రాసిన 'అర్జంటు' అన్న మాట చూసాడు, మురళీమోహన్ తోటి ఉద్యోగి. మూడురోజులపాటు శెలవుపెట్టి ఏ వూరో మురళి వెళ్ళాడని అతనికి తెలుసు! ఆ ఉత్తరం వెంటనే యింటికి పంపిస్తే యింట్లో వాళ్ళయినా అందులోని ముఖ్యమైన వార్తలు తెల్సుకుంటారన్న ఉద్దేశ్యంతో ఆఫీసు ప్యూనుకి యింటి అడ్రసు చెప్పి ఆ ఉత్తరం యిచ్చి రమ్మన్నాడు అతను!

ఆ వేళ ఉదయం మురళి క్యాంపుకి వెళ్ళాడన్న వార్త రవి ద్వారా తెల్సి చిన్న కోడలిని కూడా తీసుకు వెడదామని పెద్ద కొడుకింటి నుంచి వచ్చాడు సత్యనారాయణగారు. మనవడితో ఆటల్లో పడి వచ్చిన పనే మర్చిపోయాడు ఆయన. వంట ఎలాగా అయిపోయింది కదాని భోజనం చేయమంది మాధవి.

"నువ్వు కూడా పెట్టుకోమ్మా!" అన్నాడాయన.

## ఒంటరిని

కోర్టు ఆవరణలో, న్యాయం
నలిగిపోతున్నప్పుడు
నడిబజార్లో శీలం గుడ్డలు విప్పుకున్నప్పుడు
కల్తీ సరుకుల్తో వ్యాపారం నడుస్తున్నప్పుడు
శ్రామికుల రుధిరాన్ని పెద్దలు
మధువుగా తాగుతున్నప్పుడు
విధిలేక, జాలిగా బేలగా చూస్తున్నాను.
కారణం — నేనొంటరిని
చూస్తొంటే........
ప్రజాసేవయే ధ్యేయంగా
భావిస్తొన్న పెద్దోళ్ళు,
'ప్రజాసేవయే మా కర్తవ్య' మని
కృశ్చన్‌మార్కు మొహంతో
మరోరకం పెద్దోళ్ళు
దారితెలియని రథసారథులు
గోదారి చూపించే నమ్మక ద్రోహులు
అందరి మధ్యా మానవత
నలిగి పుక్కిరిబిక్కిరవుతున్నప్పుడు
మధ్య తరగతి మందహాసం చిందిస్తూ
అన్నీ చూస్తూ నిలుచున్నాను.
కారణం — నేనొంటరిని
అందుకు తోడు....
బ్రతకలేని ఉద్యోగులు కొందరు
గానుగెద్దులా జీవితాన్ని మోస్తూ
చావలేకా — బతకలేకా
చేదు బతుకుల్ని
మింగలేకా....కక్కలేకా
రోజూ ఓ కొత్తనరకాన్ని చవిచూసే
అతుకుల బతుకుల్ని, కార్చాలన్నా
కన్నీరు కరువయిన కళ్ళతో చూస్తూ
బరువైన హృదయంతో బాధగా మూలిగి
నవ్వలేకా — యేడ్వలేకా
లోలోనే లోకాన్ని చదువుకుంటున్నాను.
అయినా — నేనేమి చేయలేను
కారణం — నే నొంటరిని
అవును — నే నొంటరిని!

— కె. మనోహరాదేవి

"ముందు మీరు తినండి. వీడు నన్ను తిననివ్వడు." అని నవ్వి ఆయనకి వడ్డించింది మాధవి.

ఆయన భోజనంచేసి మనవడ్నెత్తుకుని వాకిట్లోకి వచ్చాడు. అప్పుడే ఆఫీసు ప్యూను ఆ ఉత్తరం తెచ్చి సరాసరి ఆయన చేతుల్లో పెట్టాడు!

చిన్నకూతురి చేతివ్రాతని గుర్తుపట్టి సంతోషపడ్డాడు ఆయన. "....మాధవీ! నిర్మల ఉత్తరం వ్రాసిందమ్మా!" అని కేకపెట్టాడు.

తింటున్న అన్నం వదిలి కంగారుగా వచ్చింది మాధవి. కాని, అప్పటికే ఉత్తరం మీద 'అర్జంటు' అన్న మాట చూడటం....ఆయన కవరు చించి ఉత్తరం చదవనారంభించటం జరిగిపోయాయి.

మామగారి ముఖంలో మారుతున్న రంగులు గుర్తించి "ఏమిటండీ? ఏం జరిగింది?" అని భయంగా అడిగింది మాధవి.

ఆమెకు జవాబు చెప్పటానికి ముందే ఆయనకా అఘాతం తగిలిపోయింది! కొడుకు చేస్తున్న ఘోరాన్ని చూడలేక కోడలికి అండగానిల్చిన రోజుల్లోనే ఆయన శారీరకంగా మానసికంగా అలిసిపోయాడు! ఇటీవల కొడుకులు, కూతురు, అల్లుడు అంతా మారి మంచి దారినపడ్డారన్న సంతోషం ఆయనకి కొంత శాంతినిచ్చింది. కొత్త శక్తిని తెచ్చింది. కాని, ఈ దుర్వార్త వాటన్నిటినీ ఒక్కసారిగా హరించివేసింది. "అమ్మా! కృష్ణవేణీ!" అని వెర్రిగా కేకపెట్టి విరుచుకు పడిపోయాడాయన.

అక్కగారి కేమయిందో తెలియక, మామగారికేం జరిగిందో తెలియక, తానిప్పుడేం చేయాలో తెలియక....పిచ్చిదానిలా అరిచింది మాధవి!

పక్కవాటా వాళ్ళు పరుగెత్తుకు వచ్చారు. ఎవరో రామచంద్రం వాళ్ళింటికి కబురంద చేశారు. మరెవరో డాక్టరు కోసం వెళ్ళారు.

సుజాతా రాఘవరావులు వచ్చేసరికి అక్కడ పరిస్థితి హృదయ విదారకంగా వుంది! కృష్ణారావుకి ఫోన్‌లో కబురంది అతను కంగారుగా వచ్చాడు. సత్యనారాయణగారికి 'హార్ట్ అటాక్' వచ్చిందని వెంటనే హాస్పిటలో ఎమర్జెన్సీకి తీసుకు వెళ్ళమని చెప్పాడు డాక్టరు!

ఇలాంటి దారుణ పరిస్థితి ఎందుకు సంభవించింది? జవాబుగా మళ్ళీ అవే ప్రశ్నలు—వస్తాయి. ఎన్నో జరగవలసినవి జరగనప్పుడు జరగకూడనివి కొన్ని జరిగి పోతుంటాయి!

దీని కంతకీ మూల కారకుడు తనేనని విశ్వ

నాధానికి తెలియదు! తన ఉత్తరం కొంత కారణమయిందని నిర్మలకి తెలియదు!.... అలాంటి ప్రమాదమైన వార్త ఆ ఉత్తరంలో ఉందని పంపిన మురళితోటి ఉద్యోగికి తెలియదు. తెచ్చిచ్చిన ప్యూనుకి తెలియదు!....

## 80

"అమ్మా! మనమిక్కడున్నామని నాన్నగారు కనిపెట్టేసారు. మనం ఓడిపోయినట్టేనా?" అని అడిగాడు నారాయణ. ఆ కుర్రాడి మాటలు ఆమెకు తప్ప ఎవ్వరికీ అర్థం కాలేదు.

విశ్వనాధాన్ని చూస్తూనే కృష్ణవేణి ముఖం పుచ్చపువ్వులా విచ్చుకుంది.

"మీ అమ్మే గెల్చిందిరా! నేనే ఓడిపోయాను" తండ్రి మాట అర్థం కాక, తల్లి చూపుల కర్థం తెలియక తెల్లబోయి చూశాడు కొడుకు.

మారిన విశ్వనాధాన్ని వెంటనే గుర్తించింది కృష్ణవేణి. మమతానురాగాలు నిండిన కళ్ళతో దగ్గరికి రమ్మని సంజ్ఞ చేసింది. ఆమె ముఖంలో దరహాస చంద్రిక మెరిసింది ఒక్క క్షణమే! అంతలో అతని తలకున్న కట్టు చూసి ఆందోళన పడింది. ఏదో అడగాలని నోరు తెరిచింది. కాని ఆయాసంతో ఆమెకు ఊపిరి సలపలేదు.

పురుషోత్తం గ్రహించి దగ్గరగా వచ్చాడు. ఏదో చిన్న ఆక్సిడెంట్ అయిందని కంగారు లేదని చెప్పాడు. జరిగిన దానికి విశ్వనాధం ఎంత బాధ పడుతున్నాడో చెప్పాడు. ఆమెను తీసుకు వెళ్ళటానికి వచ్చాడని చెప్పాడు.

ఆమె పరిస్థితి చూసి పశ్చాత్తాపంతో క్రుంగి పోయాడు విశ్వనాధం. కన్నీళ్ళతోనే ఆమెను క్షమాపణ అడిగాడు.

ఆమె మనస్సు ద్రవించిపోయింది. ఆనందావేశాలతో మళ్ళీ ఆయాసం వచ్చింది. దగ్గలేక – వచ్చే దగ్గు నాపుకోలేక మెలికలు తిరిగిపోయింది. ఆమె పడుతున్న నరకయాతన చూసి తనను తాను వేయి విధాల తిట్టుకున్నాడు విశ్వనాధం.

"ఊర్కో అన్నయ్యా! నిన్ను నువ్వు తిట్టుకుంటే వదినకు సంతోషం కాదు." అంది నిర్మల. అన్నగార్ని చూసిన క్షణంలోనే ఆమె కోపమంతా కరిగిపోయింది.

నర్సు వచ్చి ఆమెకు విశ్రాంతి కావాలని అందర్నీ గది బయటకు వెళ్ళిపొమ్మంది.

ఆ రాత్రి తొమ్మిది గంటల వేళకి టెస్టు రిపోర్టులన్నీ వచ్చాయి. డాక్టరు జగన్నాధరావు కాత్యాయినిని, ప్రసాదరావుని తన గదిలోకి పిలిచాడు.

"కృష్ణవేణిగారి బంధువులు వచ్చారు డాక్టర్!" అన్నాడు ప్రసాదరావు.

డాక్టరు నొసలు చిట్లించాడు. "....ఎవరు? ప్రొద్దున వచ్చిన అమ్మాయా?"

"ఆ అమ్మాయి ఆడపడుచు. ఇంకా చాలా మంది వచ్చారు...." అంది కాత్యాయిని.

"అయితే, వాళ్ళని కూడా పిలవండి."

ప్రసాదరావు అందర్నీ పిల్చుకు వచ్చాడు. అంతకు అరగంట ముందే మురళీమోహన్, రామచంద్రం వచ్చి వున్నారు. వాళ్ళనందర్నీ డాక్టరుకి పరిచయం చేసాడు ప్రసాదరావు.

అందర్నీ కలయజూసి "మీరంతా ఆమె బంధువులంటే నాకు నమ్మకం కలగటం లేదు. ఇంతమంది బంధువులున్న వాళ్ళ పరిస్థితి అంత ఘోరంగా ఎప్పుడూ వుండదు!" అన్నాడు డాక్టర్ కటువుగా.

వాళ్ళ ముఖాలు నల్లబడిపోయాయి.

"ఆమె యింకా ఎలా ప్రాణాలతో వుందో నాకు తెలియదు!"

డాక్టరు మాటలు వాళ్ళ మీద పిడుగుల్లా కురిసాయి.

"డాక్టర్!" దాదాపు అంతా ఏకకంఠంతో అరిచారు.

"అవును. ఆమె ఒంట్లో నెత్తురు మాంసం కూడా లేదు. షి యీజ్ నతింగ్ బట్ స్కెలిటెన్! అసలన్నం తిని ఎన్నాళ్ళయింది? మీలో ఎవరికయినా తెలుసా అని! ఇంత జబ్బుగా వుంటే డాక్టరుకి చూపించకుండా ఎలా వున్నారు! మీకసలు మతులుపోయాయా?" ఆయన ఒక్కో మాట వాళ్ళనొక్కో అడుగు చొప్పున పాతాళానికి త్రొక్కేసింది.

విశ్వనాధం దుఃఖాన్నాపుకోలేకపోయాడు. "మతిపోగొట్టుకున్న దౌర్భాగ్యుడ్ని నేనే డాక్టర్! ఆమె ప్రాణాల మీదకి తెచ్చిన పాపాత్ముడి నేనే నండీ!"

"ఎందుకిప్పుడేడ్చి ప్రయోజనం?" అన్నాడు మురళీమోహన్ కోపాన్ని పట్టలేక....తన బాధకి తట్టుకోలేక.

"తిట్టరా! తిట్టు. ఎవరెన్ని తిట్టినా నా పాపం తగ్గదు."

"మీరూర్కోండి. ఇది ఒకళ్ళతప్పులొకళ్ళు ఎత్తి చూపించటానికి సమయం కాదు. ముందు జరగాల్సింది చూడాలి." అని వాళ్ళని వారించి "మేమంతా తప్పు చేసినవాళ్ళమే డాక్టర్! మమ్మల్ని క్షమించండి. ముందు మేమేం చేయాలో చెప్పండి. ఆమె ప్రాణాలు కాపాడండి" అన్నాడు పురుషోత్తం.

డాక్టరు గాఢంగా నిట్టూర్చాడు. "ఇక్కడ నేను చేయగల్గిందేమీ లేదు. పెద్దాసుపత్రికి తీసుకు వెళ్ళిపొండి. అక్కడ నాకు తెల్సిన ఫ్రెండున్నాడు. లెటరు వ్రాసిస్తాను. వెళ్ళి అక్కడ జాయిన్ చెయ్యండి. ఆ తర్వాత మీ అదృష్టం!"

అంతా ముఖాముఖాలు చూసుకున్నారు.

"మీరు...మీరు..." అని ఏదో చెప్పబోయాడు పురుషోత్తం.

"నావల్లయితే నేనలా వెళ్ళమంటానా? మీరు చాలా ఆలశ్యం చేసారు. అయామ్ వెరీసారీ! నేనిక్కడ చేయగల్గిందేమీ లేదు."

"ఆమెకి ప్రాణాపాయం లేదుకదా!" అని గద్గద కంఠంతో అడిగాడు, మురళీమోహన్.

డాక్టరు పేలవంగా నవ్వాడు. "మీరంతా చాలా చిత్రమైనవాళ్ళండీ! చేజేతులా ప్రాణాల మీదకి తెస్తారు. తర్వాత ప్రాణాలు రక్షించండని మా ప్రాణాలు తీస్తారు. ఇందాకా అన్న మాటే చెపుతున్నాను. ఆమె పరిస్థితి యేమీ బాగా లేదు. కాని, ఇంతకన్న బేడ్‌గా ఉన్న కేసులు నయమయినవీ వున్నాయి. అదే చెపుతున్నాను. అది మీ అదృష్టం! ఆమెకు విల్‌పవర్ వుంటే తప్పకుండా బ్రతుకుతుంది! ఏమయినా, ఈ సంగతులేవీ ఆమెకి చెప్పకండి. జాగ్రత్త కోసం పెద్ద హాస్పటలుకి తీసుకువెడుతున్నామని చెప్పండి. డబ్బు ఖర్చు చాలా వుండచ్చు. అందుకు సిద్ధపడే వెళ్ళండి!"

"డబ్బు గురించి బాధ లేదండి. మేమింత మందున్నాం." అన్నాడు పురుషోత్తం ఎర్రబడిన ముఖంతో.

ఈమాటు డాక్టరు వ్యంగ్యంగా అనలేదు. "విష్ యు ఆల్ ది బెస్ట్!" అన్నాడు నిండు మనస్సుతోనే.

హాస్పిటలు నుంచి మర్నాడు ప్రొద్దున్న డిశ్చార్జి

ఒక సంవత్సరం లోపు శిశువులు తరచు ఎక్కువగా ఏడుస్తూ వుంటారు. అర్ధరాత్రి సమయంలో వున్నట్టుండి కేర్ కేర్ అంటూ ఒకే రభస చేసేస్తూ వుంటారు. దీనిని చూసి కొందరు తల్లులు - అదీ తొలిసారిగా తల్లి అయిన వారు—కంగారు పడిపోవడం సహజమే. అయితే పాప బిగ్గరగా ఏడుస్తున్నంత కాలం బెంగపడవలసిన అవసరమే లేదు. ఎంచేతంటే పాపలు బిగ్గరగా ఏడ్వడమే ఆరోగ్య లక్షణం. అయినా పాపలు ఏడ్వడానికి కారణం ఏమిటి అన్నది తెలుసుకోడం ఎంతైనా అవసరం.

శిశువులకు సాధారణంగా ప్రేవుల్లో ఒక భాగం క్రింది వైపుకి జారుతుంది. అందువల్ల దానికి అడ్డు ఏర్పడుతుంది. దీనినే 'ఇన్‌టూసస్పెషన్' అంటారు. ఇందువల్లనే వుండుండి బిగ్గరగా ఏడుస్తుంది శిశువు. ఆ తర్వాత అలసిపోయి ముడుచుకుని పడుకుంటుంది. కొన్ని నిముషాలకే వున్నట్టుండి కేర్‌మంటుంది. పాప కడుపును తాకి చూసినట్టయితే క్రింది కడుపులో గట్టిగా వుండడం గమనించవచ్చు. కొంతసేపు తర్వాత కఫం, రక్తం కలిసినట్టు మలవిసర్జన జరుగుతుంది. పాప బిగ్గరగా ఏడవడానికి మరికొన్ని కారణాలు కూడా దోహదం చేస్తాయి.

పడకలో మలమూత్రాలు విసర్జించడం; పడక చెమ్మగిల్లడం, పడకలో చీమలు, దోమలు బెడద వున్నప్పుడు కూడా పాప బిగ్గరగా ఏడుస్తుంది. పాప పడుకున్న గదిలోకి గాలి రాకుండా ఎక్కువ ఉమ్మగించినట్టున్నా లేక ఎక్కువ చలిగా వున్నా పాప ఏడుస్తుంది. అంచేత శీతోష్ణస్థితిని అనుసరించి కర్టెన్లు ఉపయోగించడం మంచిది.

దాహం వేసినప్పుడు పాప బిగ్గరగా ఏడ్వడం వేసవి కాలంలో సర్వసాధారణమైన విషయం. అప్పుడు కాచి వడబోసి చల్లార్చిన నీళ్ళు ఇవ్వవచ్చు ఆ నీళ్ళలో చక్కెరగాని గ్లూకోజ్‌గాని కలుపకండి. పాపకు దాహమేస్తే వెంటనే గుటగుటా తాగేస్తుంది. నీటిని రెండు మూడుసార్లు రుచి చూసి ఊరుకుందంటే దానికి కారణం ఆకలి కూడా కావచ్చు. అలాంటప్పుడు పాలు పట్టడం మంచిది. రాత్రి పది గంటల తర్వాత పిల్లలకు పాలు పట్టకూడదని చాలామంది తల్లులు అనుకుంటారు. కాని అది చాలా తప్పు.



కలలు కంటూన్నప్పుడు కూడా పాప ఉలిక్కిపడి ఏడ్వడం కద్దు. అలాంటప్పుడు పాపను సాదరంగా నిమురుతూ ఒకటి రెండు ముద్దులిచ్చి భయం పోగొడితే మళ్ళీ హాయిగా నిద్రపోతుంది.

కడుపులో బాధ లేదా వాయువు ఎక్కువగా చేరితే రెండు కాళ్ళను కడుపుకు చేర్చుకుని ఏడుస్తుంది. అలాంటప్పుడు పాపను భుజం మీదో వక్షస్థలం మీదో పడుకోబెట్టుకుని కడుపును నిదానంగా ఒత్తడం మంచిది. ఇంక పాపను శాంతపరచి హాయిగా నిద్రపుచ్చడం ఎలా అని మీ డాక్టర్‌ను సంప్రదించినట్టయితే -'ట్రైక్లోరిల్‌సిరప్' ఒక స్పూన్ యిస్తారు. నిజంగానే పాపకు ఆరోగ్యం సరిగా లేనప్పుడు పాప బిగ్గరగా ఏడ్వదు. ఏడ్చే శబ్దం మనకు సరిగా వినిపించకుండానే ఏడుస్తుంది. అందువల్ల పాప బిగ్గరగా ఏడ్చిందంటే ఆందోళన చెందవలసిన అవసరమేమీ లేదు. —డాక్టర్

చేసి కృష్ణవేణిని ప్రసాదరావుగారి ఇంటికి తీసుకు వచ్చారు.

"నేను దగ్గరుండి కూడా నిన్ను రక్షించుకోలేకపోయాను. నీ బాధ నాతో చెప్పకుండ ఎందుకింత మథ్య పెట్టావు కృష్ణా!" అంటూ ఏడ్చింది కాత్యాయిని.

"ఊర్కోవే పిచ్చిదానా! ఇప్పుడు నాకేమయిందని? ఇప్పుడు నాకెంత సంతోషంగా వుందో తెలుసా! ఎన్ని జన్మలెత్తినా నీ ఋణం తీర్చుకోలేను." అంది కృష్ణవేణి.

"ఎక్కువగా మాట్లాడకు వదినా!" అని వారించింది నిర్మల.

కృష్ణవేణి గలగల నవ్వింది. అంతలోనే ఆమెకు మళ్ళీ దగ్గు వచ్చింది.

డాక్టరు మాటలు గుర్తు చేసి వెంటనే విశాఖపట్నం ప్రయాణమవుదామన్నాడు మురళీమోహన్, కాని ఒక్కసారి యింటికి వెళ్ళాలని వున్నదంది కృష్ణవేణి.

ఆమె మాట కాదనేశక్తి ఎవ్వరికీ లేకపోయింది! ఆవేళ మధ్యాహ్నం అంతా తమ వూరికి ప్రయాణమయ్యారు!

# 81

ఉషోదయమయింది.

పిల్లతెమ్మెర కృష్ణవేణి కపోలాలను మృదువుగా తట్టి పిలిచింది. ఆమె చటుక్కున కళ్ళు తెరిచింది.

కిటికీ కమ్మి మీద కూర్చున్న పిచ్చుక 'శుభోదయం' అని తన భాషలో చెప్పింది. కృష్ణవేణి చిరునవ్వు నవ్వి తల త్రిప్పి చూసింది.

నిర్మల! కంటికి మింటికి ఏకధారగా ఏడుస్తున్న నిర్మల! విశ్వనాథం! కుమిలి కుమిలి ఏడుస్తున్న విశ్వనాథం!

కృష్ణవేణి చకితురాలైంది. "ఏమండీ! ఎందుకు? ఎందుకంత బాధపడుతున్నారు?" అని కంగారుగా అడిగింది.

"ఈ బుద్ధి నా కిదివరకే వచ్చుంటే నీ కింత ప్రమాదం జరిగేది కాదుకదా కృష్ణా! నా మూలంగా ఎందరికి అపకారం జరిగిందో చూడు. నా లాంటి దౌర్భాగ్యుడ్ని ఆ దేవుడెందుకు పుట్టించాలి!"

"ఊర్కోండి. జరిగిందంతా మర్చిపోండి."

కృష్ణవేణి మళ్ళీ ఆయాసపడటం చూసి నిర్మల కంగారు పడింది. "నువ్వు వెళ్ళి ముఖం కడుక్కురా అన్నయ్యా!" అని అతన్ని తొందర పెట్టింది.

విశ్వనాథం వెళ్ళిపోయాడు. నిర్మల మందు తెచ్చి వదినగారిచేత త్రాగించింది. మరి కొంత సేపటికి ఆమెకు స్థిమితం చిక్కింది.

తన సూటుకేసు తెరిచి చీర తీసుకుంటోంది నిర్మల. చీర మడతల మధ్యనున్న ఆమె నవల క్రింద పడింది. అది చూసి కృష్ణవేణి అడిగింది.

"ఏదో నవల...." అని మళ్ళీ దాచిపెట్టాలనుకుంది నిర్మల.

"ఏదీ నన్ను చూడనీ!"

"ఇప్పుడెందుకు వదినా! తర్వాతెప్పుడయినా చదవచ్చులే! ..."

"ఆఁ! అర్థమయింది. అది నువ్వు వ్రాసిన నవల కదూ!"

నిర్మల పని యిరకాటంలో పడింది.

"ఏం, నేను చూడకూడదా?"

ఇంకేమనగలదు? వణుకుతున్న చేత్తో ఆ నవలని వదినగారి కందించింది నిర్మల.

కృష్ణవేణి నిర్మల పేరు అచ్చులో చూసి

పరమానంద పడింది. కుతూహలంగా పేజీలు తిరగవేసి చూసింది. "నువ్వు నీ మాట నిలబెట్టు కున్నావు. ఈ నవల నాకే అంకితం యిచ్చావు. కాని, నేనే మహారాణినయితే నీకు మణులు మాన్యాలు బహుమతి యిచ్చేదాన్ని నిర్మలా!… " అని నవ్వింది.

నిర్మల ఆమె చేతులు తనలోకి తీసుకుంది. "నా కళ్ళకి నువ్వు మామూలు మహారాణివి కాదు వదినా! కోరక ముందే వరాలిచ్చే దేవతవి! నాకొక్క వరం ప్రసాదిస్తావా"

"ఏమిటీ?'' అంది కృష్ణవేణి వాత్సల్యంగా చూస్తూ.

"నువ్వు….నువ్వు త్వరగా పూర్ణారోగ్యంతో తిరిగి రావాలి! అంతే వదినా! నాకింక యే కోరి కలూ లేవు!'' అంటూ ఆమె చేతుల్లో వాలిపోయి ఘొల్లుమని యేడవసాగింది.

కృష్ణవేణి కళ్లు చెమర్చాయి. "నువ్విలా యేడిస్తే నేను వెళ్ళనే వెళ్ళను.''

"ఏడవను వదినా! నేనింక యేడవను….'' అంటూ గబగబా కళ్ళు తుడుచుకుంది.

ప్రొద్దెక్కే వేళకి ప్రయాణ సన్నాహాలు పూర్తయినాయి.

"ఒక్కసారి హైదరాబాదు వెళ్ళి అత్తగార్ని మామగార్ని మధుని అందర్నీ చూడాలని వుందండీ!''

భార్య మాటలకి తల్లడిల్లిపోయాడు విశ్వనాధం. "ఇప్పుడెలా కృష్ణా!''

"కొంచెం కులాసాగా వుంటే అలాగే వెళ్ళి చూడచ్చు! ముందు ట్రీట్‌మెంటు ముఖ్యం కదా!'' అన్నాడు రామచంద్రం.

ఇంతలో "టాక్సీ వచ్చింది!'' అంటూ నారాయణ పరిగెత్తుకు వచ్చి చెప్పాడు.

అందరి గుండెలు దడదడలాడాయి.

"నా ప్రయాణానికి నేను తయారుగానే వున్నాను నాన్నా!'' అని వల్చగా నవ్వింది కృష్ణవేణి.

అంతా భయం భయంగా చూశారు. అందరికీ కళ్ళ నీళ్లు తిరుగుతున్నాయి. అందర్నీ కలయ జూసింది కృష్ణవేణి. "మీరంతా యెందుకింత బాధపడుతున్నారు! డాక్టరుగారు నా పరిస్థితి అంత పాడుగా వుందని చెప్పారా అన్నయ్యగారూ!'' అని అడిగింది.

"లేదమ్మా! నువ్వు….యింట్లో యిచ్చిన నిండుతనం అటువంటిది. కొన్నాళ్ళపాటు నువ్వు కళ్ళముందుండవని మా బాధ. అంతే!'' అన్నాడు పురుషోత్తం.

"ఇంతమంది నా కోసం పరితపించిపోతున్నారు. ఇంతమంది గుండెల్లో నాకు చోటుంది. నేనెంత అదృష్టవంతురాల్ని!'' విపరీతమైన దగ్గుతో ఉక్కిరి బిక్కిరయి ఆమె శరీరం మెలికలు తిరిగిపోయింది.

"కృష్ణా! కృష్ణా!'' అంటూ పొదివి పట్టు కున్నాడు విశ్వనాధం. అతని కళ్ళనుండి జారిన అశ్రువులు రాలి పాలిపోయిన ఆమె బుగ్గల మీద పడ్డాయి.

ఆమె కళ్ళతో సంజ్ఞచేసింది. అతను చొక్కా చేతులతో కళ్ళొత్తుకున్నాడు.

"త్వరగా పదండి అన్నయ్యా!'' అని తొందర పెట్టాడు మురళీమోహన్.

టాక్సీ వెనకసీట్లో విశ్వనాధం గుండెలకి తల ఆన్చుకొని పడుకుంది కృష్ణవేణి. పురుషోత్తం మురళీమోహన్ ముందు సీట్లో కూర్చున్నారు.

కృష్ణవేణి చెయ్యి అందుకొని ముద్దు పెట్టుకుంది నిర్మల.

కృష్ణవేణి చిరునవ్వు నవ్వింది. చేయి వూపి వీడ్కోలు చెప్పింది.

తల్లితో కూడా వెడతానని యేడుస్తున్న పిల్లల్ని సముదాయించటానికి యింటి లోపల సతమత మవుతున్నాడు రామచంద్రం.

టాక్సీ నెమ్మదిగా కదిలింది. నిర్మల ప్రాణాలు కృష్ణవేణి మీదనే వున్నాయి. తన ప్రాణాలన్నీ వాళ్ళ దగ్గరే విడిచిపెట్టి వెడుతోంది ఆమె.

టాక్సీ వీధి మలుపు తిరిగేదాకా తన కన్నీటి తెరల్ని చించుకొని చూస్తూ అక్కడే నిలబడి పోయింది నిర్మల. ఆ వీధిలోంచి వెలుగు వెళ్ళి పోయినట్టనిపించింది ఆమెకు-కొన్ని క్షణాలపాటు!

ఆమె గుండెలనిండా కొండంత ఆశ! మెండయిన వెన్నెలవెలుగు.

"ఇంతమంది గుండెల్లో నాకు చోటుంది. నేనెంత అదృష్టవంతురాల్ని!'' కృష్ణవేణి మాటలు నిర్మల చెవుల్లో ఇంకా మార్మోగుతూనే వున్నాయి.

82

డాక్టరు కెజ హెచ్‌కి తీసుకు వెళ్ళమని చెప్పి నప్పటికి హైదరాబాద్‌లో అయితే అంతా దగ్గర వుంటారు. కృష్ణవేణిని అక్కడ హాస్పిటల్లో చేర్పిస్తే, సౌకర్యంగా వుంటుందని మొదట అను కున్నారు రామచంద్రం, మురళీమోహన్‌లు.

తమ వూరికి తిరిగి రాగానే డబ్బు ఏర్పాట్ల కోసం అయితేనేమి, తండ్రి ఆందోళన తగ్గించటం కోసం అయితేనేమి హైదరాబాద్ ట్రంకాల్ చేసి మాట్లా డాడు రామచంద్రం. కృష్ణవేణి పరిస్థితి వివరంగా చెప్పాడు.

అక్కడ జరిగిన ప్రమాదం గురించి చెప్పక తప్పలేదు రాఘవరావుకి. సత్యనారాయణగారు ఇంకా ఇన్టెన్సివ్ కేర్ యూనిట్‌లో వున్నాడని…. ఆయన పరిస్థితి ఏమీ బాగాలేదని తనకేం చెప్పాలో పాలు పోవటం లేదన్నాడు. రామచంద్రానికి మతిపోయి నట్టయింది. ఫోన్‌లో ఏమని చెప్పటానికీ అతనికి తోచలేదు. మురళితో మాట్లాడి ఏది మంచిదనిపిస్తే అది చేస్తానని చెప్పి టెలిఫోన్ పెట్టేశాడు. ఆ సంభాషణ అర్థం కాక …. అతని ముఖంలోని కంగారు గుర్తించి ఏమిటేమిటని అడిగాడు మురళీ మోహన్. చెప్పలేక చెప్పలేక విన్న సంగతి చెప్పాడు రామచంద్రం.

అఘాతం మీద అఘాతం తగిలేసరికి మురళీ మోహన్ ప్రాణం జిల్లార్చుకు పోయినట్టయింది. "ఛ! ఒక్కడి పాడుపనివల్ల కుటుంబమంతా సర్వ నాశనం అయిపోయింది." అన్నాడు తల పట్టు కుంటూ.

రామచంద్రానికి ఏమని చెప్పటానికీ తోచలేదు.

"ఇంకా ఎంతమందికి ప్రాణాల మీదకి వస్తుందో! ఈ సంగతి వింటే వదిన ఒక్కక్షణమయినా బ్రతుకుతుందా? ఇప్పుడేం చేయాలి?….''

"ఆవిడకి తెలియనివ్వకూడదు…ఆవిడకే కాదు, నిర్మలకి, మీ అన్నయ్యకి కూడా తెలియకూడదు. నిర్మల తట్టుకోలేదు. ఇప్పటికే తనవల్ల ఎంతో ఘోరం జరిగిపోయిందని మీ అన్నయ్య బాధపడు తున్నారు. ఈ మాట వింటే ఆయన గుండె చెదిరి పోతుంది. అక్కయ్యగారు బ్రతికి బయట పడా లంటే ఆవిడేకాదు ఆయన కూడా సంతోషంగా వుండాలి!….ఈ పరిస్థితిలో ఆవిడ్ని కెజిహెచ్‌కి తీసుకువెళ్ళి చేర్పించటమే మంచిది!….''

"ఎంతకాలమని ఈ విషయాలు దాచగలం?…. అక్కడ వాళ్ళకేమని చెపుతాం?….'' అన్నాడు మురళీమోహన్ దిగులుగా.

"వాళ్ళ సంగతి నేను చూసుకుంటాను. నిర్మల్ని

పిల్లల్ని తీసుకుని నేను హైద్రాబాదు వెడతాను. మీరు, మీ అన్నయ్య వెళ్ళి ఆమెను అక్కడ చేర్పించండి. అడ్మిట్ చేశాక ఫోన్ చేయండి. ఈలోగా డబ్బుకి ఏర్పాట్లు చేస్తాను. ఆమెకు పూర్తిగా నయమయ్యేవరకూ ఆ సంగతులేవీ చెప్ప కూడదు. మనం అదృష్టవంతులమయితే అప్పటికి మీ నాన్నగారికి కూడా కులాసాగా వుండచ్చు.... ముందు ఆవిడ సంగతి మనం చూడాలి; మీ అన్నయ్యలో మార్పు వచ్చిందని ఆవిడ ఎంతో పరమానందపడుతున్నారు. మందులు కన్న ఆ ఆనందం ఆవిడ ఆరోగ్యానికి ముఖ్యం!....''

ఆవిధంగా కృష్ణవేణిని కెజిహెచ్‌కి తీసుకువెళ్ళి చేర్పించటం జరిగింది. నిర్మల పిల్లల్ని తీసుకొని రామచంద్రంతో హైద్రాబాదుకి తిరిగి వెళ్ళింది!

''మీకెవరికీ మంచి కబురు తీసుకురాలేక పోయాను వదినా!'' అని కన్నీరుపెడుతూ యింట్లో అడుగుపెట్టిన నిర్మలకు-అంతకంటె విషాదకరమైన వార్త ఎలా అందజేయాలో తెలియక పొంగివచ్చే తన కన్నీటిని ఆపుకోవటానికి ప్రయత్నం చేసింది మాధవి!

## 83

ఒక చెట్టు కూల్చివేయటం నిమిషాల మీద పని. ఒక యిల్లు పడగొట్టటం గంటల మీద పని. కాని, మరో చెట్టుని నాటి నీరుపోసి పెంచి పెద్ద చేయాలన్నా-పైసపైసనీ కూడా బెట్టి ఒక యిల్లు కట్టాలన్నా – ఎన్నో సంవత్సరాలు పడతాయి. ఎందరో కృషి చేయాల్సి వస్తుంది. ఎంతో శ్రమ పడాల్సి వస్తుంది!

విశ్వనాధం వ్యసనంతో ఆరు సంవత్సరాలపాటు చిన్నాభిన్నం అయిన ఈ సంసార వృక్షం మళ్ళీ కొత్త కొమ్మలతో, సరికొత్త రెమ్మలతో కళకళ లాడటం మాటలతో పనా? ఇలా జరక్కుండా వుండి వుంటే బాగుండునే అని వాపోవటం తప్ప కాలాన్ని వెనక్కి త్రిప్పటం ఎవరితరం? ఎంత మంది కృషి చేసినా ఎంత కష్టపడినా తిరిగి అంతా సవ్యంగా కావటం సంభవమా?

కాదు ...అని వచ్చిన కాలం చెప్పి వెళ్ళింది. అనంతమైన కాలసముద్రంతో పోలిస్తే ఆరు నెలల కాలం చాలా తక్కువ. కాని, కృష్ణవేణి ఆత్మీయుల కది ఆరు యుగాలనిపించింది.

ఆమెకు ప్రమాద పరిస్థితి తప్పింది. ఆమె ఆరోగ్యం చక్కబడింది. ఆమె పూర్ణారోగ్యవంతు



మామూలు రంగులు, వార్నిషులు టర్పంటైన్ తైలం రాస్తే పోతాయి. కాని యిప్పుడు వచ్చే సెల్యూలోజ్ రంగులకి ఎమైల్ ఎసిటేట్ విరుగుడుగా పనిచేస్తుంది.

—టి. విజయలక్ష్మి

రాలు కాకపోయినా పునర్జన్మ ఎత్తిందనిపించుకుంది. అంత జరగటానికి ఎంతమంది ఎన్ని విధాల ఎంత శ్రమపడాల్సి వచ్చిందో తన కళ్ళతో తను చూసి కొంతవరకూ తెల్సుకుంటూనే వున్నాడు విశ్వనాధం!

కాని, ఈ ఆరునెలల వ్యవధిలో అతనికి తెలిసినవి కొన్ని, తెలియనివి కొన్ని, తెలిసీ తెలియనివి మరికొన్ని అసంతృప్తికరమైనవి విషాదకరమైనవి జరిగిపోయాయి!

కన్న బిడ్డల చదువు సంవత్సరం పాటు పాడయి పోయింది. వాళ్ళకెంతో భవిష్యత్తు వుంది కనుక ఇదేమంత కష్టం కాదని సరిపెట్టుకోవచ్చు!

ఇంకెంతకాలం నిరీక్షిస్తాము? మా అబ్బాయికి వేరే సంబంధం చూసుకుంటున్నామని పెళ్ళివారు కరాఖండిగా చెప్పేయటంతో-కుదిరిన చెల్లెలు పెళ్ళి సంబంధం తప్పిపోయింది. ఇది కాకపోతే మరొకటి-నష్టం లేదని నిర్మల లాగే తానూ సమాధానపడచ్చు!

కృష్ణవేణి వైద్యానికని మందులకయితేనేమి-విశాఖపట్నంలో కాపరం పెట్టటానికయితేనేమి-అక్కడికి యిక్కడికి వాళ్ళు వీళ్ళు వచ్చే పోయేందుకు దారి ఖర్చులకయితేనేమి - మంచి నీళ్ళలా డబ్బు ఖర్చయిపోయింది! రామచంద్రం అప్పులు చేసాడు. మురళీమోహన్ అప్పులు చేసాడు. కృష్ణారావు అప్పులు చేసాడు. మాధవి తన నగలన్నీ అమ్మేసింది. ఎవరెన్నిపాట్లుపడినా కానున్నదాన్ని ఆపలేకపోయారు. ఏడాది నుంచి అప్పు కట్టనందుకు సొసైటీవాళ్ళు దావా వేసారు. కోర్టులో కేసు నడపటానికి డబ్బు లేదు. అప్పు కట్టటానికీ డబ్బు లేదు. చివరికి ఇల్లు అమ్ముకోక తప్పలేదు! తన మూలంగా తాతలనాటి యిల్లు పోగొట్టుకున్నందుకు విశ్వనాధం పరిపరివిధాల బాధపడ్డాడు! సరికొత్త జీవితం ప్రారంభించి అంతటి యిల్లు కాకపోయినా భార్యా బిడ్డలకి నిలువ నీడ కల్పించటానికి ఇకముందు తాను శ్రమ పడతానని చిత్తశుద్ధితో అనుకున్నాడు! కుటుంబ భవిష్యత్తుకి అదొక మంచి సూచన కావచ్చు! ఈ యిబ్బందులకి తోడుగా అతను శలవుపెట్టి అహర్నిశలు భార్య దగ్గరే గడపవలసి వచ్చింది. ఈ శలవు కాలంలో అతనికి పూర్తి జీతం రాలేదు. ఇంటి బాధ్యతలు మీదపడి మాధవికి క్రొత్త ఉద్యోగంలో చేరటానికి వీలు లేకపోయింది. అప్పటి సమస్యలముందు ఈ ఆర్థికనష్టాలు చాలా చిన్నవని సరిపెట్టుకున్నారంతా!

ఏమంచి మనిషికి తన కన్నకొడుకువల్ల ప్రాణాపాయ పరిస్థితి వచ్చిందని గుండె చెదిరి జబ్బు పడ్డాడో-ఆమెకు ప్రమాదం తప్పిందని – కోలుకుంటోందని త్వరలోనే పూర్ణారోగ్యంతో తిరిగి వస్తుందని ఎవరు ఎంత నచ్చచెప్పినా సత్యనారాయణ గారు సమాధానపడలేకపోయాడు. ఆమె సంతోష ఘడియల్లో కమ్మని కబుర్లు చెపుతున్నవేళలో ఫోటోలు తీసి అవి తెచ్చి మురళీమోహన్ చూపించినా ఆయన సంతృప్తిపడలేదు. రోజులు కాదు, వారాలు కాదు, నెలల తరబడీ హాస్పిటల్లో ఉన్న కోడలు తిరిగి ప్రాణాలతో బయిటపడుతుందంటే ఆయనకి నమ్మకం చిక్కలేదు. ఫోటోల్లో కోడలి చిరునవ్వులకన్న ఆమె బక్కచిక్కిన స్వరూపమే ఆయనకెక్కువ కనిపించింది. భయంకరమైన ఆలోచనలతో ఆయన మనస్సు అల్లకల్లోలమై పోయింది. తగ్గినట్టేతగ్గి మళ్ళీ గుండెనెప్పి వచ్చేది. ఆయన ఇంటివద్ద గడిపిన రోజులు కన్న హాస్పిటల్లో ఉన్న రోజులే ఎక్కువ!.... మనోవేదనకి ఎవరు మందు వేయగలరు? డాక్టర్ల ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి. నాలుగు నెలల అనారోగ్యానికి ముగింపు వచ్చింది. ఒక రాత్రి పట్టి పట్టని నిద్రలోనే ఆయన ప్రాణాలు విడిచి పెట్టేశాడు! ఇంటిని పోగొట్టుకున్నా, యిల్లాలుని రక్షించుకు తెచ్చుకున్నానని తండ్రితో చెప్పుకు సంతోషించాలని ఎదురు చూస్తున్న విశ్వనాధానికి ఈ దుర్వార్త తెలియదు! విశాఖ వచ్చిపోతున్న వాళ్ళెవరూ చెప్పలేదు!

ఈ సంగతులేవీ తెలియకుండా కృష్ణవేణినైతే ఏమార్చగలిగారు కాని – సుభద్రమ్మగారికి తెలియకుండా చేయటం ఎలా సాధ్యం? తల్లి రాకుండా పిల్లలు వచ్చి ఇక్కడ వుంటున్నారంటే అది చాలు తల్లికెంత నలతగా వుందో ఊహించటానికి! అక్కడ కోడలు ఇక్కడ భర్త హాస్పిటలు పాలయ్యేసరికి ఇంతకాలం ఆమెలో మిగిలిన శక్తంతా వుడిగిపోయింది. ఆనాటి నుంచి ఆమె

మంచం మీద నుంచి లేవలేడు. కాలు, చేయి స్వాధీనం లేకపోవటమేకాదు. భర్త పోయాక ఆమెకు మాట కూడా పడిపోయింది! ఆత్మీయులంతా వున్న చోటకి తిరిగివచ్చి వాళ్ళచేత మారిన మంచి మనిషిగా గుర్తింపబడాలని ఎదురుచూస్తున్న విశ్వనాధానికి ఈ దారుణపరిస్థితి కూడా తెలియదు!

ఈ ఆరునెలల వ్యవధిలో తన భార్య గురించి-తన గురించి అన్నదమ్ములు, చెల్లెళ్ళు అయినవాళ్ళు ఎంతటి బాధని తమ గుండెల్లో దాచుకున్నారో-ఎన్ని కన్నీళ్ళు ప్రవహించాయో అతనికి తెలియదు!

దుష్ఫలితాలు చూసినప్పుడు కాని తానెంత పెద్ద తప్పు చేసాడో మనిషి గుర్తించలేడు! అప్పుడు తన చరిత్ర తిరగ రాసుకోవాలని వెర్రిగా కోరుకుంటాడు!

## 84

కృష్ణవేణి తియ్యని కలల్లోంచి ఎవరో లేపినట్టు ఉలిక్కిపడి లేచింది. రైలు కిటికీలోంచి ఉషః కాంతులు లోపలికి ప్రవహిస్తున్నాయి! ఆ వెలుగులో పక్కబర్తు మీద ఒళ్ళుమరచి నిద్రపోతున్న భర్తవైపు చూసి చిన్నగా నవ్వుకుంది.

మధ్య బర్తువైపు చూసింది. అక్కడ మురళీ మోహన్ కనిపించలేదు. బాత్రూముకి వెళ్ళాడేమోననుకుంది.

ఆమె పైకిలేచి కూర్చుంది .... రైలుకంటె ముందు ఆమె మనస్సు హైద్రాబాదు చేరుకుంది. మరి కాసేపట్లో తను తనవాళ్ళ మధ్య వుంటుంది. అబ్బ, వాళ్ళందర్నీ చూసి ఎన్నో యుగాలయినట్టుంది!

శారీరకమైన అనారోగ్యంనుంచి బయిటపడి పునర్జన్మ ఎత్తింది తను. మానసికమైన అనారోగ్యం నుంచి బయటపడి మరో జన్మ ఎత్తాడు భర్త! ఇకముందు తామనుభవించబోయే క్రొత్త జీవితాన్ని చూసి ఆత్మీయులు ఎంత సంతోషిస్తారో!

ఆమె మనస్సులో పొంగి పొరలుతున్న ఆనందం ఆమె ముఖం మీదకి వింతకాంతులు విరజిమ్ముతోంది....మెలకువ వచ్చిన విశ్వనాధం కళ్ళల్లో ఆ వెలుగులు ప్రతిబింబించాయి! 'కృష్ణా!' అని ఆప్యాయంగా పిలిచాడు.

కృష్ణవేణి తలత్రిప్పి చూసి "దగ్గరికి వచ్చేస్తున్నాము! ఇక లేవచ్చు" అని చిలిపిగా నవ్వింది.

ఇంతలో మురళీమోహన్ వచ్చాడు. అతని ముఖంలో ఏదో అలసట గుర్తించింది ఆమె.

"ఏం మురళీ! నిద్ర పట్టలేదా!"

కళకళలాడుతున్న అన్న వదినల ముఖాలు చూసాడు మురళీమోహన్. మరి కాసేపట్లో వాళ్ళకి తెలియనున్న విషాద వార్తలు గుర్తుకువచ్చి అతని మనస్సు కళవళ పడింది!....బలవంతంగా నవ్వు తెచ్చుకున్నాడు.

"పాపం, ఈ ఆరు నెలల్లో నా మూలంగా ఎన్ని అవస్థలు పడ్డారో మీరు!" అంది కృష్ణవేణి జాలిగా.

"బండి లేటయినట్టుంది" అని మాట మార్చాడు మురళి.

"మన ఆత్రుత రైలువాళ్ళకేం తెలుసు!"

పాల వెన్నెల లాంటి ఆ నవ్వు మురళి మనసులోని దిగుల్ని కొంత తగ్గించింది.

ముఖాలు కడుక్కుని కాసేపు ఆ కబుర్లూ యీ కబుర్లూ చెప్పకున్నారు. మరో గంటలో రైలుబండి సికింద్రాబాదు చేరుకుంది.

కిటికీలోంచి కృష్ణవేణి చూసింది....తన కంపార్టుమెంటు వైపు పరుగుపరుగున వస్తున్న వాళ్ళని చూసి ఆనందంతో ఆమె గుండెలు దడదడలాడాయి!

ప్లాట్‌ఫారం మీదకి దిగిన కృష్ణవేణిని చుట్టేసారు సుభద్ర, నారాయణ, "పెద్దమ్మరా!" అంటూ తన కొడుకును ఆమెకు అందించింది మాధవి.

"నీతో హైదరాబాదంతా తీసుకు వచ్చేసావేమిటి నిర్మలా!" అంది కృష్ణవేణి నవ్వుతూ.

నిర్మల బలవంతంగా నవ్వు తెచ్చుకుంది.

"యువార్ వెల్‌కమ్ ఆంటీ!"

"అరే! నువ్వా రాజేష్! గుర్తు పట్టలేక పోయాను ఇంత మందిని ఒక్కసారిగా దగ్గరికి తీసుకోవటం ఎలా? నాకున్నవి రెండు చేతులేనే!" అని గలగల నవ్వింది.



పేము కుర్చీలకుండే పేము వదులుగా జారి గుంటలు వడుతుంటే, మరిగే నీళ్ళుపోసి ఎండలో ఆరబెట్టండి. పేము బిగుసుకుంటుంది



బియ్యంలో మట్టిగడ్డలు ఎక్కువగా వుంటే బియ్యం కడిగేటప్పుడు చారెడు ఉప్పువేసి ఐదు నిముషాలు నాననివ్వాలి. ఆ తర్వాత కడిగితే మట్టిగడ్డలు పోతాయి.

—టి. విజయలక్ష్మి

ఈ క్షణంలో ఆమె అనుభవిస్తున్న ఆనందానికి సంతోషపడాలో - మరికాసేపట్లో ఆమె ఎదుర్కొనే అఘాతానికి బాధపడాలో అర్థంకాక వచ్చిన వాళ్ళంతా మాటలు కరువై నిలబడిపోయారు!

"ఇంట్లో అంతా ఎదురు చూస్తున్నారు. మనమిక వెడదామమ్మా!" అన్నాడు రాఘవరావు.

మరో పావు గంటలో అంతా కృష్ణారావు ఇల్లు చేరుకున్నారు. అంత పెద్ద యిల్లు కూడా వచ్చిన చుట్టపక్కాలతో కిటకిటలాడి పోయింది. కృష్ణవేణి తల్లిదండ్రులు, శ్రీకాంత్, అతని భార్య, పార్వతి, సుబ్బారావు....అంతా వచ్చి వున్నారు. ఇక రామచంద్రం కుటుంబం సరేసరి...వాళ్ళు స్టేషను దగ్గరికే ఎదురు వచ్చారు!

ఈ ఆనంద సందోహమంతా కొన్ని నిమిషాలు మాత్రమే! ఇన్ని రోజులుగా ఏ సన్నివేశానికి అందరూ భయపడుతూ వచ్చారో అది రానే వచ్చింది.

మధురగాయనిగా ఒక పాటలో అపశ్రుతి గుర్తించటం కృష్ణవేణికి వెన్నతో పెట్టిన విద్య. అలాగే జరగవలసిందేదో జరగలేదని ఆమె మనసు వెంటనే గుర్తించింది. "ఏమిటక్కయ్యా! అత్తగారూ, మామగారూ ఏరి?" అని అడిగింది.

"అత్తగారు లోపల వున్నారు! ...." అన్నది జానకి కంగారుగా నవ్వుతూ.

"ఇక్కడ కనిపించలేదేమిటి అని అడిగాను." అని అత్తగారి గదిలోకి వెళ్ళబోయింది కృష్ణవేణి.

ఇంతలో "తాతయ్య లేరమ్మా! ఎక్కడికో పుణ్యక్షేత్రాలకి వెళ్ళారుట!" అన్నాడు నారాయణ.

కృష్ణవేణి ఉలిక్కిపడింది. అందరి వైపూ కంగారుగా చూసింది.

"శ్రీకాంత్! .... బాబూ రవీ! ఒక్కసారి పిల్లలందర్నీ అలా డాబామీదకి తీసుకు వెళ్ళండి!" అన్నాడు రాఘవరావు వాళ్ళకి సంజ్ఞ చేస్తూ.

రాజీని, రాజేష్‌ని పిలుచుకు వెళ్ళాడు రవి. ఏడుస్తున్న సుభద్రని ఎత్తుకు తీసుకు పోయాడు శ్రీకాంత్. నారాయణని ఏదో మభ్యపెట్టి వీధిలోకి తీసుకు పోయాడు సుబ్బారావు.

"కొంచెం కాఫీ త్రాగమ్మా!" అంటూ కూతురి చెయ్యి పట్టుకుంది జానకమ్మ.

తల్లి కళ్ళల్లోని నీళ్ళు గుర్తించింది కృష్ణవేణి. "ఏమిటమ్మా? ఏం జరిగింది? మీరంతా దిగులుగా ఉన్నారెందుకు? మామగారు పుణ్యక్షేత్రాలకి వెళ్ళట

మేమిటి ?'' అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

కృష్ణారావు తల దించుకున్నాడు. "నాన్నగారు ఎప్పటికీ తిరిగి రాని పుణ్యక్షేత్రానికి వెళ్ళారుగా! మనకిక ఆయన కనిపించరు!'' అంటూ కన్నీరు పెట్టాడు.

తను ఆరోగ్యవంతుడై తన భార్యను ఆరోగ్యవంతురాల్ని చేసుకుని వచ్చినప్పుడు అందరికంటె ఎక్కువ సంతోషపడేది తన తల్లిదండ్రులేనని.... ఎంతో ఆశతో వచ్చాడతను. కాని, ఈ ఆనందం పంచుకోటానికి ఇప్పుడు తండ్రిలేడు....అది తల్చుకునేసరికి విశ్వనాథం బాధకి అంతులేకపోయింది! "నా పాడు ముఖం చూడనని నాన్నగారు వెళ్ళిపోయారా?....ఆయన ప్రాణాలు తీసింది నేనేనా?'' అంటూ తల పట్టుకుని నేల మీద కూలబడి పెద్దగా ఏడువసాగాడు.

విశ్వనాథం ఏడుస్తూ తన దుఃఖభారం తగ్గించుకుంటున్నాడు. కాని కృష్ణవేణి పరిస్థితే అందర్కీ ఆందోళన కలిగించింది. కదలదు. పలకదు. నిశ్చలమైన చూపుతో శిలా ప్రతిమలా కూర్చుండిపోయింది!

"వదినా! ...వదినా!.... '' అని కంగారుగా కేకలు పెట్టింది నిర్మల.

"అక్కా! ఏదీ .... యిలా చూడు .... నాకేసి చూడు.'' అంటూ ఆమె చేతులు పట్టుకుని ఊపేస్తోంది మాధవి.

అంతా ఆమె చుట్టూ గుమిగూడారు. ఎవరి ప్రయత్నాలూ ఆమెను స్వాధీనంలోకి తీసుకురాలేదు. పరుగు పరుగున వెళ్ళి డాక్టర్ని తీసుకువచ్చాడు మురళిమోహన్.

అతను దారిలోనే జరిగినదంతా క్లుప్తంగా డాక్టరుకి చెప్పాడు.

డాక్టరు వచ్చి ఆమెను పరీక్షచేశాడు. "ఆవిడకు బాగా షాక్ తగిలింది. సారీ, నాకెలా చెప్పాలో తెలియటం లేదు. కాని, ఆమె ఏడవటం అవసరం! ఏడ్పువల్ల ఎంత బాధయినా తగ్గుతుంది. ఈ ప్రయత్నం మీరే చేయాలి!....''

రోజుల తరబడీ బాధపడుతూ హృదయభారం కరిగించుకున్న వాళ్ళకి వద్దనుకున్నా కన్నీళ్ళు వస్తున్నాయి. కాని, ఒక్కసారిగా విషాద వార్త విని కొయ్యబారిపోయిన కృష్ణవేణికి ఏడుపు రావటం లేదు సరికదా తనకేమవుతోందో కూడా తెలియని స్థితిలో వుంది. ఆమె చూస్తున్నా .... స్పృహలో లేనట్టే వుంది! వాళ్ళ మాటలు వింటున్నా చలనం లేనట్టే వుంది!

"ఏడవకు నిర్మలా ఏడవకు అని నువ్వంటే ఏడుపు వదినా–ఏడుపు అని నిన్నడగాల్సి వస్తోంది! ఒక్కసారి ఏడ్చి నీ గుండె బరువు దించుకో వదినా!'' అంటూ తన గుండె చెరువు చేసుకుంటోంది నిర్మల.

"ఇన్నేళ్ళుగా నిన్నేడిపించి ఆ కన్నీళ్ళన్నీ నేనే యిగిర్చివేశాను కృష్ణా! .... ఒక్కసారి ఎలాగో ఏడ్పు తెచ్చుకో! నా కోసం కాదు. వీళ్ళందరి కోసం!'' అంటూ బావురుమన్నాడు విశ్వనాథం.

ఎంతోసేపటికి వాళ్ళ ప్రయత్నాలు ఫలించాయి. క్రమక్రమంగా కరిగి నీరయిపోయింది కృష్ణవేణి!

ఆమె ఏడిస్తే ఎప్పుడూ చూడలేక హృదయాలు బరువెక్కించుకునే ఆత్మీయులు—ఇప్పుడామె యేడుస్తుంటే భారమైన తమ హృదయాలు తేలిక పరచుకున్నారు! అదొక చిత్రమైన పరిస్థితి!

## 85

విశాఖపట్నంలో వుండగానే కుటుంబ కారణాల వల్ల హైదరాబాదుకి బదిలీ కావాలని అర్జీ పెట్టుకున్నాడు విశ్వనాథం. ఇక్కడికి వచ్చిన కొన్నాళ్ళల్లోనే అతని కనుకూలంగా ట్రాన్స్‌ఫర్ ఆర్డర్సు వచ్చాయి!

స్వంత వూరుతో అన్ని సంబంధాలు తెగిపోయాయని ఏదో అసంతృప్తి. నిజంగా తను సుఖపడుతున్న రోజుల్లో చూసి ఆనందించటానికి మామగారు లేకపోయారే అని ఒక ఆవేదన. తన ఆనందం పంచి పుచ్చుకుంటున్నా మాటలలో అత్తగారు వ్యక్తం చేయలేకపోతున్నారని కొంత దిగులు. ఇవి మినహా కృష్ణవేణికి మరే విధమయిన బాధలూ లేవు.

గతాన్ని గుర్తుకి తెచ్చుకునేంత తీరిక ఆమెకు లేదు.

ఇప్పటి సుఖ సంతోషాలనుభవించటంలో ఆమెకు తీరటం లేదు.

ఆమె మాటలో పాటలో మార్పులేదు. అదే మాధుర్యం - తరగని తియ్యదనం! అది అందరికీ తెలిసినదే! ఆమె ఆకృతిలో ఎంతో మార్పు వచ్చింది. క్రొత్త రక్తం....క్రొత్త కాంతి....క్రొత్త అందం! ఇది అందరికీ క్రొత్త అనుభవంలా వుంది. పరమానందకరంగా వుంది.

ఇప్పుడు ఆమె పొడిదగ్గు దగ్గినా ఉలిక్కిపడతాడు విశ్వనాథం!

ఆమె చేతితోని పని అంది పుచ్చుకోటానికి అందరూ ఆత్రుత పడతారు. అపురూపమైన గాజు బొమ్మను అతి భద్రంగా దాచుకున్నట్టు....ఆమెను అంతా కనిపెట్టి చూస్తారు!

'నన్నేమీ చెయ్యనివ్వరు. ఇదేమి శిక్షో నాకు!' అంటుంది కృష్ణవేణి. ఆమెకదొక చిత్రమైన మధుర వేదన! ఒకరోజున తానెంత ఆనందంగా ఉంటోందో కాత్యాయినికి ఉత్తరం వ్రాస్తోంది కృష్ణవేణి....

అప్పుడే "హాయిగా ఏదయినా చదువుకో!'' అంటూ తెచ్చిన హాస్యకథల పుస్తకాలు ఆమె ముందు పడేసింది నిర్మల.

"ముందు నీ నవల యియ్యి. చదువుతాను.'' అంది కృష్ణవేణి నవ్వుతూ.

నిర్మల ముఖంలోని నవ్వు మాయమయింది. "అది మంచి నవల కాదు వదినా!''

"బలేదానివి! నా కంకిత మిచ్చిన నవల మంచిదికాకుండా ఎలా వుంటుంది? లోకమంతా చదివారు. నేను చదవకుండా ఎలా వుంటాను?''

ఆ నవల కృష్ణవేణి చదువుతున్నంత సేపూ అటూయిటూ తమ అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకూర్చున్నారు — నిర్మలా మాధవీ!

నవల చదవటం పూర్తి చేసిన కృష్ణవేణి కళ్ళవెంట జలజల జారి వచ్చాయి కన్నీళ్ళు!

"వదినా! నన్ను క్షమించు వదినా!'' అంటూ ఆమె చేతులు పట్టుకుంది నిర్మల.

కృష్ణవేణి కళ్ళు తుడుచుకుని నిండుగా నవ్వింది. "నిన్న క్షమించటమేమిటి పిచ్చిదానా?....నాలాంటి ఒక సామాన్యురాలి కన్నీళ్ళకి ఒక గొప్ప పరమార్థం కల్పించావు. అందుకు నేనేమిస్తే నీ ఋణం తీరుతుంది!''

నిర్మల కళ్ళు చెమర్చాయి. "నా నవలలోని ముగింపును అబద్ధంచేసి నా ఋణం ఎప్పుడో తీర్చుకున్నావు వదినా! ఇక ఎల్లకాలం నువ్విలా సంతోషంగా వుండటమే నాక్కావాల్సింది!''

"నువ్వు మళ్ళీ ఆ నవల తిరగ రాయాలి నిర్మలా!'' అంది మాధవి హాయిగా నవ్వుతూ.

"కాదు మధూ! అచ్చయిపోయిన పుస్తకం లాంటిదే జరిగిపోయిన కథ కూడా! గతాన్నెవరూ తిరగరాయలేరు, ఇక నిర్మల వ్రాయగలిగేది....రానున్న కథని మాత్రమే!....'' అంది కృష్ణవేణి.

ఆమె జీవిత కథలో క్రొత్త అధ్యాయం ఆరంభమయింది!

[సంపూర్ణం]

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠీ | గుజరాతీ | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| ణ న | ண ன ந | ಣ ನ | ണ ന | ण न | ણ ન | ଣ ନ |
| ణా నా | ணா னா நா | ಣಾ ನಾ | ണാ നാ | णा ना | ણા ના | ଣା ନା |
| ణి ని | ணி னி நி | ಣಿ ನಿ | ണി നി | णि नि | ણિ નિ | ଣି ନି |
| ణీ నీ | ணீ னீ நீ | ಣೀ ನೀ | ണീ നീ | णी नी | ણી ની | ଣୀ ନୀ |
| ణు ను | ணு னு நு | ಣು ನು | ണു നു | णु नु | ણુ નુ | ଣୁ ନୁ |
| ణూ నూ | ணூ னூ நூ | ಣೂ ನೂ | ണൂ നൂ | णू नू | – નૂ | ଣୂ ନୂ |
| ణృ నృ | — | ಣೃ ನೃ | — — | णृ नृ | – નૃ | ଣୃ ନୃ |
| ణౄ నౄ | — | — — | — — | — — | — — | — — |
| ణె నె | ணெ னெ நெ | ಣೆ ನೆ | ണെ നെ | — — | — — | — — |
| ణే నే | ணே னே நே | ಣೇ ನೇ | ണേ നേ | णे ने | ણે ને | ଣେ ନେ |
| ణై నై | ணை னை நை | ಣೈ ನೈ | ണൈ നൈ | णै नै | ણૈ નૈ | ଣୈ ନୈ |
| ణొ నొ | ணொ னொ நொ | ಣೊ ನೊ | ണൊ നൊ | — — | — — | — — |
| ణో నో | ணோ னோ நோ | ಣೋ ನೋ | ണോ നോ | णो नो | ણો નો | ଣୋ ନୋ |
| ణౌ నౌ | ணௌ னௌ நௌ | ಣೌ ನೌ | ണൌ നൌ | णौ नौ | ણૌ નૌ | ଣୌ ନୌ |
| ణం నం | — | ಣಂ ನಂ | ണം നം | णं नं | ણં નં | ଣଂ ନଂ |
| ణః నః | — | ಣಃ ನಃ | ണഃ നഃ | णः नः | ણઃ નઃ | ଣଃ ନଃ |

* సౌలభ్యం కోసం ణ,తో పాటున కూడా ఇప్పుడే ఇవ్వడం జరిగింది. త థ ద ధ లు తర్వాత సంచికలో వస్తాయి. [వచ్చే సంచికలో మరికొన్ని]

# అబలలు - అసమానతలు

ప్రపంచం మొత్తం మీద స్త్రీల సంఖ్య పురుషుల సంఖ్యకన్నా తక్కువ ఉండదు. అయినా అనాది నుంచీ ఈనాటివరకూ పరిపాలకులు మగాళ్ళే. అధికారం మగాళ్ళదే. వీరి అధికారంలో మరో పేచీ వుంది. మగాళ్ళూ అంటే బాగా డబ్బున్న అతి కొద్దిమంది కాని, వాళ్ళ ప్రతినిధులు కాని, ప్రభుత్వాలు చెలాయిస్తూ వుంటారు. కాకిరెట్టంత సైజు ధనవంతులు, ధనవంతులు కాని సముద్రమంత ప్రజల్ని పరిపాలిస్తుంటారు. కాని ఆడవాళ్ళకి సంబంధించినంత మట్టుకు అందరు పురుషులూ అధికారులే! కడు బీదవాడు కూడా తన భార్య మీద పవర్ చూపిస్తున్నాడంటే ఆ విధంగా అతన్ని తయారు చేసిన లోపం సమాజం, దాని మగ అధికారులదే కాని బీదవాడిది కాదు. 'మగతనం' ప్రదర్శించడం పురుష లక్షణంట! ఆడదే తిరగబడితే ఎవడిమీద మగతనం చూపిద్దురో మరి?

సృష్టిలో స్త్రీ ద్వారా శిశువులు పుట్టడం ప్రకృతి ధర్మం. అందువల్ల గర్భధారణ సమయంలో మాత్రం ఆమె 'అబల' అయింది. కాని ఈనాడు స్త్రీని పూర్తిగా అబలని చేసేసింది సమాజం.

మరీ పురాతనకాలంలో మానవుల సంఖ్యే బహు స్వల్పంగా ఉన్నప్పుడు ఆడదీ, మగాడూ సములే. రానురాను స్త్రీ అబల, ఆమె చోటు ఇల్లు-ఇంట్లో పడుండి వండడం, పిల్లల్ని కని పెంచడం వగైరాలకే వుందని మగాళ్ళు నిర్ణయించి ఆమెకి ఆ 'రోల్' ఖాయం చేశారు. ఆ రోలే స్త్రీల పీకల మీద వుంది. ఈ పీకల మీద రోలు బరువు పోతేనేకాని స్త్రీ నిజమైన స్వతంత్రురాలు కాదు.

మతం, ధర్మం, న్యాయం, ఆచార వ్యవహారాలు, అన్నీ ఆడదాన్ని అణగదొక్కేశాయి. ఎంచేత? అవన్నీ సృష్టించినవాళ్ళూ, అమలు జరుపుతున్న వాళ్ళూ మగాళ్ళు కనుక! పురుషుడికి పనికొచ్చే న్యాయం అమలు జరుగుతూంది.

మగ కూలీకిచ్చే రేటులో సగమే ఆడకూలీ రేటు. అర్ధాంగి అన్నందుకు సగం కూలీయే ఇవ్వాలి కాబోలు!

ప్రపంచంలో స్త్రీ పురుష జనాభా సరిసమానమయినా ఎంతమంది స్త్రీలు రాజ్యాలేలుతున్నారు? ఎంతమంది స్త్రీలు మంత్రులుగానూ, పాలనాసభల మెంబర్లుగానూ ఉంటున్నారు? ఎంతమంది స్త్రీలు బడా ఆఫీసర్లు? ఎంతమంది మగువలు బిగ్ బిజినెస్(వి)మన్? న్యాయస్థానాలలో ఎందరు న్యాయమూర్తులు స్త్రీలు? ఆర్మీ అంతా పురుషమయమే కదా! స్త్రీలకు తుపాకు లప్పగిస్తే తిరగబడి మగాణ్ణి దాసుడిగా చేస్తారని భయమా?

ఈ మన సమాజంలో ఎంత తీవ్రమైన కొరత, అన్యాయం, ఘోరం, పేరుకొని ఉండకపోతే ఇన్ని కోట్లమంది స్త్రీలు దాసీలుగా, పాదదాసీలుగా, విలాసాల అంగడిలో విలాస వస్తువులుగా, పుస్తె కట్టి, మగాడు తన ఇలాకాలోకి తెచ్చుకున్న బానిసలుగా నామరూపాలు లేకుండా పడివుంటారు?

ఆదిశక్తి, మాతృశ్రీ, గృహలక్ష్మి, దేవత, దెయ్యం, విచ్ అంటూ ఏ మొగరాయుడికి తోచిన పేర్లు వాళ్ళు ఆడదానికి పెట్టేరు. లేనివాణ్ణి మరింత లేనివాడిగా వుంచడానికి మన శాసనాలు, రూల్ ఆఫ్ లా, ప్రజాస్వామ్యం ఎలా పనికొస్తున్నాయో- అలాగే ఆడదాన్ని అణచి ఉంచి, ఇన్ఫీరియర్ స్టేటస్‌లో ఉంచడానికే పురుషుల కృషి అంతా.

కేరళలోని వర్కలై అనే వూళ్ళో సరోజ అనే అందమైన అమ్మాయి వుంటోంది. ఆ అమ్మాయి నర్సు ట్రెయినింగ్ పాసై అక్కడే ఒక ప్రైవేట్ ఆసుపత్రిలో నర్సుగా పనిచేస్తోంది. ఆమెకో మామయ్య వున్నాడు. సరోజకి అతనంటే యిష్టం. వరస కుదిరింది కదా అని సరోజ తల్లికూడా యిష్టపడింది. ఇద్దరికీ వివాహం జరిపిద్దామనుకుంది. అక్కడే కథ మలుపు తిరిగింది.

ఆ మామయ్యతోపాటు అతని స్నేహితుడొకడు వాళ్ళింటికి వస్తూ వుండేవాడు. ఈ మామయ్య, ఆ మిత్రుడూ ప్రాణ స్నేహితులు. అందుకని సరోజ కూడా ఆ మిత్రుణ్ణి ప్రాణంకన్న మిన్నగా ప్రేమించేసింది. దాంతో గొప్ప చిక్కొచ్చిపడింది. సరోజ తల్లి కలికాలాన్ని దుమ్మెత్తిపోసి యిద్దరిలో ఎవరు కావాలో నిర్ణయించుకోమంది. సరోజ ఆలోచించింది. బాగా ఆలోచించింది. బుర్ర చించుకుని ఆలోచిద్దామనుకుని ఆ ప్రయత్నం మానుకుంది.





గ్రంథి విజయలక్ష్మి

విశాఖపట్నం లయన్ లేడీస్‌క్లబ్బు 1978 – 79 అధ్యక్షురాలు శ్రీమతి గ్రంథి విజయలక్ష్మీమంగ రాజు మంచి ఉత్సాహవంతురాలైన కార్యకర్త. లయనిజంలో విశ్వాసం కలిగి, ఆ సంస్థ తరఫున గడిచిన తొమ్మిది సంవత్సరాలుగా అవిరళ కృషి చేసి విశాఖ లయన్ లేడీక్లబ్బులో డైరక్టరుగా, కార్య దర్శిగా గతంలో పని చేసి తన సామర్థ్యాన్ని నిరూ పించుకున్నారు. ఈ సంవత్సరం జరిగిన లయన్సు సంస్థ రీజినల్ కాన్ఫరెన్సులో ఆమెకు "ఉత్తమ అధ్యక్షురాలు" అవార్డు లభించింది. క్రిందటి సంవత్సరంలో ఆమె యూరోపు, అమెరికా, కెనడా, జపాను, హాంగ్‌కాంగ్, మలేషియా, సింగపూర్ లలో పర్యటించి, ఆయా దేశాలలో అంతర్జాతీయ లయన్సు క్లబ్బులు పని చేస్తున్న తీరుతెన్నులను తెలుసుకున్నారు. చికాగోలోని "లయన్సు ఇంట ర్నేషనల్"ను సందర్శించారు. వీరి అధ్యక్షతలో విశాఖ లయన్ లేడీస్‌క్లబ్బు గణనీయమైన సేవ చేసింది. గూడెం ప్రజలకు ఉచిత వైద్యసదు పాయాలు కలుగజేయటం, పసి పిల్లలకు వ్యాధి నిరోధక ఇంజక్షన్స్ ఇప్పించడం, మూగ చెవిటివారి శిక్షణా కేంద్రంలో వృత్తి విద్యకు గాను తగిన ఏర్పాట్లు చేయడం, "మిరియం చిల్డ్రన్స్‌హోమ్" లోని పిల్లలకు ముతక దుప్పట్లను పంపిణీ చేయటం, మెంటల్ హాస్పిటలులో చికిత్స పొందుతున్న వారి నిమిత్తం కొన్ని గ్రంథాలు, ఆటలకు పనికి వచ్చే సాధనాలు సరఫరా చేయటం, అగ్ని ప్రమాద బాధితులకు ఉచిత భోజన సదుపాయాలు చేయటం, వికలాంగులైన పిల్లలకు, బీద విద్యార్థులకు ఆర్థి కంగా సహాయం చేయటం మొదలైన అనేక సమా జిక సేవా కార్యక్రమాలను ఆ క్లబ్బు తరఫున నిర్వహించారు. ఆమె భర్త శ్రీ మంగరాజు విశాఖ లయన్సుక్లబ్బు లయజన్ ఆఫీసరు. —విలేకరి

'ఊహుఁ....ఇద్దరూ కావాలి' అంది— చిన్నప్పుడు రెండు చాక్లెట్లూ తనకే కావా లన్నంత తేలికగా. ఆమె తల్లి బెంబేలు పడిపోయింది—ఇదెక్కడి విడ్డూరం అని.

చివరికి ఆ ప్రాణ స్నేహితులిద్దరూ సరోజ కలిసి చర్చించారు. ఒక నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయం ప్రకారం — జూన్ ఒకటిన ఆ యిద్దరి చేత తాళి కట్టించుకుంది సరోజ—పెద్దలందరి సమక్షంలో.

"నన్నేం చెయ్యమంటారు? నేను యిద్దర్నీ ప్రేమించాను. ఇద్దరిలో ఏ ఒక్కరు లేకపోయినా బతకలేను" అందట సరోజ. పాపం వాళ్ళిద్దరూ కూడా ప్రాణ స్నేహితు లాయె. ఒకర్ని విడిచి ఒకరం వుండలేం అన్నారట. కాళ్ళకి నమస్కరించిన యిద్దరు అల్లుళ్లనీ రెండు చేతుల్తోనూ దీవించిందట ఆ అత్తగారు చేసేదిలేక!

ఓ జోన్ ఆఫ్ ఆర్క్, ఓ మేడమ్ క్యూరీ, ఓ రాణీరుద్రమ, ఓ ఝాన్సీలక్ష్మి - వీళ్ళ పేర్లు మరిచిపోండి! ఎందుకంటే అవి ఉప్పు సముద్రంలో హంసరెట్ట!

ఎవడో తాగుబోతు వాగిన వాగుడుకి ప్రాముఖ్య మిచ్చి, సీతని లోకం ముందు కులటగా నిర్ణయించి అడవులపాలు చేసిన రాముడు స్త్రీ జాతికి న్యాయం చేకూర్చినట్టేనా? ద్రౌపదిని ఒక పండులా ఐదు భాగాలుగా పంచుకున్న పాండవులు స్త్రీకి సమాన హక్కులు ఇచ్చినట్టా? భర్తలూ సంసారాలూ ఉన్నా కూడా పదహారు వేలమంది గోపికా స్త్రీలని కృష్ణుడి ప్రియురాళ్ళుగా చేసిన మన పురాణాలు ఏమి నీతిని చాటేయి? స్త్రీ ఒక విలాస వస్తువనే కదా! ఒక దేశ నాయకుడుకాని, రాజకీయ నాయకుడుకాని అమ్మాయిల భుజాల మీద చేతులు వేసిన బొమ్మలు పేపర్లలో చూసి ప్రజలు— "ఆహా! ఓహో! ఏమాయన ఔదార్యం! ఏమి విశాల హృదయం!" అని పొగుడుతారు. అతడి మనసులో ఏ విధమైన సెక్సువల్ ఫీలింగ్సూ ఉండవని నమ్ముతారు. కాని ఆ నాయకుడి సతీమణే అబ్బాయిల భుజాల మీద చేతులేసి తిరిగితే ఆమె భర్తగారుకాని, ప్రజలుకాని, "ఆహా! ఓహో!" అంటారా? ఆమెకు దురుద్దేశం అంటగడతారు.

సాహిత్యంలో కూడా స్త్రీ, పురుషుడికన్నా హీనమైన జీవిగానే చిత్రించబడుతోంది. ఆఖరికి రచయిత్రులు కూడా, స్త్రీని పురుషుడికన్న ఉన్నత మైనదానిగా కాకపోయినా సమానమైనదానిగానన్నా తమ రచనలలో ప్రతిబింబించకుండా ఉన్నారు. స్త్రీ పురుష శిశువులిద్దరి జననానికి కారణభూతమైనది స్త్రీయే కనుక ఆమె ఎప్పుడూ సుపీరియర్ బీయింగ్ అన్నది ప్రకృతే ఒప్పుకుంది. కాని పురుష ప్రపంచం మాత్రం ఒప్పుకోదు. ఇంక పత్రికలూ, సినిమాలూ, రేడియోలూ ఏం చెప్తాయి? కుట్లు, అల్లికలు, వంటకాలు వగైరాలే తప్ప స్త్రీ ఇన్ ఫీరియర్ స్టేటస్ గురించి చెప్పవు. భరతనాట్యం పేరిట స్త్రీని అర్ధనగ్నునుచేసి మగాడు ఆహ్లాదం పొందుతాడు. ప్రతి కళలోనూ వ్యభిచారం ఎంత? కళ ఎంత? ఎవరు గమనిస్తున్నారు కనక? వ్యభి చారానికి ఎర్ర రిబ్బన్ కట్ చేసినవాళ్ళూ పురుషులే కదా! కాని వ్యభిచారం అనగానే చప్పున ఆడదాని పాత్ర పైకి కనిపించేలా ఎన్ని ప్రచారాలు! "ఫలానా ఊళ్లో వ్యభిచార గృహాలపై దాడి.... నలుగురు స్త్రీలు అరెస్టు" అని పత్రికల్లో చూస్తూం టాము. ఆ నలుగురు స్త్రీలతో వ్యభిచరించిన పురుషు లేమైనట్టు?

ఆడదాని విషయంలో మనదేశంలోనే కాక తెల్లదేశాలలోనూ ఎన్నో అన్యాయాలు జరుగు తున్నాయి. ఎటొచ్చీ డబ్బు మత్తు యొక్క పై జిలు గుల్లో అక్కడ అసమానతలు కనబడవు. అక్కడ స్త్రీ ఈక్వల్ స్టేటస్‌లో ఉందని తప్పుడుగా అను కోవడం జరుగుతోంది. ఆడది అమ్మబడుతోంది, కొనబడుతోంది. ఆమె అందాలు ప్రపంచంలో వాణిజ్య విస్తరణకి, లాభాలు లాగడానికి, వస్తువులు అమ్మబడడానికి ఉపయోగించుకోబడుతున్నాయి. ఇంక సినిమా ప్రపంచంలో సరేసరి!

మగువ విషయంలో మగరాయళ్లు ఏం చేసినా చెల్లుతుంది. తప్పంతా ఆడదానిదే! ఎంచేత? తిరగబడి ఎదిరించలేదు కనక! ఎవరో ఒక్కరు ఎదిరిస్తే అవదు కదా? లక్షలూ కోట్లూ ఎదిరించాలి.

లెక్కల ప్రకారం ట్వంటీ ఫస్ట్ సెంచరీ చివరకైనా స్త్రీ పురుషుడితో సర్వ సమానత్వం సాధించగలదని ఆశిద్దాం!

—బులుసు రామలక్ష్మి



మద్రాసు కేసరీ కుటీరం వారి 'గృహలక్ష్మి స్వర్ణకంకణం' 1979 సంవత్సరానికి డాక్టర్ నాయని కృష్ణకుమారికి లభించింది. ఆమె ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడర్‌గా వుంటున్నారు.

తెలుగు జానపద సాహిత్యంలో విశేషమైన కృషి సల్పిన శ్రీమతి కృష్ణకుమారి 1970లో ఉస్మానియా విశ్వవిద్యాలయం ద్వారా తెలుగులో డాక్టరేట్ పట్టం పొందారు. ఆమె థీసీస్ 1978లో 'తెలుగు జానపద గేయ గీతాలు' పేరిట పుస్తక రూపంలో ప్రచురింపబడింది.

ఆమె రచించిన యితర గ్రంథాలు-'ఆంధ్రుల కథ', 'ఆ యా థా' (కథానికల సంపుటి), 'అగ్ని పుత్రి' (కవితల సంపుటి), 'పరిశీలన', 'పరిశోధన', (తెలుగు భాషపై విమర్శనాత్మక వ్యాస సంపుటాలు), 'కాశ్మీర దీపకళిక', 'మనము – మన పూర్వులు', 'గౌతమి' (నవల), 'అపరాజిత' (మరో ముగ్గురు రచయిత్రులతో కలిసి రచించిన గొలుసు నవల).

శ్రీమతి కృష్ణకుమారి ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు అధ్యక్షురాలు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ప్రచురించిన 'శృంగార శాకుంతలము'నకు ఆమె సంపాదకత్వం వహించారు. కేంద్ర సాహిత్య అకాడెమీ కొరకై అనేక సాహితీ గ్రంథాలను ఆమె అనువదించారు. అనేక సాహిత్య సంస్థలలో ఆమె సభ్యురాలు. ప్రఖ్యాత కవి 'కళాప్రపూర్ణ' నాయని సుబ్బారావుగారి కుమార్తె ఈమె. శ్రీమతి కృష్ణకుమారి శ్రీ మధుసూదనరావు దంపతులకు ఒక కుమార్తె, ఇద్దరు కుమారులు.

'గృహలక్ష్మి' స్వర్ణకంకణం పొందిన సందర్భంగా డాక్టర్ నాయని కృష్ణకుమారికి 'వనిత' తన అభినందనలను తెలియజేస్తోంది.



లయన్ లేడీస్ ఆక్సిలియర్, విశాఖపట్నం సౌత్ యిటీవల అప్సరా హొటలు కిన్నెరా ఆడిటోరియంలో లయన్స్ మహిళా విభావరి అతి వైభవంగా జరుపుకున్న సందర్భంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న శ్రీమతి చంద్రా సోమయాజులు మాట్లాడుతూ అంతర్జాతీయ బాలల సంవత్సరంగా పరిగణిస్తూన్న ప్రస్తుత సంవత్సరంలో శిశు సంక్షేమ కార్యక్రమాలను ముమ్మరంగా చేపట్టాలని అన్నారు. కార్యదర్శి లయన్ లేడీ వసుంధరారెడ్డి దక్షిణ విశాఖ లయన్ లేడీస్ క్లబ్బు నిర్వహిస్తున్న సామాజిక సేవా కార్యక్రమాలను వివరించారు. —విలేకరి

# వార్తావని(త)

భిలాయ్ ఆంధ్ర మహిళా మండలి వార్షికోత్సవాలు యిటీవల వైభవంగా జరిగాయి. అధ్యక్షురాలు శ్రీమతి అచ్యుతకుమారి ఆధ్వర్యంలో జరిగిన ఈ వుత్సవాలకు ముఖ్య అతిధిగా డాక్టర్ శాంత కుమారి విచ్చేశారు. మహిళా మండలి సభ్యులు 'పేరేం పెడదాం?' నాటికను ప్రదర్శించారు. ఆ నాటకంలో ప్రధాన పాత్రలను పోషించిన శ్రీమతి భ్రమరాంబ, కుమారి నాగేశ్వరి, శ్రీమతి సత్యవతి, శ్రీమతి నాగమణి, కుమారి దేవి, శ్రీమతి కమల ఈ చిత్రంలో వున్నారు. రచన-దర్శకత్వం శ్రీమతి సంధ్యాసుందరి నిర్వహించారు. —'భరణి'








**వ**నిత రాగానే మాటల కొలువు కోసం వెతుక్కునే మావంటి పాఠకులకు ఆ పేజీకి వినియోగించే రఫ్‌గా ఇంక్ పీలుస్తుండే పేపర్ చాలా ఇబ్బందిని కలిగిస్తోంది. కనీసం ఆ ఒక్క పేజీకైనా మంచి పేపర్ వేయుటకు ప్రయత్నించ ప్రార్థన.

—కె. ఎన్. సుబ్బలక్ష్మి, పాలకొల్లు

**[బాల్ పాయింట్‌తో నింపవచ్చునే —వ. సం]**

శ్రీమతి కస్తూరి సరస్వతిగారు 'భాషలు నేర్చుకోండి' శీర్షిక అనవసరమని వ్రాసిన దానిని చూచి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. శ్రీవారి ఉద్యోగ రీత్యా వివిధ రాష్ట్రాలు తిరుగుతున్న మాకు ఈ శీర్షిక చాలా ఉపయోగకరంగా వుంది. త్రివేండ్రం వచ్చిన నెల రోజులలోనే నేను, మా పిల్లలు మలయాళం చదవడం నేర్చుకున్నాము. ముఖ్యంగా ఈ శీర్షిక కోసమే చందా కట్టి వనిత'ను తెప్పించుకుంటున్నాము. దయచేసి ఆ శీర్షిక మానవద్దు.

—పి. సరళాప్రసాద్, త్రివేండ్రం

వనితలో ప్రచురిస్తున్న వివిధ రకాలైన బ్యాగులు చాలా బాగున్నాయి. అవి అల్లడానికి ఉద్యుక్తుల మౌతున్నాము. ప్రముఖ వ్యక్తులను పరిచయం చేసేటప్పుడు ఆంధ్ర ప్రాంతం వారిని ఎక్కువగా పరిచయం చేయడం లేదు. ఎంతోమంది ఎన్నో విద్యలలో ప్రవీణులయినవారు ఉన్నారు. వనిత సినిమారంగంలో కూడ ప్రవేశిస్తే బాగుంటుందేమో. జాతీయ స్థాయిలో 'ఉత్తమ నటి' అవార్డు పొందిన శ్రీమతి శారద, ముఖచిత్రం, ఆమెతో గోష్ఠి వేస్తే బాగుంటుందని మా అభిప్రాయం.

—ప్రమీల, కాంతి, విశాఖపట్నం

జూన్ 'వనిత' సంచికలోని 'వెన్నెల వాన' కథానిక మాకెంతో నచ్చింది. ఆ కథానికలోని హేమంతి పాత్ర మా మనసులను కదలించి వేసింది. హేమంతిలాగా నిస్సహాయంగా తమ జీవితాలను బలి చేసుకొన్న వనితలు మన నిత్య జీవితంలో ఎంతోమంది తారసపడుతుంటారు. ఈ కథ మన సమాజంలోని తీరుతెన్నులకు దర్పణం పట్టింది. రచయిత్రి శ్రీమతి ఆలూరి విజయలక్ష్మిగారికి నా అభినందనలు.

—రాచుమల్లు ఇందిర, పులివెందుల

వనిత జూన్ సంచిక ఎంతో చక్కగా మనసులను ఆకట్టుకొనేలా వున్నది. అందుకు మీకు నా అభినందనలు. ఇక్‌బానాతో కొత్త ప్రక్రియ ఫోటోలు బాగున్నవి. వర్షఋతువు ఇక్‌బానా పద్ధతి ద్వారా ఎంతో చక్కగా అమర్చారు. అది చూసి చాలా ఆశ్చర్యపోయాము. అలాగే మిగతా ఋతువుల ఫోటోలు ప్రచురించాలని కోరుతున్నాను. రత్నకుమార్ పరిచయం బాగుంది. పుట్టినరోజుల శీర్షిక ఇంక నిలిపివేసిన బాగుంటుందని నా అభిప్రాయం. ప్రలోభం కథానిక కూడా చక్కగా వున్నది. రచయిత్రికి అభినందనలు.

—ఆర్. ఇందిర, కోరసుంటపల్లె

'వనిత'లోని 'అవి-ఇవి' 'వంటలు' 'వైద్య విశేషాలు' 'పెరటితోట పెంపకం' మొదలైన శీర్షికలు మాకెంతో లాభదాయకంగా వుంటున్నాయి. వీలైతే 'క్రాస్‌స్టిచ్' డిజైన్సు వెయ్యగలరు. క్రోషియా డిజైన్సు కూడా వేస్తారని ఆశిస్తున్నాను.

—బి. కస్తూరి, భోపాల్

జూన్ వనితలో అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా మీరు ప్రచురించిన "బాలల స్వర్గం" బాగుంది. రష్యాలో స్త్రీలు, ప్రభుత్వం కూడా బాలలకు ఎంతో ఆదరణ ఇస్తూ, ఎన్నో సౌకర్యాలు లభించేలా చేశారు. చదువుతుంటే నిజంగా రష్యా భూతల స్వర్గం-బాలల స్వర్గం అనిపించింది. మన దేశంలో గర్భిణీ స్త్రీలకు తగిన రక్షణ కల్పించి, వారి ఆరోగ్యాన్ని నెలనెలకూ రికార్డ్ చేసుకొని తగిన చర్యలు తీసుకొనే "పాలిక్లినిక్స్" ఎప్పుడు నెలకొల్పుతుందో ప్రభుత్వం!

—గుత్తికొండ సుధారాణి, కొల్లూరు

జూన్‌నెల వనితలో డాక్టర్ విజయలక్ష్మిగారి వెన్నెల వాన కథ బాగుంది. వైజ్ఞానిక సమస్యల్ని ఇతివృత్తంగా తీసుకుని వాటికి పరిష్కారం చూపటం ఆమె ప్రత్యేకత. టెస్ట్‌ట్యూబ్ బేబీ గురించి పత్రికలలో చదివినప్పటికీ అందరికీ అర్థమయ్యేలా కథ లాగా వ్రాయడం అభినందనీయం. బాలల స్వర్గం చదివిన తరువాత మన దేశం ఎన్నేళ్ళకైనా అటువంటి సౌకర్యాలు కలుగచేస్తుందా అన్న సందేహం రాకమానదు. జనాభా ఇలాగే పెరుగుతుంటే బాలల అంతర్జాతీయ దశాబ్దాలు ఎన్ని ప్రకటించినా ప్రయోజనం శూన్యం.

—కె. విజయలక్ష్మి, కోలార్ గోల్డ్ ఫీల్డ్

మా(మీ) వనిత నెలనెలా ఆకర్షణని పుంజుకుంటోంది. నా కన్నిటిలోను ముఖ్యంగా నచ్చింది 'దేవాలయాల శీర్షిక'. ఈ శీర్షికలో ఎంతో వివరంగా గుడుల గురించి, ఆ స్థల ప్రాముఖ్యం గురించి వ్రాస్తున్నారు. ఈ నెల 'వనిత'లో అన్నవరం దేవాలయ ప్రాముఖ్యత గురించి ఎంతో చక్కగా వివరించారు. దేవాలయ చిత్రాలు కూడా ఎంతో ఆహ్లాదకరంగా వున్నాయి. ఆ స్థలానికి వెళ్ళి చూచిన అనుభూతి చెందాము.

—పి. కమల, కాకినాడ

# చిట్టికథలు

లోగడ 'వనిత'లో మీరు 'చిట్టికథలు' పేరిట ఎన్నో కథలు చదివారు. ఆ కోవలో మీరు కూడా చిట్టికథలు రాసి పంపడానికి ప్రయత్నించకూడదూ?—

కథలు రాయాల్నని ఉత్సాహపడేవారు ఏ చిన్న సంఘటననయినా తీసుకుని 'చిట్టికథ'గా రాయవచ్చును; కథలు రాయడం మీద తమకు గల ఉత్సాహాన్ని పెంపు చేసుకోవచ్చును.

రావు సైజులో పేజీన్నరకు మించకుండా వుండే మీ చిట్టికథ ఏమాత్రం బాగున్నా సవరించి, ప్రచురించడానికి 'వనిత' సిద్ధంగా వుంది.

ప్రచురించి చిట్టి పారితోషికం కూడా పంపుకుంటుంది!

మరి, ప్రయత్నించండి!

## వనిత మాటల కొలువు - 47

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 క్షే | 13 రో | ద | 14 క | న్యా | 15 యు | 16 ము | |
| | ద | | ళ | | 2 మి | ర | 17 ప |
| 3 అ | ని | 18 త | | 19 హై | | 4 ళ | పా |
| ది | | ది | గు | మ | 20 తి | | క |
| 6 సా | మః | యు | | | 7 అ | 21 ప్ర | ము |
| రి | | | 8 గ్లా | 22 ని | | కా | |
| 9 క | 23 ప్రు | 24 వ | | 10 లు | పా | | 25 ని |
| | 11 ప | ని | | పు | | 12 పే | డ |

ఈ సమాధానంతో సరిపోయే సమాధానాలు పంపిన వారు ముగ్గురు. వారు :

1. ఎస్. శమంతకమణి, విశాఖపట్నం
2. ఎస్. నాగవర్ధని, నూజివీడు
3. ఎస్. విజయలక్ష్మి, మదపనూరు

బహుమతి మొత్తం రూ. 150 లను వారికి సమానంగా పంచి అందజేస్తున్నాము.




## లయ తప్పిన విన్యాసం
(నవల)

**[రచన: వేదుల శకుంతల; ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు-1. వెల: రూ. 3-50]**

ఇది ఒక మంచి నవల. చదివించే నవల. చదవ తగ్గ నవల. చక్కగా, సాంప్రదాయబద్ధంగా జీవితపు విలువలు తెలుసుకుంటూ పెరిగిన లలిత తన మనస్సు చంద్రం బావకు సమర్పించుకుంది. వాళ్ళది కేవలం శారీరక ఆకర్షణ కాదు. హృదయారాధన. ఒకరి ఊహలో ఒకరు పెనవేసుకుపోయిన ఆవేదన అది. కానీ ఒక దుర్ముహూర్తాన జగదీష్ అనే ఫారిన్ రిటర్న్డ్ మేనత్త కొడుకు పశుతృష్ణకు బలైపోయింది లలిత. మలినమైన తనను చంద్రానికి అర్పించుకోలేక, డబ్బుకు, హోదాకు ఆశపడింది అనే నిందనైనా భరించి, చంద్రాన్ని ఒప్పించి జగదీష్ భార్య అయింది. ఆ తరవాత ఆమె జీవితమే లయ తప్పిన విన్యాసం. ఆమె నడవడికకు, మనస్తత్వానికి, సంస్కారానికి, అన్నివిధాలా వ్యతిరేకి అయిన జగదీష్ వలన అసహ్యకరమైన అల్ట్రా మోడరన్ జీవన విధానం వల్ల లలిత హంతకురాలిగా మిగిలిపోయింది.

నవలలో చక్కని సన్నివేశాలు చాలా ఉన్నాయి. చంద్రం, జగదీష్ భార్య అయిన లలితను చూడటానికి రావడం సన్నివేశం, ఆ తరవాత సంఘటనలు, సృష్టించడంలో రచయిత్రి మనఃస్పందన, రచనాశక్తి బయటపడ్డాయి. ఈ అధ్వాన్నపు అధునాతన జీవన విధానంతో ఏ మాత్రం సరిపెట్టుకోలేని లలితలాంటి ఇల్లాళ్ళు కార్లు, హోదాలు, మేడలు మిద్దెలు ఉన్నా, ఎంత కుమిలిపోతున్నారో, మానసికంగా ఎంత నాశనమవుతున్నారో ఈ నవల చెప్తుంది.

## "శిథిలాల నుంచి శిఖరాలకు"
(నవల)

**[రచన: వవని నిర్మల ప్రభావతి; ప్రచురణ: ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు-1; వెల: రూ. 3-50; పేజీలు: 152]**

ఇది మామూలుగా చదివి మర్చిపోయే కథ కాదు. అక్షరాల రూపంలో సాక్షాత్కరించే 'అంబిక' అనే అభాగ్యురాలి జీవితం. 'రచన' అనేది ప్రొఫెషన్‌గా తీసుకోకుండా, సాంఘిక బాధ్యతగా తీసుకునేవారు కూడా మనకు ఉన్నారు అనిపిస్తుంది ఈ రచన చదివితే.

"మన దేశంలో స్త్రీలకూ – కన్నీళ్ళకూ అవినాభావసంబంధం ఉంది. ప్రతి పదిమంది స్త్రీలలోను, సగటున ఎనిమిదిమంది స్త్రీల జీవితాల వెనక, కన్నీటి కడవలేకాదు, కడలులే ఉన్నాయి పరికించి చూస్తే" అన్నారు రచయిత్రి 'మనవి'లో. ఈ మాత్రం సానుభూతి, స్పందన సాంఘిక వ్యవస్థను పురోగమింప చెయ్య దలుచుకున్న రచయిత్రికి అవసరం.

ఆంధ్రదేశంలో పాల్ ఘాట్ అమ్మాయిలను కొనుక్కోవడం ఈనాటిది కాదు. డబ్బుతో అమ్మాయిని, అవసరాన్ని, శారీరక మానసిక దాస్యాన్ని కొనుక్కునే ఆంధ్రులు చాలా గొప్పవారని భ్రమిస్తాడు షణ్ముగం. "ఆంధ్రదేశంలో మనుష్యుల్ని, పశువుల్లా బేరమాడి, నాణ్యత చూసి కొనే మనుషులున్నారని, వాళ్ళు మహాత్ములుగా పూజింపబడతారని తెలుసుకుని ఆశ్చర్యం కూడా కలిగింది. డబ్బుని మనుషుల్ని కొనటానికి కూడా వెచ్చించే ఆంధ్రులంటే అసూయ కూడా కలిగిందా క్షణంలో" పవిత్రమైన, ఉన్నతమైన కనకదుర్గ కొండ, ఆ కొండ చుట్టూ వడ్డియాణం లాంటి పవిత్ర కృష్ణానది, మంచి మనుష్యులు మనసుతో వెలిగించిన కార్తీకదీపాల్లా అనిపించే కృష్ణాబారేజీ దీపాల కాంతితో ఎంతో అందమైంది విజయవాడ. ఆంధ్రదేశపు నడిబొడ్డు. కాని, అందమైన ఆ ఊరు మనష్యుల చేతిలో ఆంధ్రదేశపు అజ్ఞానానికి, మూర్ఖత్వానికి, బలహీనలతలకు పశుత్వానికీ, ప్రతీకగా నిలబడడం చూపారు రచయిత్రి. ఆంధ్రేతురుడైన షణ్ముగం ద్వారా "ఆంధ్ర" మీద మంచి స్టడీ చేశారు. సర్వరక్షణలు ఉండి, అహం తప్ప మరొకటి లేని సావిత్రిలాంటివారు పతివ్రతలుగా ఎలా చలామణి అవుతున్నారో, శరీరాన్ని, మనసును కూడా కేవలం ఊపిరి పీలవడం కోసరం తాకట్టుపెట్టుకున్న 'అంబికలు' ఏ నైతికన్యాయాల దృష్ట్యా పతితలయ్యారో ఒక్కసారి ఆలోచించమంటారు రచయిత్రి మనని. అనవసరమైన దర్జాలు, అర్థం లేని అహంకారాలు, అర్హతలేని వాడి పాదాలకింద కేవలం బలవంతుడు, అయిన కారణానికి నలిగిపోయే అంబికలు, వాళ్ళను క్షమించలేని 'ఇల్లాలితనాలు' - ఇవన్నీ ఈ నవలలో ఆత్మపరీక్షకు ప్రేరేపిస్తాయి.

## "ఒక ఆత్మ చెప్పిన కథ"
(నవల)

**[రచన: లల్లాదేవి; ప్రచురణ: ఎమ్. శేషాచలం అండ్ కో, మద్రాసు-1; వెల: రూ. 3-50; పేజీలు: 152]**

ఈ నవల చాలా తమాషాగా ఉంది. ఊహాతీతంగా ఉంది. కథలో కవిత్వముంది. భాషలో జిలుగుంది. ఏదో చెప్పాలన్న తపన ఉంది. ఇదే రచయిత్రి (?) మొదటి ప్రయత్నమే అయితే, భవిష్యత్తులో కవితా సుందరికి కావ్యాంజలి పట్టవచ్చు.

ఇది, ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడిపోయిన రెండు వేల అయిదువందల సంవత్సరాల నాటి గణతంత్ర వ్యవస్థను తెలియచెప్పే ప్రయత్నం. మానవజాతి చరిత్రలో మహనీయత ఒక్క గణతంత్ర వ్యవస్థలోనే ఉంది-అన్నారు. అసలు గణతంత్ర వ్యవస్థ అంటే ఏమిటి? దస్యులుగానూ అనార్యులుగానూ పేర్కొనబడి, చరిత్ర పుటలలో హీనంగా దాగిపోయిన మానవతెగకు గల ఔన్నత్యాన్ని, రాజకీయ పరిజ్ఞానాన్ని, పౌరుషాన్ని, ఈ ఇరవయ్యవ శతాబ్దపు ఉత్తరార్థంలో ప్రేమోపహతుడు, శుద్ధ ఛాందసుడు అయిన 'ఆచారి'కి అర్థమయ్యేంత బాగా తెలియచెప్పిన 'ఆమె' ఎవరు? నగనిక – దాదాపు రెండు వేల సంవత్సరాలక్రితం, ఆర్యులకు దాస్యం చెయ్యడానికి లొంగక ఆత్మాహుతి చేసుకుని, తండ్రి ఆశీర్వచనంతో, అనార్యులుగా పేర్కొనబడ్డవారి అద్భుత నాగరికత, తాత్విక చింతన, స్వేచ్ఛాప్రియత్వం భవిష్యత్వర్గాలకు చెప్పడానికి మిగిలిన "ఆత్మ" – అష్మత్ పేటలో, ఆర్కియాలాజికల్‌వారు తవ్వగా బైటపడ్డ రాకాసి గుడిలో ఆమె 'ఆచారి'కి సాక్షాత్కరిస్తుంది.

హైద్రాబాద్ నగరపు సుందర ప్రదేశాలు, శిథిలాలైన మహాద్భుత రాజ ప్రాకారాలు, మౌనంగా, సుందరంగా మహత్తరంగా ఉండే సమాధులు, జీవితాలను పణంగా ఒడ్డి దాచుకోవలసిన ఊహాతీత సౌందర్యాలు, ఫ్యూడలిజంలో మిగిలిన కళాత్మకమైన సౌందర్య ఝరులు – ఇవన్నీ మనకి నవలలో దర్శనమిస్తాయి.

Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

REGD. No. TN/MS(S)/64 VANITHA (Telugu) July